# పశువైద్యవస్తుగుణదీపిక.





గ్రంథకర్త:

యేజెళ్ల శ్రీరాములుచౌదరి.

చతుర్థపుష్పము.

ఓం.

# పశువైద్యవస్తుగుణదీపిక.

గ్రంథకర్త:

యేజెళ్ళ శ్రీరాములు చౌదరి,

అంగలూరు, కృష్ణాజిల్లా.



బెజవాడ:

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాలయందు

క. కోదండరామయ్య గారిచే

ముద్రింపఁబడియె.

1929.

రిజస్టర్డు కాపీరైట్.] [వెల రు 2.

# పశుచికిత్సాలయము.

అంగలూరు, (కృష్ణాజిల్లా).

## అభిమానులు

మ.రా.రా.శ్రీ శ్రీమంతు రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహాదర్ జమీందారుగారు, చల్లపల్లి.

,, రావుబహాద్దరు బొల్లిని మునుస్వామిచౌదరి, బి.ఎ. బి.యల్., ఎమ్. ఎల్. సి. గారు, జస్టిస్‌పక్షనాయకులు, చిత్తూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు.

,, కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య చౌదరిగారు, కమ్మసంఘాధ్యక్షులు, బందరు.

,, రాజా వాశిరెడ్డి శ్రీ చంద్రమౌళీశ్వరప్రసాద్ బహాదర్ మన్నెసుల్తాన్ గారు, ముక్త్యాల జమీందారు.

శ్రీదుర్గా సదాశివేశ్వరప్రసాదు బహాదరుగారు జయంతిపురం జమీందార్లు.

చిరుమామిళ్ళ వెంకటకృష్ణయ్య నాయుడుగారు, ప్రొప్రయిటర్, చల్లపల్లి.

రాజా వాసిరెడ్డి మాణిక్యప్రసాద్ బహాద్దర్ మన్నెసుల్తానుగారు, బందరు.

రాజా చెరుకూరు పద్మనాభప్రసాద్ బహాద్దరు మన్నెసుల్తానుగారు, బందరు.

అడుసుమిల్లి గోపాలకృష్ణయ్యచౌదరిగారు, రెడ్డిగూడెం రంగాపురం జమీందార్లు, గుడివాడ.

మ.రా.రా.శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు గారు, ఆంధ్రపత్రికాధిపతులు, మదారాసు.

" పింజల సుబ్రహ్మణ్యం శెట్టిగారు, సమదర్శిని పత్రికాధిపతులు, మదారాసు.

" రావుబహద్దరు ఆర్. కృష్ణారావు భాంస్లేగారు, ఎమ్. ఆర్. ఎ.యస్., మదారాసు.

" చేమకమళ్ళ రాజగోపాలరావుపంతులు గారు, బి. ఏ. ఎమ్. ఎమ్. ఆర్. ఎ. యస్. ఎమ్. ఎస్. ఎమ్. యు. మదారాసు.

" జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరిగారు యం. యల్. సి. గుంటూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు.

" మోతే గంగరాజు జమీందారుగారు, ఏలూరు.

" తహశవార్ ఓ జలాదత్ దస్తగహ శ్రీ రాజా వెంకట్రామయ్యప్పారావుబహద్దరుమీర్జాపురం జమీందారుగారు, కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు.

" ఆచార్య గోగినేనిరంగనాయకులుగారు. బి. లిట్. ఆక్సుఫర్డు రీసెటిల్ మెంటుసెక్రిటరీ, మద్రాసు.

" మాగంటి బాపినీడుచౌదరిగారు, బి. యస్. సి (కార్నెల్) యం. యస్. సి. (కాలిఫోర్నియా) ఎగ్రికల్చర్, ఏలూరు.

" కల్లూరి చంద్రమౌళిగారు, బి. యస్. సి. (వ్యవ) బర్డీ, మోపర్రు.

" నాదెళ్ళ వెంకటదాసుగారు, బి. యస్. సి. (వ్యవ) బర్డీ, కపురరం.

రా.రా.శ్రీ గోటేటి జోగిరాజుపంతులుగారు, డిప్లొమేట్ అండు మెడలిస్టు యిన్ ఎగ్రికల్చరు.

" కవిరాజ త్రిపురనేని రామస్వామి చౌదరిగారు, శతావధాని, మ్యునిసిపల్ చేరుమన్, తెనాలి.

" బ్యారిస్టరు లింగం వీరభద్రయ్య చౌదరిగారు, మద్రాసు.

" బ్యారిస్టరు కె. కోటిరెడ్డిగారు, యమ్. యల్.సి. కడప.

" బిక్కిని వెంకటరత్నం చౌదరిగారు, ఎమ్. ఎల్. సి. రామచంద్రపురం తాలూకాబోర్డు ప్రెసిడెంటు.

" మాడి నరసన్నగారు, రైతుపత్రికాధిపతులు, రాజమండ్రి.

" కె. రమణయ్యా నాయుడుగారు, బి. ఏ. బి. యల్, బందరు.

" నూతక్కి రామశేషయ్యచౌదరిగారు, బి.ఏ.బి.ఎల్. బెజవాడ.

" యార్లగడ్డ రంగనాయకులునాయుడుగారు, జమీందారు, కనుమూరు.

" బొప్పరాజు రామకృష్ణరాజులు బి. ఏ. బి. యల్. గారు, చిత్తూరు.

" రాజాశ్రీ పానుగంటి వెంకటరంగాయినింగారు, కాళహస్తి.

" అడ్డసమల్లి హరినీడుచౌదరిగారు, భూస్వామి, గుడివాడ.

# తొలిపలుకు



**వ్యవసాయమే** ముఖ్యవృత్తిగాగల మన భారతదేశమున పశుపోషణ మత్యంతావశ్యకమనుట నిర్వివాదాంశము. రైతుజీవనము కండపుష్టిగలదిగా నుండిననేగాని దేశము స్వశక్తిమీద నాధారపడజాలదు. రైతుబిడ్డకు పశుసంపద మూలబలము. భారతీయుల దైనికజీవనము పశుసంపత్తిమీద ముఖ్యముగా నాధారపడియున్నది. ఆవిరియంత్రములు లెక్కకుమిక్కిలిగ ప్రకటిల్లుచున్న యీ యాధునికకాలమునగూడ వ్యవసాయనిర్వహణమునకు పశువుల సాహాయ్యము తప్పనిసరియగు విధమును సమకాలిక వ్యవసాయశాస్త్రజ్ఞులు గుర్తించుచునేయున్నారు. కాని ఈ ప్రాముఖ్యవిషయము రైతువర్గముయొక్క దృష్టిపథమునుండి విరమించుచుండుట సంతాపకరమైన విషయము. పశుసంతతియొక్క ఆరోగ్యసంపదలమీదనే తనయొక్క బలాబలములాధారపడి యున్నవను విషయమును రైతుసోదరులెంతశీఘ్రముగ గుర్తించిన నంతమేలు. భగవత్సృష్టి పరిణామావస్థయందు ప్రకృతిరూపక కష్టనష్టములు నోరులేని పశువర్గమునకుగూడ దప్పినవికావు. అందువలన వ్యాధిరూపక కష్టములకు లోనగు గోగణము నట్టి యిక్కట్టులనుండి తప్పించుట పశుసాహాయ్యము తనజీవయాత్ర కుపయోగించుకొను మానవుని కనీసధర్మము. పశువులవలన సంపూర్ణలాభముపొందు రైతుబిడ్డలమాట యటుండ జీవకారుణ్యమే సహజప్రవృత్తిగాగల మానవునకు తన 'తోడిజీవి' యగు పశుసముదాయమును, దుర్భరమగు రుగ్మతవలన గలిగిన వేదనానలమునుండి తప్పింప

ప్రయత్నించుట తప్పనిసరి యగుచున్నది. అందులకు ప్రపంచ పరిణామ నిర్దిష్టమునకు తోడ్పడిన మహనీయులు మన కనేక శాస్త్రములను ప్రకృతిగా నొసంగియున్నారు. వానిని పోషించుటయు, పోషించి ప్రచురించుటయును మనకర్తవ్యములు.

ప్రాచీనభారతీయ విజ్ఞానపతాకము నింకను దేశదేశముల నెగురవేయుచున్న శాస్త్రములలో వైద్యశాస్త్రము గూడ నొకటి. పశువుల యమూల్యవిలువను గుర్తించిన మన పూర్వులు పశువైద్యసూత్రములం గరతలామలకముగ నెరింగి యుండిరి. ఆసూత్రము లించుమించు "జనవాక్య"సదృశములై యుండుట గ్రామజీవనరహస్యమును గుర్తెరింగినవారి కందరికిని సువ్యక్తము. అట్టి యమూల్యశాస్త్రసంచయములు రాను రాను కాలప్రవాహములో బడి రూపుమాయుచున్నవి. ఇందులకు రెండుకారణములు గలవు. వాడుకలోనున్న వైద్యసూత్రములు విశేషించి గ్రంథస్థమొనరింపకపోవుటొకటి. రైతులకు పశుపోషణము మీదగల యనురాగము సన్నగిలుట రెండు. ఇందులో మొట్టమొదటి లోపమును దీర్పనుద్యమముతో శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములుచౌదరిగారిదివరకు "పశువైద్యచింతామణి" "పశునేత్రచికిత్స" "పశువ్రణచికిత్స"మున్నగు గ్రంథములను స్వానుభవపరిచయముల నాధారపఱచుకొని, విరచించి యాంధ్రకృషీవలుల కర్పించియున్నారు. వానిలో బేర్కొనిన వివిధవస్తుగుణముల నిర్దేశోపయోగములనుగూర్చి ప్రస్తుత గ్రంథమగు నీ "పశువైద్యవస్తుగుణదీపిక" విరచింపబడినది. "పశుపోషణ" శీర్షికలో పశుపోషణావశ్యకత, పశుగణాహార

నిర్వచనము మున్నగువిషయములను జక్కఁగ నిర్దేశించియు న్నారు. "వస్తుగుణదీపిక"లో పశువైద్యశాస్త్రమునందలి సూత్రములను క్రియారూపకముగఁ బరిణమింపజేయుటకుగావలసిన విషయవిస్తరణమును, వస్తుప్రకృతియును జేర్కొనఁబడి యున్నవి. ఆంగ్లాయుర్వేదములందును, యూనానీవైద్యశాస్త్రమునందును ఒక్కొక్కమూలిక కొనగబడిన గుణములు సంపూర్ణముగ పేర్కొనబడియున్నవి.

దేశభాషలలో శాస్త్రపఠన మవసరమని గుర్తింపఁబడు నీకాలమున నిట్టివస్తుశాస్త్రగ్రంథము లెంతయుఁ బ్రోత్సహింపఁదగినవి. శ్రీరాములుచౌదరిగారు పల్లెటూళ్ళలో నానాటికి చివికి రూపుమాయుచున్న పశువైద్యశాస్త్రమును పునరుద్ధరించి భావి కృషీవలుల కత్యంతకృతజ్ఞతాపాత్రులైరి. ఇట్టి ప్రాముఖ్యగ్రంథప్రచురణమునకు దోహదమొసంగి, సామాన్యజీవనమునందలి కష్టనష్టములలో తాము పాల్గొనజూచుట శ్రీచల్లపల్లి రాజాగారి మహోన్నత గుణసంపదకును ప్రపంచపరిణామ సూత్రవిజ్ఞానమునకును నిదర్శనమై యున్నది. కర్షకజన భూస్వాములకు మధ్యగల సుహృద్భావసమృద్ధికిని ప్రబలనిదర్శనము గాకమానదని మనవి.

మకాం:
శాస్త్రపాళెటుక్లబ్బు,
మదారాసు,
16—12—29.

ఇట్లు
బొల్లిని మునుస్వామినాయుడు.
బి. ఏ., బి. యల్., యమ్. యల్. సి.,
చిత్తూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటు.

# విజ్ఞాపనము.

'పశువైద్యచింతామణి' ప్రచురించినపిదప పశువైద్యగుణ దీపికయొక్క అవసరమును స్వానుభవమువలన గ్రహించితిని. అనేకమంది వైద్యులుగూడ నాసంకల్పమును బలపరచిరి. మిం తుకెందరో ప్రోత్సహించిరి. అప్పటినుండియు వస్తుగుణదీపిక నెంతశీఘ్రముగ ప్రచురించిన నంతమేలగునని గ్రంథమును పూర్తిగావించితిని. ఇంతలో దైవానుగ్రహముంలన శ్రీమంతు రాజా శివరామప్రసాద్ బహద్దరు జమీందారువారి దివ్యకృప వలన—వారి ధనసహాయమువలన—నీగ్రంథము నింతత్వరలో ప్రచురించు భాగ్యము కలిగినందులకు శ్రీవారికి నే నెంతయు కృతజ్ఞుడను.

పశువైద్యచింతామణి మున్నగు మద్విరచిత గ్రంథము లలో చేర్కొనిన ఔషధములను తయారుచేయుటకు సామాన్య కర్షకులకుగూడ ననువుగ నుండునను తలంపుతో నీగ్రంథమును గూడ వ్రాయవలసివచ్చినది. ఇంకను పశుచికిత్సాలయమును స్థాపించి పనిచేయుచుండుటవలన క్రొత్తక్రొత్త రోగములకుక్రొత్త క్రొత్త మందులు తయారుచేయవలసి వచ్చుచున్నది. పశునే త్రాంజనము, పశుప్రణహారిములాము, లోకక్రిమిసంహారిణి, గోమూత్రతైలము మొదలగు దివ్యమైన ప్రశస్తమైన ఔషధము లను స్వయముగా తయారుచేసి వాడుచున్నాము. అనేకమంది రయితులీమందులను వాడిచూచి సంతసించుచున్నారు. కాబట్టి వస్తుగుణప్రచురముగూడ కృషీవలుల కత్యంతసాయ మొనర్ప

గలదని పూర్ణమగు నమ్మిక. అందువలన పశువైద్యులకేమి వైద్యముచేసికొను రైతులకేమి ఈగ్రంథ మత్యంత సహాయకారియగుననుటలో నతిశయోక్తిలేదు. పశువైద్యచింతామణితోబాటు వస్తుగుణదీపికయున్నచో రైతులకు మిక్కిలి యుపయోగకారి కాగలదు. ఈగ్రంథరచనకు దోడ్పడిన ఆంగ్లేయ వైద్యవస్తుగుణదీపిక, వస్తుగుణదీపిక, ఓషధీగుణ పంచభాషి, కాటిల్ మెటీరియా మెడికా, వృక్షశాస్త్రము, వ్యవసాయపత్రికలు మున్నగు గ్రంథకర్తలకు నాకృతజ్ఞతాపూర్వకాంజలులు. ఈగ్రంథమును తగినరీతిని సంస్కరించి సరిజూచిన శ్రీయుతవరుచూరు సుందరవరదులుగారికిని, ఉప్పలపాటి రాధాకృష్ణయ్య చౌదరిగారికిని తదితర సాహాయ్యులకును హృదయపూర్వకనమస్కారశతములు. బహుకార్యనిమగ్నులయ్యు నాప్రార్థన మాలకించి తమదివ్యమగు ప్రవేశకపీఠిక నొసంగిన శ్రీయుత రావ్ బహద్దరు బొల్లిని మునిస్వామినాయుడుగారికి మిక్కిలికృతజ్ఞుడను. గ్రంథస్థవిషయములు కష్టసాధ్యముగా లభించినవగుటచేతను, శాస్త్రీయప్రోక్తములగుటచేతను, సర్వతోముఖ విషయవిస్తారము నంతగ ప్రకర్షింపజాలకపోవచ్చును. కాని యీచిన్ని గ్రంథము పట్టుగొమ్మలేక నలనలలాడుచున్న పశుపోషకులకొకవిధముగ కొద్దిగనైనను నుపకరింపగలదను నమ్మకముతో నేనీయుద్యమమునకు బూనుకొంటిని. ఈయుద్యమజయాపజయనిర్ణయము రయితుసోదరులచేతులయం దిడితిని.

అంగలూరు,<br>20-12-29.

—గ్రంథకర్త.

# విషయసూచిక



గోసంరక్షణము.

# పశువైద్యవస్తుగుణదీపిక.

## గోసంరక్షణము.

మానవచరిత్రమును మనము సావధానముగ బరిశీలించునపుడు పశువుల రక్షణము మన విధ్యుక్తధర్మముగ గోచరము కాగలదు. ఆహార నిద్రా భయ సంగమములు పశువులకును మానవులకును సమానధర్మములుగా నున్నవి. మనుజులు పశుత్వమును విడిచి మానవత్వమును బడయుటకును “తదనంతరము దైవత్వమును బడయుటకును పాటుబడుచున్న విధమును ప్రపంచ చరిత్రము తెల్లము చేయుచున్నది.” ఆదిని మానవులును, మృగములవలె పచ్చిమాంసమును కూడ తినియుండురు. ప్రపంచమునందు నేటికిని మాంసభక్షకులే కాక నరమాంస భక్షకులుగూడ గలరు. పూర్వకాలమునందు బ్రాహ్మణులుకూడ మాంసాశనమును వాడినటుల నిదర్శనములు గలవు. కాని కాలక్రమమున వారు మాంసాశనమును విసర్జించిన విధమును హిందూమత చరిత్రము విశదము చేయుచున్నది.

జంతుజాలముల శరీరపోషణమున కాహార మత్యంతావశ్యకముగ నున్నది. కాని యుక్తమైన యాహారమును నిర్ణయించుట, తినుట మానవధర్మములుగ నున్నవి. మానవధర్మాభ్యుదయమునకు సాత్త్వికాహారము యుక్తమని ధర్మశాస్త్రములు మతములు చిరకాలానుభవమునుబట్టి నిర్ణయించినవి.

జీవయాత్రకు ఫలము సుఖప్రాప్తియును, దుఃఖనివృత్తియును నైయున్నది. సాత్వికజీవనము సుఖప్రాప్తికిని దుఃఖనివృత్తికిని సాధనమని మానవచరిత్ర విశదముచేయుచున్నది. మహర్షులు, మతాచార్యులు చిరకాలానుభవమువలన, సాత్వికజీవనము యొక్క ప్రాశస్త్యమును చక్కగ విశదము చేసిరి. మానవుడు జీవించుట కన్నమును దినుచున్నాడు. కాని అన్నమును తినుటకు జీవించుటలేదు. జీవించుటకు తినెడి పదార్థములందును ఆయురారోగ్యాదుల నొసంగెడి పదార్థములు తినుటకు యోగ్యమైనవిగా నున్నవి. భగవద్గీతయందు శ్రద్ధాత్రయ విభాగ యోగమునందు మనము తినెడి ఆహారములు త్రివిధములుగ విభాగము చేయబడినవి. ఆ మూడు విధములైన ఆహారము లందు సాత్వికాహారములు మానవధర్మాభ్యుదయమునకు యోగ్యములుగ నిర్ణయింపబడినవి.

శ్లో॥ ఆయుస్సత్వ బలారోగ్య సుఖ ప్రీతి వివర్ధనాః
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారా స్సాత్వికప్రియాః.

ఆయుష్యమును, సత్వమును, బలమును, ఆరోగ్యమును, సుఖమును, ప్రీతిని వృద్ధిజేసెడి ఆహారములు సాత్వికాహారములు. ఆయాహారములు రసవంతములైనవి, చమురుగలవి, స్థిరములైనవి, హృద్యములైనవయియున్నవి. పాల కీలక్షణములన్నియును నున్నవి. ముఖ్యముగ ఆవుపాల కీలక్షణము లన్నియు గలవు. ఆపాలు రసమును, చమురునుగలిగి, హృద్యములుగ నుండును. ఆప్యాయమను భావము పాలవలెనే కలిగినదని యూహింపదగి

యున్నది. పాలు ధాన్యములవలె స్థిరాహారము గాకపోయి నను పులిసినపాలు శల్యరూపమునను అమృతతుల్యమైన మంచి యాహారముగను పరిగణింపబడుచున్నవి. పెద్దలకే ప్రధానమైన పాలయాహారము పిల్లలకు ప్రాణప్రదముగ నున్నవి. పసిపిల్లలకు తల్లిపాలును, ఆవుపాలును ప్రాణదాయకములుగ నున్నవి. పాడిపంటలకును, బలసంపదలకును ప్రఖ్యాతివహించిన భరత వర్షమిపుడు దుర్బలత్వ దారిద్ర్యములకు నిలయముగ నున్నవి. తల్లులకు, పిల్లలకు పాలిచ్చుటకు పాలులేవు. శక్తిలేదు. ఆవు పాలసలేలేవు. విదేశములనుండి వచ్చెడి పాలడబ్బాలు హార్లిక్సుపాలు శిశుపోషణమునకు సాధనములైనవి. చిరకాలము క్రింద డబ్బీలయందును సీసాలయందును నింపబడిన చైతన్య రహితమైన కృత్రిమాహారము సహజమైన సత్వాశ్రియమైన యాహారము గాజాలదు. నిలువయున్న సాత్వికాహారములును చెడిపోయి తామసాహారములగు చున్నవి. పాలడబ్బాలో పెరిగిన పిల్ల లెంతబలారోగ్యములను గలిగియుందురో విచారించవలసిన యవసరములేదు. దేశము నందు నలుబదేండ్లకుపూర్వమునం దుండెడి పిల్లలస్థితిని ఇప్పటి పిల్లలస్థితిని పరిశీలించినపుడు సత్యము వెల్లడియగు చున్నది. దేశమునందంతటను ఆయురారోగ్యాదులు లేనిపిల్లలు గలుగుచున్నారు. ఆయురారోగ్యములుగల పిల్లలు గలుగుటకు దేశమునందంతటను పశువులసంపద యభివృద్ధిని జెందవలసి యున్నది. ముఖ్యముగ వ్యవసాయమే ముఖ్యవృత్తియైన హిందూదేశమునందు గోసంరక్షణము పరమ ధర్మముగ

నున్నది. హిందూదేశమునందు 100 కి-80 మందికి వ్యవసాయము జీవనాధారముగ నున్నది. పశుసంపద ఆవులమీద నాధారపడియున్నది. మంచి ఆవుపెయ్యలు విదేశముల కెగుమతి యగుచున్నవి. మంచి ఆవులు లేని దేశమునందు కోడెలును, ఎద్దులును, వర్ధిలుట కవకాశములుకలుగజాలవు. ఏపల్లెటూరికిపోయినను కృశించిన ఆవులు కనుబడునుగాని బలిసి పాలిచ్చెడి ఆవులు గనబడవు. ప్రాణిపోషణమున కాధారమైనగోసంపద లేనపుడు శిశువులు క్షీణించుటయును సహజముగ గలుగుచున్నది. హిందూదేశమున యంత్రసహాయముతో వ్యవసాయము కొంత సాధ్యమైనను మానవపోషణమునకును ఎరువులకును పశుసంరక్షణ మవసరముగ నున్నది. పల్లెటూళ్ళయందె గోవులస్థితి దుర్భరముగ నున్నప్పుడు బస్తీలవిషయమై విచారింపవలసిన యవసరము లేదు. చిక్కినయావులు, కలితీపాలు బస్తీలయందు ప్రత్యక్షమగుచున్నవి. ఆపాలైనను కాఫీతేయాకులకే సరిపోవుచున్నవి. శిశువుల కావుపాలు దుర్లభమై పాలడబ్బీలు శరణ్యాములగుచున్నవి. హిందువులకు గోవులపట్లగల భక్తిని పురాణేతిహాసములు సహస్రముఖముల వర్ణించుచున్నవి. గోమహాలక్ష్మి గోమాణిక్యము అని ప్రజలు గోవులను పూజించుచుందురు. విశ్వామిత్ర వశిష్ఠేతిహాసము గోప్రభావమును విశదముచేయుచున్నవి. "గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం లోకా స్సమస్తా స్సుఖినోభవన్తు" అని నిత్యసంకీర్తనముచేయుటవలనను, గోవుల మహిమ విశదమగుచున్నది. గోబ్రాహ్మణులకు శుభమునుగోరుటయనగా మానవాభ్యుదయమునకు సాధనభూతము

తైన జీవజాలములకును, మానవులకును, శుభముకావలెనని కోరుటగాని ఒకప్రత్యేకవర్గమునకు హితముగోరుటగాదు. గోవు సాధుజంతుత్వమునకును మానవాభ్యుదయమునకును ప్రమాణముగ నున్నది. పూర్వకాలమునందు బ్రాహ్మణుడు విజ్ఞానమునకును, త్యాగమునకును నిదర్శనముగ నుండెను. అట్టిగోవులకును, బ్రాహ్మణులకును శుభముగోరుట పంచకళ్యాణమునకు సాధనముగ నున్నది. వ్యవసాయమే ముఖ్యవృత్తియైన హిందూదేశమునందు గోసంరక్షణావశ్యకతనుగురించి విపులముగ వ్యాఖ్యానము చేయనవసరములేదు. మానవుల సాధుజీవనమునకు గోక్షీరములు ప్రయోజనకరములని యోగులజీవితములు ప్రమాణములుగ నున్నవి. సాత్వికాహార విషయమై ఆరంభమునందు నేను భగవద్గీతావాక్యములను తెలిపియుంటిని.

దైవజ్ఞులు, శాస్త్రజ్ఞులు మతప్రవర్తకులు మాంసాహారముకన్నను శాకాహార మారోగ్యదాయకమని సలహనిస్తున్నారు. మహర్షులు మాంసాహారమును విసర్జించి శాకాహారమును గైకొనినవిధ మిందులకు దృష్టాంతముగ నున్నది. యూరపు దేశమునందును, వర్తమానకాలమున శాకాహార ఆశ్రమములు వెలయుచున్నవి. అనారోగ్యస్థితియందు మాంసాహారమును వైద్యులు నిషేధించుచున్నారు. మాంసాహారమునకు సాత్వికాహారలక్షణములు లేవు. ముఖ్యముగ మానవుల యారోగ్యములకు మాంసాశన మవసరమను సిద్ధాంతము విశ్వసనీయము గాదు. మాంసాహార మవసరమని నమ్మినను గో

మాంస మవసరము కాదు. హిందువులకు గోమాంసభక్షణము పరమపాతకముగనున్నది. కాని మన దేశమునందు గోమాంసమును గోరెడి యూరపియనులును మహమ్మదీయులును గలరు. వారికిని వారి పిల్లలకును ఆవుపాలు కావలసియున్నవి. ఆవుపాలు కావలసినవారు గోమాంసభక్షణ మామోదింపజాలరు. ఈవిషయమును శాసనరూపమున నిర్బంధించుట ప్రయోజనకరము కాదు. హిందూమహమ్మదీయ సంయోగము బలపడిన కొలదియును గోరక్షణ సులభసాధ్యము కాగలదు. కొనయూపిరితోనున్న ఆవుల నొకచోట జేర్చినతోడనే గోరక్షణము జరుగుచున్నదని యానందించుట యనుచితము. పట్టణములందు గోశాలలందు గోవులకు తగినవసతి చాలదు. పెద్దబీళ్ళ నేర్పాటుచేసి గోవులను పోషించినగాని గోరక్షణము సార్థకముగాదు. ఆవుపాలను త్రాగ వలసినవారు ముసలిఆవులను, చిక్కినఆవులను కటికివానికమ్ముట రాక్షసకృత్యముగ నున్నది. నోరులేని ఆవులను రక్షించుటకై ఏర్పడిన గోరక్షణ సమాజములు చేయుచున్న కృషి ప్రశంసనీయములుగ నున్నవి. వీనికి దృష్టాంతములు ఏలూరు గోసంరక్షణసమితి మున్నగునవి. యువజనులందరు ఆసమితివలెనే దీక్షను వహించిన యెడల గోరక్షణసమాజ మభివృద్ధిబొంది గోరక్షణము సులభముకాగలదు. అహింస పరమధర్మములందెల్ల నుత్తమధర్మముగ నున్నది. జినుడు, బుద్ధుడు, క్రీస్తు మొదలగు దేవాంశసంభూతు లహింసాధర్మమును లోకమునకు వ్యక్తము జేసిరి. హింస దుఃఖమునకు మూలమగుచున్నది. హింసను, చేతల

యుండేగాక మాటలయందును, తలంపులందును నయితము విడుచుట యహింసకు సాధనముగ నున్నది. అహింసాధర్మమును మహాభారతమునందలి ధర్మవ్యాధోపాఖ్యానము విశదము చేయుచున్నది. కౌశికుడను బ్రాహ్మణుడు వేదాధ్యయన పరాయణుడైనను హింసారూపమైన క్రోధమును విడువలేక పోయెను. మాంసవిక్రయమువలన జీవించెడి ధర్మవ్యాధుని వలన అహింసాధర్మమును గ్రహించి కృతార్థతను బడసెను. అహింసాధర్మ మీ యితివృత్తమునందు హృద్యముగ బోధ్యమగుచున్నది. అహింస ధర్మములందు పరమధర్మముగ నెన్న బడుచున్నది. పురుషార్థములందు ధర్మము మూలముగానున్నది. ధర్మార్థకామములందు ధర్మము ప్రధానముగ నున్నది. ధర్మ విరహితములైన యర్థకామములు పురుషార్థమునకు నిరర్థకములుగ నున్నవి. ధర్మము నిత్యము. అర్థకామము లనిత్యములు. ధర్మము ఆదిభౌతికము మాత్రమేకాక ఆధ్యాత్మికమును నైయున్నది. జీవకారుణ్యము మానవులకు ధర్మమై అహింసాధర్మమునకు లక్ష్యముగనున్నది. భక్తిరసము కరుణారసమున కతీతమై ఆధ్యాత్మిక ధర్మమును విశదము చేయుచున్నది. అహింసాధర్మము పరమమైన యాధ్యాత్మిక ధర్మమును విశదము చేయుచు, భక్తిప్రభావమును విశదము చేయుచున్నది. గోరక్షణము కేవలము జీవకారుణ్యమునకేకాక పరమధర్మమైన అహింసాధర్మ సిద్ధికిని సాధనంబుగ నున్నది. మానవు లాత్మరక్షణమునకును, ధర్మనిర్వహణమునకును పరమపదప్రాప్తికిని గోరక్షణము చేయుట యావసర మని చిరకాలానుభవము విశదము చేయుచు

న్నది. ఆయనుభవమును సార్థకము చేయవలసిన భారము భారతయువజనులమీాద గలదని ఏలూరు గోసంరక్షణసమితి వారు శ్రీ దేశోద్ధారకులు తెలుపుచున్నారు గాన యువజనులును కార్యపరాయణులై గోరక్షణసమాజములయొక్క ప్రయత్నములను సార్థకము చేయుటకు భగవంతు డనుగ్రహించుగాత.

---

# అహింస.

మానవకోటి యాచరింపవలసిన ధర్మములలో జీవకారుణ్యము ప్రథమధర్మమైయున్నది. జీవకారుణ్యమనగా ఏజీవజంతువునుగాని హింసింపకుండుటయే. హింసయనగా బాధ కలుగజేయుట. కాబట్టి యేప్రాణికైనను జంపకుండుటయేగాక బాధయైన కలుగజేయకుండుటయే జీవకారుణ్య మనబడును. ధర్మములలోనికెల్ల జీవకారుణ్యవ్రతధర్మమే పరమోత్కృష్ట ధర్మము. 'పతంజలియోగశాస్త్రము' నందు జీవకారుణ్యవ్రతసిద్ధుని చెంత విరోధముండదని చెప్పబడియున్నది. ఆయనయున్న ప్రదేశమున పులులు, మేకలు మొదలగు వివిధజంతువులు సయితము మైత్రికలిగియుండును. మొత్తమున నిహపర సౌఖ్య మోక్షములు ఈవ్రతమునందిమిడియున్నవి. కనుకనే బ్రాహ్మణుడు మొదలు చండాలుని పర్యంతము జీవకారుణ్యవ్రత మాచరింపదగునని మన సనాతనఋషులు వ్రాసియున్నారు. 'గాంధీకే దివ్యవాణి' యను హిందీగ్రంథము

నందు జీవకారుణ్యమైన జాగ్రదవస్థయందు ప్రేమయని మహా
త్ముడుకూడ చెప్పియున్నాడు. పూర్వము పాంచాల దేశమునందు
నివసించుచుండిన ఆర్యులు జంతువులమాంసము భక్షించుటకు
గాని, జంతువుల బలినిచ్చుటకుగాని యెంతమాత్రము సమ్మతిం
చెడువారు కారు. జీవహింస పంచమహాపాతకములలో నొకటి
గా నెన్నబడుట మనము చదువుచునేయున్నారము. మన దేశము
గోసంరక్షణకు పెట్టినది పేరు. పశువులే హిందువులకు ధనము.
పశుసంరక్షణమే వారి మతధర్మము. మహాఋషులు కామధే
నువులనే స్వర్గతుల్యములని భావించిరి. ఇట్లు ప్రాచీనకాలము
నుండి సంరక్షింపబడిన పశువులు హిందువుల క్షీణదశతో పాటు
క్షీణించుచున్నవనుటకు తగిన కారణము లేకపోలేదు. పశువు
లను బలియిచ్చు దురాచారమువలనను, మాంసభక్షణమువల
నను, పశువులకుగా నేర్పరచిన బీడుభూములను ప్రజలకక్కురి
తికి ఆక్రమణ చేయుచుండుటవలనను, ఫారెస్టునిబంధనలవలనను
తోళ్ల వర్తకమువలనను, పశునివాసస్థానములో సరియైన వస
తులు లేకపోవుటవలనను, మేత కడుపునిండా పెట్టక పాలె
క్కువ దీయుటవలనను, రోగములకు సరియగు చికిత్సలు
చేయకుండుటవలనను, తత్పశు సంతానాభివృద్ధికి మంచియా
బోతులను పెంచకుండుటవలనను పశుసంతతి నానాటికి క్షీణిం
చుచున్నది.

మాంసాహారమందు ప్రీతిగలవారును, అలవాటుగలవా
రును, తాము మాంసము భుజింపనియెడల జీవింపజాలమనియు
కావున దానిని వదలజాలమనియు సాకులు చెప్పుచున్నారు. తమ

కోర్కెలను నెరవేర్చుకొనుటకై జంతువులను హింసించుచుందురు. ఇది మహాపాపకార్యము. పశువులను కొందరు యజ్ఞములకు తోళ్ళకు మాంసమునకు నెత్తురునకు గుండెకాయలకు క్రొవ్వునకు దంతములకు కొమ్ములకు చంపుదురు. జీవజంతువులకు హానియొనర్చువాడు అజ్ఞాని. మృగములకు హానిచేయనివాడు సుకృతి, జ్ఞాని. తెలిసితెలియనివా డెప్పుడును మృగములను బాధపెట్టడు; పెట్టుమనడు; పెట్టనీయడు. అమ్మవారిపండుగలకు గొఱ్ఱెలను మేకలను కోళ్ళను నరుకుచున్నారు. ఆపండుగదినమున నే జంతువులకు పసుపురాచి వేపాకుమండలను గట్టి వాద్యములతో గుడిదగ్గరకు బోయి నరుకుటకు బ్రయత్నించుదురు. అప్పుడు పశువు విచారకరమైన దుఃఖముతో తలవంచుకొని, కన్నులనుండి నీరుగార ఇటునటు పరుగెత్తుచు నన్నెవరైన విడిపించుటకు వచ్చెదరాయని, దారి నడచు మనుజులవైపు జూచుచు అరచుచు తిరిగి యింటివైపు జూచుచు దాని మెడయందు త్రాడువేసి యీడ్చువాడొకప్రక్క లాగుచుండ యది మరియొకవైపునకు లాగుచు నీప్రకారము బలిస్థానమును సమీపించుచున్నది. ఆహా! ఆసమయమునందు దాన్ని జూచిన కరుణగలిగిన ప్రతిమనుజునకు నేత్రములనుండి నీరుగారకమానునా? అటువంటి జీవజంతువులను నిష్కారణముగా బలియిచ్చుట ధర్మమా? కాబట్టి మాంసభక్షకులగు సోదరులందరు జీవహింస చేయకుందురుగాక!

పాశ్చాత్య దేశములలో యెద్దుల నధికముగ వధించుచున్నారు. హిందూదేశమునా గోవుల నధికముగ వధించు

చున్నారు. సంవత్సరేమునకు లక్షన్నర పడుచుగోవులు సైన్య ములోనివారికొరకు వధింపబడుచున్నవి. జీవహింస ప్రారంభ మైనది మొదలు దేశమునకు గొప్ప కీడుగలుగునని విష్ణుపురా ణము ఘంటాపథముగ జెప్పుచున్నది. గోవధచే మనకు కా వలసిన పాలు పెరుగు మీగడ వగైరాలు లభించకపోవుటచే మరణములు హెచ్చుగానున్నవి. మరణములకు ముఖ్యకారణ ములు గోవధయే. మనదేశము వ్యవసాయదేశమైనను, సరి పోవు పశువులున్నను 1904 సం॥ లో 40 లక్షుల పాలడబ్బాలు దిగుమతి అయినవనిన్నీ, యిప్పుడు ఒకకోటి ఆరులక్షలనిన్నీ తెలియుట శోచనీయము. భాగ్యవంతులకిదినష్టము లేదందురా? బీదవారిగతియేమి? పాలడబ్బాలు కొనలేరు. ప్రభువులసభలో పిల్లలచావులు, బాల్యవివాహములవలన ఆరోగ్యపద్ధతులు సరి గాలేవనిన్నీ, సరియైనపోషణ లేదనిన్నీ చెప్పబడినది. సంయుక్త పరగణాల ఆరోగ్యకమీషనరు కల్నల్ మాకేటేగర్టుగారు పాల ధర చౌక చేయించినచో బీదకుటుంబములలో శిశువులింతమంది చావరని అభిప్రాయపడియున్నారు. కొన్ని మ్యునిసిపాలిటీలు నూటికి 30 నుంచి 80 వరకు మంచి పడుచుగోవులు చంపబడుచు న్నట్లు తెలిపియున్నవి. బొంబాయిలో ఒకకసాయి అంగడిలో పక్షముదినములలో మూడు వత్సరములలోపునన్న పశువులు 477ను మూడు సంవత్సరముల పైన ఎనిమిదివత్సరముల లోపున నున్న పశువులు 988 న్ని, ఎనిమిది వత్సరముల పైన 1152 ఆడ పశువులు, 496 మొగపశువులు చంపబడినట్లు రిపోర్టు వ్రాయ బడినది. నాలుగు సంవత్సరములకిందట పశువులవృద్ధిక్షీణ

టకు మ్యునిసిపల్ సంఘమువారు ప్రత్యేక మొక అధికారిని నియమించవలెను. చంపబడు ప్రతిపశువునకు ఫారెస్టురూల్సు వలె కొంతపన్ను విధించి ప్రతివారికి అగత్యముకలిగిన చూపించుటకు లైసెన్సుచీటిని చంపెడువారు పొందవలెను. పల్లెగ్రామములలో చంపబడు పశువులకుగూడ మునసబు కరణముల తనిఖీనిబొంది వారివద్దనుంచి లైసెన్సుచీటిని కలిగియుండవలెను. మరియు ననేకవ్యాధులచే చనిపోయెడుపశువుల నీకబేలాలోనికి తెచ్చునట్లును, అట్లుతెచ్చువారు పశుయజమానులవద్దనుంచి తనిఖీచీటి పొందునట్లును, ఆపశువు లెట్టివ్యాధులవలన చనిపోయినదియు, అచ్చటనుండు తనఖీదారునిచే పరీక్షనుజేయించి తగుపన్నును విధించునట్లు ప్రభుత్వమువారు యేర్పాటుచేయవలెను. ప్రతిదినము తోళ్ళపాపులలోనికి తేబడు చర్మముల లెక్కయొక్కయు, వాని యజమానులయొక్కయు, అవి యేగ్రామములనుండి యెవరు యేతేదీలను తెచ్చినది వానిలెక్కలను పరీక్షకు తోళ్ళపాపుయజమానులు యెప్పటికప్పుడు చర్మములను ప్రతిదినమును బాగుచేయుటకు కుండలలోవేయుక అధమపక్ష మొకదినమైనను పాపులలో తనిఖీకి నిలవయుంచునట్లుగా యేర్పాటుజేయవలెను.

పశురక్షణకై గవర్నమెంటువారు ప్రతితాలూకాలోను పశువైద్యశాలలను స్థాపించుచున్నారు. సంతలకు తగినసదుపాయములను చేయుచున్నారు. కొందరు మహానీయులు పశువృద్ధిచేయునిమిత్తము గోసంరక్షణసంఘముల నేర్పరచి పాటుబడుచున్నారు. ఈసంఘములు విశేషపరిశ్రమలుచేసి కసాయివాం

క్రిగొట్టములకు స్వయముగావెళ్ళి పశువిక్రితలను బ్రతిమాలి యో, ధనములిచ్చియో, పశువుపై క త్తిపడకుండ గాపాడుచు పోషణ చేయుచున్నారు. ఒక గోవును హత్యజేసినవాడు 399760 మంది మనుష్యులను చంపినవాడగునని మనశాస్త్ర ములు తెలుపుచున్నవి. ఓ ఆత్మబంధువులగు సోదరులారా! ఆర్యవంశోత్పన్నులారా! జీవజంతువులను కరుణించి దరిజేర్చి రక్షింపుడు! కాని వధింపకుడు! దయజూడుడు! అదియే పరమ వైరాగ్యము!

---

## పశువుల మేత.

పశువు లారోగ్యముగనుండి తగిన పనిచేయుటకుగాని పాలిచ్చుటకుగాని, వాని కనుకూలమగు అహారము నీయవల యును. వ్యవసాయదారుడుగాని, గోరక్షకుడుగాని ఈవిషయ మై తగు శ్రద్ధవహించని యెడల నితర విషయములలో నెంత శ్రద్ధ దీసికొనినను, నెంత వ్యయము జేసికొనినను, లాభము లేదు. అన్నిజాతుల పశువులకు పచ్చిక స్వాభావికాహారము. పచ్చిగడ్డి అన్నికాలములందు తగినంతదొరకు నెడల పశువులకు సాధారణముగ వేరొక మేత యేమియు నవసర ముండదు. ఇట్లు లభింపనపుడును, విరామములేక పగలంతయు పనిచేయు పశువులకు దినమంతయుమేసి పొట్టనిండించుకొనుటకు దగిన యవకాశము లేకపోవుటచే గడ్డి మొదలగునవి తెచ్చివేయు

టయేగాక కొద్ది పరిమాణమునందే యెక్కువ సారముగల తెలికపిండి మొదలగు వస్తువులు దాణా వేయవలసి యుండును. ఇట్లు పశువుల కాహారమొసంగు వస్తువులను 3 తరగతులుగా విభజించవచ్చును. 1 పచ్చిక, 2 గడ్డిలేక చొప్ప, 3 దాణాదినుసులు. పచ్చిక బీళ్ళయందు స్వభావసిద్ధముగ బెరుగు తృణాదికములు. దీని మంచిచెడ్డలు నేలయొక్క స్వభావమును బట్టియు, అందు పెరుగు తృణజాతులను బట్టియు నుండును. ఇంకను పచ్చికయనగా నేలపై స్వాభావికముగా మొలచుగడ్డి. దీని మంచిచెడ్డలు అందు మొండుగనుండు జాతుల ననుసరించి యుండును. ఈదేశపు పచ్చికబయళ్ళయందు గానవగు జాతులనేకములు గలవు. వాని నింకను బరీక్షించినవా రెవరును లేరు. కృష్ణాగోదావరి జిల్లాలలో దరచుగా చూచు గడ్డిజాతులలో గరిక, గునుకు, చెంగలి, మొలవ, తుంగ, ఊద, కామురు, ఆమడకాంద్ర, తికిలింత, ఊతిక, చిప్ప, ఊసడము, ఏనుగమోకాల్లు, జనిపె, దర్భ, అవురు, రెల్లు, గెలగడ్డి, మొదలగునవి ముఖ్యములు. ఇవిగాక గడ్డికుటుంబములో జేరనిగజ్జేరు, ఎలకజీడి, అమృతకాడ, పాలిల మొదలగు ననేకజాతుల మొక్కలుగూడ బీళ్లలో గానవగును. పైగడ్డిజాతులలో గరిక, గునుకు, మొలవ, చెంగలి, మొదలగునవి మిగులబలమైనజాతులును, పశువులు బాగుగ తినునవియు నైయున్నవి. ఊతిక, చిప్ప, ఊసడము, తుంగ, మొదలగునవి మేత కంతగా ప్రశస్తములుగావు. రెల్లు, అవురు మొదలగునవి మిగుల మోటుజాతులగుటచే మేత కనుకూలములుగావు. తక్కినవి మధ్యమములు. సామాన్యముగ మొలవ

గడ్డి, గరిక మొదలగు మంచిజాతులు సారవంతములును, కొంచె ముజిగురుగను నుండు నేలలలో బయలుదేరును. ప్రాతిక, చిప్ప మొదలగునవి యిసుక, కోడినేలలలో బయలుదేరు జాతులు. చవిటినేలలో ఉప్పి, గజ్జేరుకాడ మొదలగునవి మాత్రమే పెరుగును. కావున పశువులబీటిక్రింద వదలు నేల మంచిదయిననేగాని యందలి పచ్చికయందు మేయు పశువులకు బలము ఆరోగ్యము కలుగదు. కాని మంచినేలలు విలువగల వగుటచే పశువుల నిమిత్తము బీటిక్రింద నుంచక రైతులు వ్యవసాయమున కుపయోగించని నేలలనే బీళ్ళక్రింద నుంచుదురు. కొందరింతమాత్రముకూడ యుంచక నేల నంతటిని సేద్య మొనర్చుదురు. సాగుజేసినయెడల మిగుల లాభము నిచ్చు భూముల విస్తారముగ బీడుగా వదలుట మంచిపని కాకపోయినను ఈదేశమున పశువుల వృద్ధికొరకు మరియొక యుపాయమేదేని విచారించవలసి యున్నది. పశువులమేత నిమిత్తమయినను కొన్ని భూములు బీళ్లుగా వదలి వానిని శ్రద్ధగా పెంచుట యావశ్యకము. మెట్టతాలూకాలలో ఎఱువునేలలు విశేషముగ బీళ్లుగా వదలబడుచున్నవి. కాని యిందు వర్షము కురియుచున్నంత వరకే గాని యటుపిమ్మట త్వరలో పదునారిపోవుటచే గడ్డి యంతగా బట్టదు. పట్టుజాతులైనను ప్రశస్తమైనవిగ నుండవు. కోయంబత్తూరు జిల్లాలో బాగుగ గడ్డి పట్టని ఎఱ్ఱనేలలోను, కంకరనేలలోను, కొలకట్టి యను నొకజాతి గడ్డివిత్తులను జల్లి ప్రత్యేకముగ బీళ్లను తయారుచేయుదురు. ఒకసారి చల్లి 7, 8 వత్సరములవరకు బీడుగా వదలబడి తరువాత మరల సాగులో

సామాన్యముగ రైతులచే సాగుచేయబడు సస్యములతో తృణధాన్యములు యెక్కువ విస్తీర్ణము నాక్రమించుటచే కృషీవలునకు వీనిగడ్డియు, చొప్పయు విశేషముగ లభించును. కావున పశువుల మేతలో ప్రధానభాగమనియే చెప్పవచ్చును. వీనిలో సగము రమారమి నూటికి 9 పాళ్ళు తేమయు, 2 పాళ్ళు మాంసకృత్తులును, 45 పాళ్ళు ద్రావణీయకర్బనోజ్జనితములును, 32 పాళ్లు నారపదార్థములును, 2 పాళ్లు చమురుద్రవ్యములును, 20 పాళ్ళు బూడిదయు నుండును. తృణధాన్యముల దంటునందుండు చమురంతయు నిజమైనచమురు గాదు. చాలభాగమొకవిధమైన మైనమువంటి ద్రవ్యము. ఇది యాహారయోగ్యముకాదు. ఖనిజ ద్రవ్యములలోగూడ చాలభాగము ఇసుకయు, నితర ద్రావణీయ శైలితములును నైయున్నవి.

---

వరిగడ్డిలో నూటికి 8·12 తేమ, 1·78 మాంసకృత్తులు 40.65 ద్రావణీయ కర్బనోజ్జనితములు, 30·02 నారపదార్థము, 2.19 చమురు, 16·87 ఖనిజద్రవ్యములును; జొన్నచొప్పలో 8·06 తేమ, 1·61మాంసకృత్తులు,49·18 ద్రావణీయకర్బనోజ్జనితములు, 30.93 నారపదార్థము, 3·14 చమురు, 7.08 ఖనిజద్రవ్యములును; మొక్కజొన్నచొప్పలో 9.51 తేమ, 5.02 మాంసకృత్తులు, 49.11 ద్రావణీయకర్బనోజ్జనితములు, 29,97 నారపదార్థము, 1.10 చమురు, 5·23 ఖనిజద్రవ్యములును గలవు. మొక్కజొన్నలోను, గోధుమగడ్డిలోను మాంసకృత్తులు విస్తారము గాగలవు. కాని గోధుమగడ్డిలో ద్రావణీయకర్బనోజ్జని

తేమును మిగుల దక్కువ. ఈద్రవ్యములు జొన్నచొప్పయందు ను, మొక్కజొన్నచొప్పయందును విస్తారముగా గలవు. ఖనిజ ద్రవ్యములలో వరిగడ్డిని మిగుల నెక్కువగా గలవు. ఇందు చాల భాగము శరీరపోషణకు పనికిరాని ఇసుకయు, శైలితములునై యు న్నవి. ఖనిజద్రవ్యములు గోధుమగడ్డిలోను, మొక్కజొన్న చొ ప్పలోను, మిగుల దక్కువ. సారపదార్థము గోధుమగడ్డిలో విస్తా రముగ గలదు. పైన జెప్పబడిన గడ్డిజాతులయందును చొప్పయం దును గల ద్రవ్యముల పరిమితినంతయు పశువులు జీర్ణము చేసికొన జాలవు. సామాన్యముగ చెన్నపురిరాజధానిలో ముఖ్యముగ వరిపండు జిల్లాలలో వరిగడ్డియే పశువులకు ముఖ్యాధారమై యున్నది. ఇది మృదువుగ నుండుటచే నిది తిని బ్రతుకు పశువు లంత బలిష్ఠములుగ నుండవు. ఉత్తర హిందూస్థానమునందలి అమృతసరస్సు జిల్లాలలో చుట్టుపట్లను వరిగడ్డి కరవుకాలము ననేగాని పశువుల మేతగా నుపయోగింపరట. ఎల్లప్పుడును బల మైన యితరాహారములను దినుటచేతనే యచ్చటి పశువులు సామాన్యముగ బలిష్ఠముగనుండును. మృదువగుదంటు ధాన్య పుజాతులలో వరితరువాత చాల ముఖ్యమైనది. దీనిగడ్డిని కూడ పశువులు మిగుల యిష్టముతో దినును. ఆరికగడ్డికూడ గొంతవరకు మెత్తగనేయున్నను పశువులంతగా యిష్టపడవు. గోధుమగడ్డియు, చోడిగడ్డియుగూడ పశువులంతగా దినవు. వరిగడ్డియు నంత ప్రశస్తముగాదు. చొప్పలలో జొన్నచొప్ప యు, మొక్కజొన్నచొప్పయు ప్రశస్తములని యిదివరలోనే వ్రాయబడెను. గంటెచొప్పయు, కొర్రచొప్పయు, నంతగా

మంచివిగావు. పశువు లెండుమేతకంటెం పచ్చిమేత కెక్కువ యిష్టపడును. పచ్చిమేతలో నీరెక్కువగ నుండుటచే మృదువుగ నుండును. రుచియు పశువుల స్వాభావికాహారమగు పచ్చిక రుచిని పోలియుండును. సులభముగ జీర్ణమగును. పచ్చిమేత కును, ఎండుమేతకును, తారతమ్యము గలదు. పచ్చిమేతయం దితర మేతలయందుకంటె మాంసకృత్తు పదార్థము లెక్కువగ నుండుటచేతను త్వరలో జీర్ణమగుటచేతను, నిది యెక్కువైనదిగ పరిగణింపబడుచున్నది. ఎక్కువ వర్షములుకురియు జిల్లాలలో యీపచ్చిమేతను యెండించి ముందుపయోగము నిమిత్తము నిలువచేయవచ్చును. ఈమేత పచ్చిమేతలభించని వేసవికాలము నందుపయోగించుటమంచిది. ఈగడ్డియందలి తేమ ఇగిరిపోవు టచే బరువు నూటికి 370 మొదలు 80 వరకు తగ్గును.

పచ్చిజొన్నచొప్పలో 69.52 తేమ, 1.36 మాంస కృత్తులు, 14.81 ద్రావణీయ కర్బనోజ్జనితములు, 10.85 నార పదార్థము, .48 చమురుపదార్థము, 4.60 ఖనిజద్రవ్యములు; పచ్చిమొక్కజొన్నచొప్పలో 88.92 తేమ, 1.13 మాంస కృత్తులు, 4.65 ద్రావణీయకర్బనోజ్జనితములు, 3.11 నార పదార్థము, .31 చమురుపదార్థము, 1.88 ఖనిజద్రవ్యములును గలవు. ప్రత్యేకముగ పచ్చిగడ్డికొరకు పెంచదగు తృణజాతు లలో గినిగడ్డి ముఖ్యమైనది. దీని పృథక్కరణ మీాక్రింద వివరింపబడినది.

| | |
|---|---|
| తేమ | ... 71.55 |
| మాంసకృత్తులు | ... 2.62 |
| ద్రావణీయకర్బనోజ్జనితములు | ... 18.71 |
| నారపదార్థము | ... 5 73 |
| చమురుపదార్థము | ... 1.05 |
| ఖనిజపదార్థము | ... 1.05 |
| | 100.00 |

మాంసకృత్తులలో నూటికి 25 మొదలు 35 వరకును, ద్రావణీయకర్బనోజ్జనితములలో 40 మొదలు 60 వరకును, నారపదార్థమునందు 50 మొదలు 60 వరకును, చమురుపదార్థములలో నూటికి 30 మొదలు 40 వరకును, మాత్రమే జీర్ణముకాగల భాగములుండునని కొన్ని ప్రయోగములచే పాశ్చాత్యశాస్త్రజ్ఞులు కనిపెట్టియుండిరి. ఈదేశమున నిట్టిప్రయోగము ఇంకను ప్రారంభింపబడలేదు. మొత్తముమీద లెక్క వేసినయెడల జంతువులచే జీర్ణముచేసికొనదగిన ద్రవ్యములు మొక్కజొన్నచొప్పలోను, జొన్నచొప్పలోను, తక్కినవానిలోకంటె నెక్కువగ నున్నవి. గోధుమగడ్డిలోను మిగులదక్కువ. పైపట్టిలో వివరింపబడినటుల పంటపండించి కోసినప్పుడు దిగబడుదంటులయొక్క పృథక్కరణము ఇట్టిగడ్డికంటెను చొప్పకంటెను ప్రత్యేకముగ మేతకొరకు పెంచి వెన్ను ముదరకముందుగోసి యెండించినదంటునందు మాంసకృత్తులు విశేషముగ నుండుటచే

నిది యెక్కువ బలమైనది. ఈవిషయము క్రింది పట్టీవలన తెలియును.

| | మాంసకృత్తులు | |
|---|---|---|
| జొన్నచొప్పపంట తీసినది | 1.61 | % |
| ,, మేతకొరకు పెంచినది | 4.01 | ,, |
| జొన్నగడ్డిపంట తీసినది | 2.19 | ,, |
| మేతకొరకు పెంచినది | 9.11 | ,, |
| మొక్కజొన్నచొప్పపంటతీసినది | 5.02 | ,, |
| ,, మేతకొరకు పెంచినది | 9.17 | ,, |

మేతకొరకు ప్రత్యేకముగ బెంచు చొప్పలో మాంస కృత్తులు విశేషముగ నుండుటకు కారణము గింజలలోనికిబోవు సారము దంటునందే నిలిచియుండుటచే పశువులకు మిగుల బలముచేయును. కావున పశువుల యభివృద్ధిగోరువారు పశుమేతకొరకు జొన్నమొదలగువానిని బెంచుట మిగులమంచిది. ఒంగోలుప్రాంతములందు జొన్నపంట విస్తారముగా నుండుటయు, తరచు వర్షము లేమిచే వెన్నులు ముదర వీలులేనపుడెల్ల కోసి పశువులకు బెట్టుచువచ్చుటయు నిప్పటి ఒంగోలు పశుజాతియొక్క అభివృద్ధికి కారణమని చెప్పెదరు.

---

## ల్యూసరను.

ఇదియొక గడ్డిజాతి. నీరునిలువని భూములన్నిటిలో నీరు కట్టవలసిన యావశ్యకము లేకయే ల్యూసరనుగడ్డి పెంచవచ్చున

ను సంగతి చాలమందికి తెలియదు. అమెరికాలో వర్షములు కురియనట్టి ప్రదేశములలోగూడ నీరుపట్టకుండగనే దీనిని పెంచుచున్నారు. 1915 వ సంవత్సరమునందు శరత్కాలమున కాన్పూరునందు పరీక్షనిమిత్త మొకమడిని సిద్ధముచేసి యందు ల్యూసరను వేయబడెను. ఈపరిశోధన మిక్కిలి జయప్రదముగా నెరవేరెను. తరువాత అంబాల, కర్నాల్, అనుచోట్ల నీపైరు వేయబడెను. అంబాలలో మిక్కిలి బాగుగా పెరిగెను. ఈపరిశోధనలను బట్టి ల్యూసరనును నీరు కట్ట నక్కర లేకుండగనే చాలచోట్ల పెంచవచ్చునని తెలియుచున్నది. నీరుపెట్టి పెంచిన దానికంటె నీరుకట్టకుండ పెంచినది నెమ్మదిగ పెరిగినను, సరిగను నిరాటంకముగను పెరుగును. నీరు కట్టకుండ పెంచిన ల్యూసరను వర్షాకాలమున వర్షముల ధాటి కాగును. నీరు కట్టబడి పెంచబడు ల్యూసరను పై దానివలె వర్షముల ధాటికాగ లేదు. కారణమేమన నీరుపెట్టి పెంచినదగుటవలన నిదివరకే భూమి మిగుల తేమగలిగి యుండును. అట్టి తరుణమున వర్షముల ధాటి యెక్కువయ్యేనేని నీరు నిలిచి నష్టము సంభవించును. అనగా తెగులుపట్టి పెరుగుట యాగిపోవును. నీరు కట్టకుండ పెంచబడు ల్యూసరను సహిత మట్టి యిబ్బంది లేకుండ నొకేవిధమున పెరుగుచుండును. ఈగడ్డివలన తక్కిన వానికంటె నెక్కువ లాభములుగలవు. నీరు కట్ట నవసరముండదు. పశువులకు పచ్చిమేత కరవుగానుండు దినములలో అనగా జనవరి మొదలు జూనువరకు నిది బాగుగా పెరిగి పశువులకు మంచి ఆహారమగును. మిక్కిలి బలము నిచ్చు ఈగడ్డిని 12 మాస

ములు పెట్టినయెడల తక్కిన యాహారములు పెట్టిన వాటి కంటె ఎక్కువగా బలియును. పశువుల బరువును పోల్చిచూచిన యెంత బలిసినదియు తెలియగలదు. ఒకసారి వేసిన యెడల రెండుమూడు సంవత్సరములవరకు తిరిగి భూమిని సిద్ధముచేయ నవసరములేదు. దీనివలన ప్రయప్రయాసలు తగ్గును. ఏ మొక్కలుగాని తేమను బొందజాలని ప్రదేశములలో నిది తేమను గ్రహించు స్వభావము గలదు. ల్యూసరను గడ్డి పశువులకు బలమైన ఆహారమను సంగతి వ్యవసాయదారులు కని పెట్టి దీనిని వృద్ధిచేయవలసి యున్నది. పశ్వాహారములు కొదువగా నున్న యీదినములలో నిట్టి యుత్తమమగు పైరును మంచి యెరువుకట్టి సమృద్ధిగ బెంచి యిదివరకే హీనస్థితిలో నుండు మన పశువుల స్థితి యింకను దుస్థితికి రాకుండ జాగ్రత్త గొనుట మనరైతుసోదరుల ముఖ్యకర్తవ్యమైయున్నది. ల్యూస్ర రను గడ్డి గుఱ్ఱములకు సర్వోత్తమమైన యాహారము. పచ్చి లూసరను, యెండులూసరను గూడ మేతకు పనికివచ్చును. మంచి పొలములలో కోత 1 కి రు 50-0-0 విలువగల గడ్డి లభించును. మంచి జలాధారములుగలచోట సంవత్సరమునకు 88200 వీసెల పచ్చిలూసర సామాన్యముగా లభించును. ఈ గడ్డిపశువులకు మంచి యాహారము. కాని యెట్టిపశువునకైనను దినమునకుమూడువీసెలకంటె నధికముగా దీనిని మేపరాదు. అలవాటయిన పశువులకు ప్రారంభములో కొద్దికొద్దిగా నీమే తనిచ్చి క్రమక్రమముగా అలవాటు చేయనియెడల పశువుల యారోగ్యము చెడిపోవును. పాడియావులకు నిది మంచియాహా

రమే. కాని ఎక్కువగా మేపరాదు గొడ్డుమోతు పశువులకు మేపిన కాకజేసి చూలునిలుచును. అమెరికా దేశములో కోళ్ళకును పందులకును గూడ దీనిని మేపుదురు. శీతలప్రదేశముల నీగడ్డివిత్తుటకు పనికిరాదు. కాని మంచుకురియుటవలనే నీపైరు సాధారణముగా చావక విజృంభించును. ఉష్ణప్రదేశములలో కొండప్రక్కలను కొండశిఖరములనుగూడ నిది పెరుగును. 3000 అడుగుల యెత్తుగల కొండలమీద సహితము ఇది లాభకరముగా పైరు చేయబడుచున్నది. భూమిలో చాలినంత తేమయున్నయెడల యెండ పిడుగులు పడినను పైరుచెడదు. నీరులేని తావులలో వర్షాధారమువలన నిది పెరుగును. దీని వేళ్ళు మిక్కిలి లోతుగా పారుటచే కొన్నాళ్ళు వర్షములేక పోయినను దీనికి నష్టములేదు. ఈకారణమువలన పశువులకు సంవత్సరము పొడుగునను మేలైనపచ్చిక దొరకును.

---

## గినిగడ్డి

పశ్చిమ యిండియాలో పశ్వాహారములలో ముఖ్యమైనది గినిగడ్డి. ఇది సంవత్సరము పొడుగునను పశువులకు మంచి బలమును ఆరోగ్యమును నొసంగు ఆహారమగుటచే దీని యుపయోగము వృద్ధియగుచున్నది. ఇది యిప్పుడు చాలవరకు వ్యాపించినది. ఈగడ్డియందలి ముఖ్యవిశేష మేమన నీడను బాగుగ వృద్ధిచేయుటయే యైయున్నది. ఇది మామిడిచెట్లు మున్నగు వానిక్రింద బాగుగ వృద్ధియగును. నీటికాలువలు

లేక బోదెలపక్కలను వేసినచో మనకెట్టి వ్యయప్రయాసలు లేకనే యనుదిన మొకింత పచ్చనియాహారము మన పశువులకు లభించుచుండును. గినిగడ్డి ఆఫ్రికాదేశమునకు చెందియున్నది. 1793 సంII నుండి యిండియాలో వేయుటకు ప్రోత్సహింపబడు చున్నది ఈగడ్డి ఒత్తుగా బయలుదేరును. వీనివేళ్ళు భూమి పైననే దట్టముగ వ్యాపించియుండును. ఉత్తరయిండియావంటి చలిప్రదేశములలో నీగడ్డి శీతకాలమున నెదుగుబొదుగులేక యుండును. శీతకాలము గడచినపిమ్మట నుష్ణమధికమైన కొలది బాగుగా పెరుగనారంభించును. ఇండియాలోని వేడి ప్రదేశములలోనెల్ల నిది సంవత్సరము పొడుగునను పచ్చగ నుండి చక్కగ బెరుగుచుండును. వేసవికాలములో నీరుపెట్ట నప్పుడు గిడసబారియుండి వర్షములు ప్రారంభము కాగానే బాగుగా పెరుగ నారంభించును. వర్షాకాలములోను, ఒకానొకప్పు డితర సమయములలోను ఈగడ్డిమొక్కలు పూచి గింజలుపట్టును. అప్పటికి 5 మొదలు 8 అడుగుల యెత్తువరకు పెరిగియుండును. బాగుగ ఎరువు వేయుటవలనను, నీరుపెట్టు చుండుటవలనను, గడ్డి బాగుగా వృద్ధియగును. సామాన్యముగ వర్షాకాలములో నెక్కువగా గడ్డిలభించునుగాని అంతయెక్కువగ లభింపదు. పూతపూయు కాడలకంటె ఆకులే సామాన్యముగ సంవత్సరము పొడుగునను వృద్ధియగుచుండును. గినిగడ్డి వివిధములగు ప్రదేశములలో చక్కగా బెరుగునదియై యున్నది. హిందూదేశములో నన్నిప్రదేశములయందును నిది వేయబడియుండెను. మన దేశములోనేగాక ప్రతి యుష్ణదేశములో

గూడ నిదివిశేషముగా వేయబడి యెక్కువ యుపయోగకరమైనదిగా పరిగణింప బడుచున్నది. ఫిలిప్పయిను దీవులలో దీని వృద్ధి మిక్కిలి యద్భుతముగా నున్నది. సంయుక్తరాష్ట్రములలోని పల్లపుభూములలోను, టెక్సాసులోని మెరకభూములలోను ఈగడ్డి బాగుగా పెరుగుచున్నది. శీతోష్ణస్థితి యుష్ణముగనుండి తగినంత తేమ భూమిలో నున్నంతకాలము ఈగడ్డి పెరుగుచునే యుండును. శీతాకాలమున చలి యెక్కువగానుండు ప్రదేశములలో నిది బాగుగా పెరుగదు. వేడిమి 45 డిగ్రీలకు తగ్గని ప్రదేశములలో గూడ వృద్ధిగాకుండును. ఒక్క వర్షాకాలములో తప్ప తక్కిన కాలములలో బాగుగ పెరుగకుండుటచే 1906 సంవత్సరమునుండి సూరతులో వేయుట మాని వేసిరి. ఇట్లు చేయుట మంచిదికానప్పటికిని ఉష్ణము తగ్గి శీతలము హెచ్చినకొలది దీనివృద్ధి తగ్గుననుటకు పైవిషయమే నిదర్శనము. మిక్కిలి చలిప్రదేశములలో నెంతనీరుపెట్టి శ్రమపడినను లాభములేదు. శీతలముతగ్గి యుష్ణము హెచ్చినకొలది నిది తిరిగి బాగుగ బెరుగనారంభించును. ఈగడ్డి లాభప్రదముగ బెరుగవలె నన్నయెడల నీరుపెట్టుట యత్యంతముఖ్యము నీరు పెట్టనయెడల నెంతమాత్రమును లాభములేదు, ఈగడ్డి బొంబాయిరాజధానిలో విశేషముగ వ్యాపించియున్నది. ఇది మిక్కిలి యేపుగాబెరుగున దగుటచేతను, పశువులకును, గుఱ్ఱములకును సమూల్యమగు నాహారమగుటచేత నిది యింతవిశేషముగా నచట వ్యాపించెను. నీరునిలువని యెట్టిప్రదేశములలోనైనను గినిగడ్డి పెరుగును. ఒండుభూములును, యిసుకతెర

భూములును, దీనికి మంచివి. ఈగడ్డివేయు భూములు కొంత లోతువరకు గుల్లగ నుండవలయును గనుక బాగుగ దున్న వలయును. భూమిని దున్నునపుడు యెకరమునకు 30 బండ్ల పశువులపెంట తోలవలెను. ఈగడ్డిని అంగలూరు గ్రామనివాసులగు శ్రీయుత తిపిర్నేని వెంకటాద్రియ్య చౌదరిగారు తెప్పించి పరిచుట్టుపక్కల గ్రామాదులలో వ్యాపింపజేసిరి. ఈగడ్డిని విత్తుల మూలమునగాని, దుబ్బుల మూలమునగాని వ్యాపింపజేయవచ్చును. సామాన్యముగ అందరు దుబ్బులనే పాతివేయుదురు. దీనికి కారణము విత్తులు సులభముగ మొలకెత్తకపోవుటయైయున్నది. 5, 6 దుబ్బులను కలిపి ఒక్కొక చోట వేయవలెను. ఇట్లు ఒకటిన్నర మొదలు రెండడుగుల ఎడముగ వరుసలుగా వేయవలయును. ఈదుబ్బులను వర్షాకాలములో వేయవలెను. ఇతరకాలములలో వేసినయెడల వెంటనే నీరు పుష్కలముగా బెట్టవలెను. వర్షములు కురియునపుడు తేలికభూములలో దుబ్బులను నాటవచ్చును. గట్టిభూములలో వర్షానంతరము నాటుట మంచిది. దుబ్బులు వేరునాటుకొన్న పిమ్మట పైపైన త్రవ్వవలెను. మొక్కలు కొంచెమెత్తుగ నుండుగట్లమీద నుండునట్లు చేయుటవలన అధికవర్షములు కురిసినను నష్టముండదు. ఈగడ్డిని మురికికాలువలక్రింద వేసినయెడల మిక్కిలి లాభకరముగ నుండును. పూనాలోని యొకచెరువులోనుండి ప్రవహించిన కుళ్లునీరుమూలమున 1900 సం॥ ములో ఎకరమునకు 56308 పౌనుల పచ్చిగడ్డి లభించెనని తెలియుచున్నది. కరాచీలో మురికికాలువక్రింద వేసినపుడు ఆసం

వత్సరములో 8 కోతలు కోయబడెననియు, ఒక్కొక్క కోతకు 25000 మొదలు 30000 పౌనుల పచ్చిగడ్డి లభించెననియు దెలియుచున్నది. దుబ్బు వేసిన మూడుమాసముల నాటికి మొదటి కోతకు సిద్ధమగును. అప్పటికి మూడునాలుగడుగుల యెత్తు పెరిగి యుండును. అంతకంటె నెక్కువగ నిల్చిన యెడల గడ్డి మృదుత్వము తప్పి పెళుసెక్కును. అట్టిగడ్డిని పశువులుగాని, గుఱ్ఱములుగాని సరిగా దినవు. పశువులు ఆరంభములో ఈగడ్డి నంతగా దినవు. విరేచనములు ప్రారంభించును. అలవాటైనకొలది పశువులకు మిగుల బలము కలుగును.

---

## ముండ్లులేని బొమ్మజెముడు

పశువులకు మేతదొరకని క్షామకాలములలో బొమ్మజెముడును వాడుచున్నారు. పశువులను మేపుటకు నెక్కువధన వ్యయము కానట్టియు, వాని కనుకూలముగా నుండునట్టియు నాహారము నొకదానిని కనుగొనుటకు మన దేశములో ప్రయత్నములు జరుగుచుండెను. ఈవిషయములో అనేకపరిశోధనలు జరుపబడెను. అనేక ఆహారముల విషయమై ప్రయత్నింపబడెను. కాని యింతవరకును ఈవిషయము నిర్ధారణకాలేదు. మన దేశములో నెల్లెడలను అడవివలె పెరుగు బొమ్మజెముడును పశ్వాహారముగ ప్రయత్నించి చూడవలెనని కొన్ని సంవత్సరములనుండి కొందరికి యుద్దేశ్యము కలిగెను. అట్లు ప్రయత్నించి చూడగ నిది చాల యుపయోగకరమైన ఆహారమని యనేక

ప్రదేశములనుండి తెలియవచ్చెను. దీనిని మిక్కిలి సులువుగ బెంచవచ్చును. బొమ్మజెముడును పశువులకు బెట్టునపుడు వాని ముళ్ళను దీసి పెట్టవలయునుగాని ముండ్లతో పెట్టరాదు. ముళ్ళ నుతీసినతరువాత మట్టలను చిన్నముక్కలుగాగొట్టి వానిని ప్రత్యేకముగగాని, తదితరపదార్థములతో కలిపిగాని పెట్టవచ్చును. ముళ్లను శుభ్రముగ మొదలంట తీసివేయకుండ పశువులకు పెట్టినచో నట్టి యాహారము పశువులకు హానికలుగజేయును. మట్టలకుండు నూగునుకూడ తొలగించవలెను. ముళ్ళు నోటి లోగుచ్చుకొనుటచేత మిగుల బాధనొందును. మరియు ఆహారము ముళ్ళు కలిసి కడుపులోనికిపోయిననుకూడ పశువున కపాయము తటస్థింపవచ్చును. ఇంకను ముండ్లు కడుపులోనిపేగుల కుగుచ్చుకొని అతివిరేచనములు, విరేచనములు మున్నగు వ్యాధులు పుట్టును. కొంతకాలమునుండి పరిశోధనలు సలిపి తత్ఫలితముగ ముళ్ళులేని బొమ్మజెముడొకటి సృష్టింపబడెను. ముళ్లులేని మట్టలను పరిశోధించి వానియందుండే పదార్థము లెన్నెన్నిపాళ్లుండునదియు కోయంబత్తూరు కళాశాలవారు కనుగొనిరి. ఆవివరము నీదిగువ నుదహరించినవియని వ్యవసాయపత్రికలు తెలియుచున్నవి.

| | |
|---|---|
| నీరు | 21.82 |
| కరిగిపోగల లోహపదార్థము | 6.82 |
| కరగని లోహపదార్థము | 0.07 |
| నూనెపదార్థము | 0.91 |
| కట్టెసంబంధమైన నార | 6.20 |

| | |
|---|---|
| క్రూడ్ ప్రొటీడ్ | 3 35 |
| కార్బోహైడ్రేటు | 60.83 |
| | 100.00 |

పైపదార్థములలో నీరు తక్కువభాగముండుటకు కారణము ఈ పరిశోధనము జరిగినప్పుడు మట్టల ఆవిరిపోయి యుండుటయని తెలియుచున్నది. ఈ బొమ్మజెముడును పశువులకు మేపిన పుష్కలముగ పాలిచ్చును. పాలు యిచ్చునుగదా యని దీనిని పశువుల కమితముగా వేయరాదు. ఈమేత యెక్కువగా మేపిన పారుడురోగము సంభవించి ఆరోగ్యము చెడును. ఒక పౌను ప్రత్తిగింజల పొట్టు యెంత బలముచేయునో సుమారు 8 పౌనుల బొమ్మజెముడు అంతబలము చేయును. ఎండుగడ్డి మేత కొంత తగ్గించి దినమునకు ఒక్కొక్క పశువునకు 60 మొదలు 75 పౌనులవరకు బొమ్మజెముడు మేత పెట్టితిమేని మంచిపాలు పడును. కాని పాలలో మిసిమి నూటికి 42 వంతున తగ్గిపోవును. ఈ మేతమేసిన పశువులు నీరు విస్తారముగ త్రాగవు. ఉదకక్షామము గల జిల్లాలలో ఈ బొమ్మజెముడు పశువునకు జాల యుపయోగకరము ఈమేత తినుపశువులు విశేషముగ పాలిచ్చునని వ్యవసాయ శాస్త్రజ్ఞులు అనుభవము మీదనే చెప్పుచున్నారు. ఈమేతను కమలునట్లుగ అనగా దోరగా కాల్చి పశువులకు వేయుట మంచిది. కేసోలయును కాగడాతో గాల్చిన యెడల ఒకకూలివాడు 50 నిమిషము.

లలో ఒకటన్ను జెముడును కాల్చవచ్చును. ఈమేతను ప్రత్తి గింజల దాణాతోగాని, ఎండుగడ్డితో గాని కలిపియిచ్చుట శ్రేష్ఠము. ప్రత్యేకముగ దీనినే మేపుట అంతమంచిదిగాదు. సామాన్యముగ మన రాజధానిలోనున్న అన్నిజిల్లాలలోనుండు అన్ని మెరక గ్రామములలోను ఈజెముడు బయలుదేరును. మెరక గ్రామములలో కొన్నిచోట్ల నీరులేక ప్రజలే బాధపడుచున్నపుడు ఈమేతను పశువుల కుపయోగించి లాభమును పొందెదరుగాక.

---

## సాగుచేయుట

బొమ్మజెముడును సాగుచేయుటసులభము. వ్యయము కూడ తగ్గును. ఒక్కొక్క మట్టగల మొక్క పాతిన 18 మాసములలో మూడడుగుల యెత్తుపెరిగి 30 మొదలు 50 మట్టలను గలిగియుండును. చిన్నమొక్కలు 20 మొదలు 40 మట్టలను గలిగియుండును. దీనిసాగునుగూర్చి ప్రత్యేకము శ్రద్ధగైకొను విషయ మెద్దియునులేదు. ఎరువుగాని, నీరుగాని యావశ్యకములేదు. సామాన్యపు అనావృష్టివలన దీనికేమియు నష్టముండదు. దీని సాగునకు జేయవలసిన శ్రమయంతయు విత్తుటకు పూర్వము భూమిని దున్నుటయు, విత్తినపిమ్మట అప్పుడప్పుడు మొక్కలమధ్య పెరుగు కలుపును దీసివేయుటయు నైయున్నది. ఎరువులు వేయుటవలన సామాన్యముగ నెక్కువఫలితము వచ్చును. ఈజెముడును బీడుభూములలోను, రాతి

భూములలోను, ఇసుక నేలలలోను గూడ వేయవచ్చును. భూముల చుట్టును ఆవరణము క్రింద దీనిని వేయవచ్చును. నీరు నిలుచు ప్రదేశములోను, రొంపిగ నుండు ప్రదేశముల లోను దీనిని వేయరాదు వర్షాకాలములో నీరు నిలువకుండు నట్లు చేయగల భూములలో వేయవచ్చును. మొక్కలను యెక్కడ వేయదలచుకొనిరో అక్కడనే మొదటినుండియు నుంచవలెను. ఈజెముడును డిశంబరు నెల మొదలుకొని మేనెల వరకును విత్తవచ్చును. అట్లు విత్తబడునవి చక్కగా బెరు గును. వర్షాకాలములో విత్తబడిన యెడల నవి చీకిపోవును. బొమ్మజెముడు మొక్కలను విత్తుటకుపూర్వము కొన్నిదిన ములు పొడిగానుండు నీడప్రదేశములలో నుంచవలెను. ఈ మొక్కలను సగభాగము పైకి ఉండునట్లు విత్తవలెను. ఈమొ క్కలను నిలువుగగాని, ఏటవాలుగగాని, అడ్డముగగాని యెట్లు విత్తననుసరియేగాని సగముమాత్రము భూమిలోని కుండవలెను.

---

# పిండులలోని రకములు

చమురుగింజలనుండి నూనెను, పిండిని వేరు చేయుదురు. ఈపిండిని పశువులకు మేతగాను, ఎరువుగాను వినియోగించెదరు. పిండులలో . సాధారణముగా కొంతనూనె మిగిలియుండును. ఎంతయుండునది, గానుగ ననుసరించి యుండును. కొన్ని యినుప యంత్రముల పిండులలో కొంచెమైనను నూనె యుండదు.

పశువులు కొన్నివిధములైన పిండులను తినును. కొన్నిటిని మాత్రము తినవు. నువ్వులు, ప్రత్తివిత్తులు, ఎల్లగిసె, ఆవ, కుసుమ, వేరుశనగ, కొబ్బరి మొదలగువాటి పిండి పశువులు ధారాళముగా తినును. ఆముదము, బొప్పాయి, మహువాపిండిని తినవు ఏయేపిండిని ఎరువుగా నుపయోగించునది వాటివెల ననుసరించియుండును. కొన్నిటిని పశువులు తినినందున వెల యధికమగుననిగాని, తిననందున వెల సరసమగునని గాని తలంచరాదు. కొన్ని ప్రదేశములలో పశువుల యాహారమున కుపయోగపడునవి చాల స్వల్పమగు ధరకు లభించును. అట్టి సందర్భములలో వాటినే యెరువుగా వినియోగించవలెను. పశువుల కుపయోగించని యాముదపుపిండి తినుటకుపయోగించువాటి కంటె వెలయధికము. ప్రతిరైతునకు యేది చౌకగా లభించునో యాలోచించుకొనవలెను. పశువులు తినదగిన పిండిని పశువులకు మేపి వాటి మలమూత్రములను నేలలకు వినియోగించిన యెడల రెండువిధముల లాభముండును. పశువులకు మేపినందువలన వాటిలోని వృక్షాహార పదార్థములు నశింపవు. అవన్నియు మలమూత్రములలోనే యుండును. కాని మలమూత్రములు పదిలముచేయుటయందు జాగ్రత్తలేని యెడల నష్టమగును. చెఱకు మొదలయిన వెలగల సస్యములను పైరుచేయుకోరెడువారు పశువులకు గానుగపిండి మేపి, వాటిని పొలములోనే రాత్రియందు కట్టివేసినయెడల నష్టముండదు. మేతకుండవలసిన ధర్మములకును, యెరువునకుండవలసిన గుణములకును చాల వ్యత్యాసముగలదు. తేమ, నార,

నూనె, మాంసకృత్తులు, ద్రావణీయమైన సేంద్రియపదార్థము మొదలైన వస్తువులన్నియు మేతకుపయోగపడెడు పిండిలో నుండవలెను. ఎరువులో సున్నము, ఇసుక, స్ఫురికామ్లము, పొటాష్, నత్రజనికి సంబంధించిన పదార్థము లుండవలెను. ఈకారణమువలన మేతకుపయోగపడని పిండిలో యెరువుల కుపయోగపడెడు పదార్థము లెక్కువగా నుండును.

---

# ప్రత్తిపిండి

ప్రత్తిగింజలు పాలపశువుల కాహారముగా వాడబడుచున్నవి. ఈగింజలకుపైన కొంచెముప్రత్తి యంటియుండును. ఈప్రత్తియు, గింజలపైపొట్టును జీర్ణము గావు ప్రత్తిగింజల యందు తగినంత చమురున్ననేగాని పశువులకు బెట్టినపుడు జీర్ణముకాదు. ప్రత్తిపండు జిల్లాలలో ప్రత్తిగింజలు చౌకగదొరకును. ఈగింజలను చితుకగొట్టి యెరువుగ వేయవచ్చును. చెఱకుతోటలలోకూడ ప్రత్తిపిండి యెరువుగ వేసి తగినంత ఫలితమును బొందవచ్చును. ఎక్కువకాలము నిలువయున్న యెడల ప్రత్తిగింజలు పశ్వాహారమునకు పనికిరావు. అప్పుడు గింజలు చౌకగదొరకును. కనుక వీనినిగొని ఎరువుగ వాడవచ్చును. నిలువగింజ లగుటవలన యెరువునకు బనికిరావని తలంపరాదు. ఎరువునకు చమురుఆరిపోయిన గింజలే శ్రేష్ఠము. చమురున్నగింజల నెరువుగా నుపయోగించినప్పుడు త్వరగ ఫలి

తము కాన్పించదు. ప్రత్తిగింజయందు మిక్కిలి తక్కువచము రుండుటచేత చమురును దీయుటకీదేశమున ప్రయత్నింపబడుట లేదు. ఐరోపాదేశములో ప్రత్తిగింజల పైపొట్టును తొలగించి పిండిని సిద్ధముచేయుచున్నారు. ఇది ప్రశస్తముగను, పశ్వాహారముగను, యెరువుగనుకూడ నుపయోగింప బడుచున్నది. ప్రత్తినూనె కొంచెము పసుపురంగునుగలిగి రుచిగానుండును. ఇట్లు పైపొట్టు తొలగింపబడి తయారుకాబడిన ప్రత్తిపిండి ఎరువులన్నిటితో సమానమైనదిగా నుండవలెనని కనుగొనబడినది. ఇందు నూటికి 7 పాళ్లు నత్రజని యుండునట్లు తెలియుచున్నది. ఇంకను ఈపిండిలో పదివేలపాళ్ళలో 950 పాళ్ళనీరు, 1575 పాళ్ళ మాంసకరపదార్థములు, 3274 పాళ్ళ ఉష్ణకర పదార్థములు, 2035 పాళ్ళ నార, 376 పాళ్ళ ఉష్ణకర పదార్థములు, 1790 పాళ్ళ నికరవస్తువులుండును. ప్రత్తిగింజలపైపొట్టునుదీసి శుభ్రముచేయకుండ సిద్ధముచేయబడిన పిండిలోనూటికి 3 4 పాళ్ళనత్రజనియు, 1.26 పాళ్ల భాస్వరామ్లమును మాత్రమే యున్నట్లు తెలియుచున్నది. ఆముదపుపిండికంటె ప్రత్తిపిండి చెఱకుతోటలకు బాగుగా పనిచేయును. ప్రత్తిపిండి పెట్టబడిన పశువులు కొబ్బరిపిండి పెట్టబడినవానికంటె యెక్కువపాలిచ్చును. పశువులకు కొబ్బరిపిండికంటె ప్రత్తిపిండి యెక్కువ యిష్టము. ప్రత్తిపిండి పెట్టబడిన పాడిపశువుల పాలలో క్రొవ్వుపదార్థ మెక్కువగ నుండును. దానిచే వెన్నఎక్కువై పూర్వముకంటె నెక్కువజిడ్డుగను, గట్టిగను ఉండును. నేయికూడ గట్టిగ ముద్దగ నుండును. ప్రత్తిగింజల పదార్థము పశువులకు

పెట్టుచున్నంతకాలము యిట్లుండును. ప్రత్తిపిండినిగాని, గింజలను గాని యధికముగా పెట్టరాదు. గింజలలో చమురెక్కువనుం డునుగనుక పిండినే పెట్టుట యుత్తమము. ప్రతిదినము యితరా హార పదార్థములలోగూడ ప్రత్తిపిండిని జేర్చి పెట్టుటవలన ప శువులకు బలమునిచ్చుటయేగాక వెన్నయు పాలును వృద్ధియై వానియందు చాలమంచిగుణములు కలుగును. ప్రత్తిపిండివలన వెన్నవలె పాలంతగా వృద్ధియైనట్లు కానరాదు.

---

## ఆముదపు పిండి

ఈపిండి పశువులు కొద్దిగ దినినయెడల విరేచనముల గును. ఎక్కువబెట్టినయెడల పశువున కపాయము తటస్థించును. కనుక దీనినెక్కువగ పశువులకు బెట్టరాదు. ఈపిండిని సాధా రణముగా పైరులకు ఎరువుగా నుపయోగించెదరు గాని పశువుల కెక్కువగా నుపయోగించరు. గుజరాతులో ఆముదపుపిండిని పీపాలోవేసి నాననిచ్చి దానిని నూతికడనుంచి సస్యమునకుబో వునీరు దానిగుండ బోవునట్లు చేయుదురు. ఆముదపుపిండిలో సారమంతయు నీటివలన కొట్టుకొనిపోయి సస్యమునకు జేరు చున్నది, కొన్నిదినములైన పిమ్మట పీపాలోనిసారము పోయిన పదార్థమునుదీసి పశువులపెంటతో జేర్చుదురు. పరిశుభ్రమగు ఆముదపు గింజలనుండి వచ్చినపిండియందు నూటికి 4.5 పాళ్ల నత్రిజనియు, 4 పాళ్ల భాస్వరము, 2 పాళ్ళ పొటాషు నుండును.

---

## వేరుశనగ పిండి

వేరుశనగ కొద్దికాలముక్రిందటనే మన దేశమునకు వచ్చినది. దీని పుష్పములు రాలిపోయినతరువాత కొమ్మలు నేలలోనికి దిగి యచ్చట కాయలగుచున్నవి. ఈపైరు సున్నపుపాలెక్కువ కలిగిన గరపనేలలలో చక్కగాపైగగును. ఇది అయిదారు నెలల పంట. పంట తేరగానే పైవచ్చితీగెను కోసి యెండవేసిన పశువుల మేత కక్కరవచ్చును. ఈశనగలో చమురు విశేషముగ నుండును. ఈచమురు దీయబడినపిండియందు నత్రిజని పదార్థము లెక్కువగ గలవు. ఈపిండిని పశువులకు బెట్టి వాని మలమూత్రములను జాగ్రత్తచేసినప్పుడు మిక్కిలి విలువయైన యెరువు లభించుచున్నది.

---

## తెలికపిండి

ఇది నాజూకైనపైరు. ఇది సామాన్యముగా తొలకరి వానలకే చల్లబడును. ఇది నాల్గుమాసముల పైరు. ఈ నువ్వులలో రెండురకము లుండును. ఒకరకము ఎరుపుదాళుగా నుండును. రెండవ దానిగింజలు తెలుపురంగుగా నుండును. ఈ గింజలను గానుగాడి నూనెతీయుదురు. నూనె శుభ్రముగా నుండవలెనన్న గింజలను తడిపి పొట్టుతీసి పప్పుచేసి గానుగాడుదురు. తెలికపిండి పాలిపశువులకు మంచి ఆహారము గనుక దీనిని ప్రత్యేకముగ యెరువుగ వాడుటకంటె పశ్వాహారముగ వాడి వాని మలమూ

త్రాదులు నష్టముగాకుండ జాగ్రత్తగా నిలువచేయుటయే యోగ్యముగా కన్పట్టుచున్నది. ఈ పిండిలో పదివేల పాళ్లలో 1080 పాళ్ళనీరు, 3175 పాళ్ళ మాంసకరపదార్థములు 2900 పాళ్ళ ఉష్ణకర పదార్థములు, 365 పాళ్లనార, 1140, పాళ్ళ లవణ పదార్థములు, 1340 పాళ్ల తదితరవస్తువులు నుండును. పిండు లన్నిటిలో తెలికపిండి మిక్కిలి సారమైనది. పశువునకు మిగుల బలము గల్గించును.

---

# కొబ్బరి పిండి

జాంజిబజారులోని కొబ్బరిచెట్లు 8 సంవత్సరములనాటికి కాపుప్రారంభమై 60 మొదలు 70 సంవత్సరములవరకు గాయుచున్నవి. అచ్చట ఎండుకొబ్బరిని చేయుటకు యంత్రసామగ్రి నింక నుపయోగించుటలేదు. ఎండలోను, పొగబెట్టియు కొబ్బరి నెండించుచున్నారు. ఈ కొబ్బరి యితర ప్రదేశములలోని కొబ్బరికంటె చాల ప్రశస్తముగ నున్నదని తెలియుచున్నది. మలబారునుండి కొబ్బరి కురిడీలు బొంబాయికి గొని రాబడుచున్నవి. అచ్చట వానిని చిప్పలుగ గోసి యెండబెట్టి చమురుతీయుదురు. దీనిని పశువుల కాహారముగను, భూముల కెరువుగను ఉపయోగించుచున్నారు. కొబ్బరినూనెను పచ్చికొబ్బరినుండియు, ఎండుకొబ్బరి నుండియు తీయుదురు. గానుగ యాడినపుడు నూనెయు, పిండియు వేరగును. ఈపిండిని మనుష్యులుకూడ తిందురు. ఈపిండి పాటుపడు పశువులకు అంతగా

మంచిదిగాదు. ఈపిండిని ఇంక కొలంబోనుండి యూరపునకు విశేషముగా ఎగుమతి చేయుదురు. ఆరంభములో ఈపిండిని పశువు లంతగా దినవు. అలవాటు చేసినకొలది దినమునకు యేడున్నరపౌనుల కొబ్బరిపిండిని తినునట్లు చేయవచ్చును.

---

# సోయబీను పిండి

సోయబీను గింజలనుండి నూనె తీసివేయబడిన తరువాత దీనిని సోయబీనుపిండి యందురు. సోయబీను తూర్పుదేశము లందు విశేషముగా పండింపబడి ఆహారపదార్థముగ నుపయోగింపబడుచున్నది. ఇది యీదేశమునకు 1908వ సంవత్సరమున వచ్చెను. కొంతవరకు సోయబీనుగింజలే పశువుల కాహారముగ పెట్టబడుచున్నవి. కాని చాలాభాగమువరకు నూనెతీసివేయబడిన పిండియే ఆహారముగ నుపయోగపడుచున్నది. నూనెతీసివేయబడిన పిండిలో యింకను కొంతనూనె యుండును. ఇట్టిపిండిని రసాయనిక పద్ధతిని నూనెనంతయు తీసివేసెదరు. ఈపిండియందు నూటికి 40 మొదలు 45 పాళ్ళ షరకు పిండిపదార్థమున్ను, 8 పాళ్ళ నూనెయు నుండును. ఇది ప్రత్తిపిండిని పోలియుండును. ప్రత్తిపిండివలెనే దీనినిగూడ పశువుల కితర ఆహారములతో కొద్దిగ కలిపిపెట్టవలెను.

---

# గ స గ సా ల పిం డి

ఉత్తర హిందూస్థానమునందును, మధ్యపరగణాలయందును, వంగదేశమందును, రాజపుత్రస్థానమందును, అనేక శతాబ్దములనుండి నల్లమందు కొరకు గసగసాలను పైరుచేయుచుండిరి. ఉత్తరహిందూదేశమందు గసగసాలను కూరలలోను, మిఠాయి మొదలగు తినుబండారములలోను విశేషముగా నుపయోగింతురు. ఈపిండిని బీదవారనేకులు భుజించెదరు. ఇంకను ఎరువుగా నుపయోగింతురు. గసగసాలు విశేషముగ యూరపునకెగుమతి చేయబడుచున్నవి. ఈపిండిని పశువులకు సంభవించు పెద్దరోగములకు వాడుదురు.

---

# ఆ వా ల పిం డి

ఆవాలలో రెండువిధములగు నూనె లభించును. ఒకవిధము సులభముగా ఆవిరియైపోవును. రెండవది సామాన్యమైనది. మొదటిది యూరపు ఖండమునందు కూరలకును దేహమునకు రాచుకొనుటకు నుపయోగింపబడుచున్నది. బజారులలో లభించెడి నూనెలో సాధారణముగ చేదు, రుచియుండును. పంజాబు సంయుక్త రాష్ట్రములు, వంగదేశములలో ఆవాలను ప్రత్యేకముగా పైరుచేయుదురు. ఇతర రాజధానులలో అంత ముఖ్యమైన పంటగాదు. హిమాలయపర్వతములమీద 11,000 అడుగుల యెత్తువరకు పైరుచేయబడుచున్నవి. ఆవాలను బఠానీలతోకలిపి పైరుచేయుట శ్రేష్ఠ

మని ముకర్జీగారు తన వ్యవసాయ గ్రంథమునందు వ్రాసియున్నారు. ఏలనన కలిపి పైరుచేసిన ఆవాలు బాగుగాపెరుగును. నువ్వులు దక్షిణదేశమందు యెంత ముఖ్యపంటయో బంగాళాదేశమునందు ఆవాలు అంతముఖ్యము. ఆవాలపిండి పశువులకు పెట్టరాదు. అథవా పెట్టినను తగినంత పరిమాణము తీసికొని పెట్టవలెను. ఎక్కువగా పెట్టిన కాకరోగములు సంభవించును. తెలికపిండితో ఆవాలపిండి కలిపి బజారులలో అమ్ముదురు. రెండుపిండులు కలిపి మేపినచో పశువులకు జబ్బుచేయును.

---

## పశుదేహనిర్మాణము

పశువుయొక్క దేహము పెద్ద గడియారమువలె మిక్కిలి సున్నితమును, కడు సంశ్లిష్టము నయిన యంత్రమయియున్నది. ఈ దేహయంత్రము ప్రకృతిసూత్రముల ననుసరించి నడచుచుండును. ఈయంత్రముయొక్క వివిధభాగములు పరస్పరానుకూల్యత గలిగియుండునట్లు తగువిధమున జాగ్రత్తతో మెలగుచుండినయెడల చాలకాలము పనిచేయును. ఈ దేహయంత్రము తనయందలి కార్య నిర్వాహక శక్తిని తనయందే జనింపజేయుటయేగాక ద్రవములను, రసములను, చమురు పదార్థములను గూడ తన యందే సృష్టించుకొను చున్నది. పశువుదేహమం దంతటను వ్యాపించియున్న నాడీతంతువు మూలమున అద్భుతరీతిని కార్యకరణశక్తి సర్వేంద్రియములకును, సర్వాంగములకును ప్రవహించుచున్నది. ఈశక్తియొక్క


1
2
3
4
5
6
8
9
9
10
12
12
12
13
14
15
16
17
18
19
20
21
21
22
23
24
25
26
27
29
30
31

పశు దేహ నిర్మాణము.

ప్రసారమున కాటంకములేకుండ జాగ్రత్తగొనవలెను. అట్ల యినగాని యీ దేహయంత్రము నిరాటంకముగ నడువ జాలదు. ఈయంత్రరాజమున మెదడనునది యింజనును బోలి యున్నది. అందుండి జీవశక్తి దేహమంతటికిని ప్రవహించు చున్నది. మెదడునుండి పెద్ద నాళ్ళు బయల్వెడలుచున్నది. ఆ పెద్ద నాళ్ళనుండి అనేక చిన్ననాళ్ళును, మరియు నాచిన్ననాళ్ళనుండి యతిసూక్ష్మములగు నాళ్ళును శాఖోపశాఖలుగా వేనవేలు బయలుదేరి దేహమందుగల సర్వావయవములను మెదడుతో సంబంధింపజేయుచున్నవి. ఈనాళ్ళగుండ తగినంత జీవశక్తి ప్రవ హింపనిచో దేహమందే భాగమును స్వధర్మమును విడువజా లదు. ఈశక్తికి స్వల్పముగ నాటంకముగలిగినచో రుగ్మతయు, పూర్తిగా నాటంకముగలిగిన మృత్యువును కలుగును. శరీరము యొక్క భాగము మోయుటకు పై సామగ్రి యంతయు కావలయును. లేనియెడల పశువు నిలువజాలదు. ఏబరువైనను పశువు మోయజాలదు. ప్రతిరైతు దేహమందలి ముఖ్యావ యవములను వాని యుపయోగములను తెలిసికొనవలయును

---

## ముక్కు రంధ్రములు

పశువు శరీరమునకు ముక్కురంధ్రములే ప్రధానమైనవి. ఈరంధ్రములను శుభ్రముగా నుంచకపోయినచో ఊపిరితిత్తులు దుర్బలము లగును. పశువు మేత, నీరులేకుండ చాలకాలము బ్రతుకవచ్చునుగాని గాలిపీల్చకుండ కొన్ని నిమిషములైనను

బ్రతుక జాలదు. ముక్కురంధ్రములు శుభ్రముగా నుండ నిచో ముక్కుగుండ లోపలికిపోవు గాలియంతయునుగూడ అపరిశుభ్రమే యగును. ఇంకను రోగక్రిములును చేరును. జలుబు, రొంప మొదలగు నాసికారోగములు సంభవించును. ముక్కు యొక్క రెండు భాగములుగా జేయబడినది. ఒక్కొక్క భాగము ముక్కురంధ్ర మని పిలువబడును. ఇట్లు రెండుముక్కురంధ్రము లేర్పడి పైన నలువురంగుగల మెత్తని మాంసకండరములలో నిమిడియున్నది. ఈరంధ్రములు వాసనను తెలిసికొనునట్టి ఇంద్రియములు. ముక్కురంధ్రము యొక్క లోపలిభాగము మిక్కిలి మెత్తని తడిచర్మముతో కప్ప బడియున్నది. సాధారణముగా పశువులు పీల్చుకొనుగాలి ఈ భాగమందలి తడిచర్మమునకు తగులుచుండునుగాన బలమైన వాసనలు వానికి సులభముగా గోచరమగును. కాని అవి బల హీనముగా నున్నపుడు గాలిని లోపలికి గట్టిగ పీల్చినగాని వాసన తెలియదు. ఈ ముక్కురంధ్రములయందుచుననంద నేకము లైన మెత్తని నరములు రక్తనాళములు నుండును.

---

## నోరు

పశువుశరీరమునకు సింహద్వారము నోరు. కావున దీనిని పరిశుభ్రముగా నుంచవలెను. నోరనునది ఆహారమును లోపలికిజేర్చు భాగము. నోటికిముందుగా పెదవులును, ప్రక్క లయందు దౌడలును, వానియందు పండ్లును ఉన్నవి. పశువు

తిను ఆహారము నెత్తురుగామారు పనియొక్క మొదటిభాగము నోటిచేత చేయబడుచున్నది. నోరుతినినదానిని గ్రహించి సుల భముగా మ్రింగుటకును, జీర్ణమగుటకును అనుకూలముగా నమలి కడుపులోనికి త్రోయబడుచున్నది. ఈకార్యము చేయు టకు పండ్లు, దౌడలు, నాలుక, ఉమ్మినీరు ముఖ్యసాధనములు. ఇంకను పశువునోటియందు వేడిమియు, తేమయు, మేతసంబం ధములగు సన్నని ముక్కలునుండును.

---

## నా లు క

ఇది కండరములయొక్క సముదాయముతో చేయబడి యున్నది. ఇది పశువునోటిలో నడుగుభాగమున పరువవలె నుండి దౌడలకుమధ్య నమర్చబడియున్నది. దీనియందు ఎము కలులేవుగాన అనేకవిధముల పశువు త్రిప్పుటకును, చాపుట కును, ముడుచుటకును వీలగుచున్నది. గడ్డిమొదలగు పదార్థ ములు పశువులు నములునపుడు ఆ యా పండ్లకుతగిన పదార్థ ములను అటునిటు పడద్రోసికొనుటకు నాలుక సాధనమై యున్నది. నమలినవెనుక నోటనున్న ఆహారమంతయు నాలుక యే ఒకటిగాకలిపి గొంతులోనికి త్రోయుచున్నది. నాలుకమీ ద్గలడి ఎల్లప్పుడుండును రుచిని తెలిసికొనుటకు యేవస్తువైనను నీటిలోకరగవలసియున్నది.

---

# నేత్రము

పశువుయొక్క జ్ఞానేంద్రియము లన్నిటిలోను నేత్రము లును, శ్రోత్రములును మిక్కిలి ముఖ్యమైనవి. సమస్తేంద్రియ ములలోను కన్ను ప్రధానమైనది. కన్ను పశువుయొక్క శరీర మునకు మిక్కిలి యుపయోగకరముగా నుండి ముందుభాగ మందు అనగా శిరస్సుయొక్క ముందుభాగమునం దుంచబడి యున్నది. వస్తువులయొక్క రూపమును, పరిమాణమును, రంగును, స్థానమును తెలిసికొనుట కుపయోగించు యింద్రియ మిదియె. ఇది మృదువైన యింద్రియమగుటచే పశువు లజా గ్రత్తగా నున్నయెడల దీనికి భంగముకలుగును. ఇది ఒకసారి చెడిపోయినయెడల దీనిని బాగుచేయుట దుర్లభము. కావున దీనిని కాపాడుటకు సృష్టియందే భగవంతుడు కొన్ని యేర్పా టులు చేసియున్నాడు. కంటియొక్క నిర్మాణముబహు ఆశ్చర్య మైనది. పూర్వకాలమునందుండిన ఒక గొప్ప వైద్యుడు దానిని పరీక్షించి చూచి సృష్టికర్తయగు దేవుని స్తుతించుచు నొక కీర్తనవ్రాసెనట. పశువు తనకంటి నన్నిదిక్కులకు త్రిప్ప గలుగుటకు భగవంతుడు రెండుకన్నుల నేర్పరచి యున్నాడు. దురదృష్టమువల్ల నొక కన్నుపోయినను రెండవకన్ను సహా యము చేయును. పశువు మూతి కిరుప్రక్కలను కనుగుంటలన బడు యెముకలగూడులలో నేత్రగోళము లమర్పబడియున్నవి. ఎదుటిభాగమునకేగాక నేత్రముయొక్క మిగిలినభాగము లన్నియు కనుగుంటలయందుండు యెముకలచేత సంరక్షింప

బడును. నేత్రగోళమునకు వేడిమిగలిగించుటకును, అదురు దెబ్బలవలన దానికి భంగముకలుగకుండునట్లు చేయుటకును దీనిచుట్టును క్రొవ్వుతోచేయబడిన మెత్తనిపదార్థ ముండును. ఇంకను దీనియందు రక్తనాళములును, నీటికాలువలును పోషణనిమిత్తము ప్రవహించుచుండును. కనుబొమలు, కను రెప్పలు, రెప్పల చివరనుండు వెండ్రుకలు నేత్రము యొక్క ముందుభాగమున రక్షించును.

---

## కనుబొమలు - కనురెప్పలు

పశువుకంటిని కాపాడుటకు రెండుమూతలుకూడ నున్నవి, వానిపేరు కనురెప్పలు. సూర్యుని వెలుతురు తీక్ష్ణముగా నున్నపుడు కనురెప్పలు కన్నులను కాపాడును. నిద్రించువేళ నవి మూసికొనును. ఈరెప్పలకొనలయందుండు వెండ్రుకలు నేత్రములకు నీడను, అందము నిచ్చుటయేగాక, గాలిలో ఎగు రుచుండు దుమ్ము, పురుగులు, పదార్థములయొక్క చిన్నచిన్న నలుసులు మొదలగునవి కండ్లలోనికి జారనీయకుండ కండ్లను కాపాడును: కండ్లను బాగుగా కాపాడునవి కనురెప్పలు. ఇవి కంటికి పైభాగమునం దొకటియు, క్రిందిభాగమునం దొకటియు నమర్పబడియున్నవి. కంటియొక్క పైరెప్ప క్రిందిదానికంటె పెద్దదిగా నుండి సుఖముగా కదల్చుటకు వీలుగా నుండును. కంటిని మూయుట లేక తెరచుటయు ముఖ్యముగా పైరెప్ప చేతనే కలుగుచుండును. కంటిచుట్టునుండు గుండ్రనికండర

సహాయముచే ఈ రెప్పలు మూతపడుచుండును. ఈ రెప్పల పై వైపున చర్మముతో కప్పబడి అడుగుభాగమున తడిచర్మముతో కూడియుండును. ఈ తడిచర్మము పశువు కనురెప్పల యొక్క అడుగు భాగమందు మాత్రమే యుండక వెనుకకు తిరిగి కనుగుడ్డునుకూడ కప్పియుండును, కాబట్టి రెప్పల అడుగుభాగమందును, కనుగుడ్డు పైభాగమందును ఈ తడిచర్మమే యుండును. ఇంకను కంటిలో కన్నీళ్ళతిత్తి యొకటి గలదు. దానిలోనుండి కన్నీళ్ళు వచ్చి కంటి పై భాగమును తడిపి కంటిలో నేవస్తువైనను పడియున్న యెడల దానిని కడిగివేయును. కనురెప్పల మూలముగా కన్నీళ్లు కంటిమీద వ్యాపించుచుండును. కనుబొమ్మ అనునది కంటికిమీద విల్లువంపులాగున వెండ్రుకలచే నిండియుండుభాగము. కనుబొమ్మలు పశువుయొక్క నొసలునకు క్రిందుగను, కంటికి పైవైపునను యేర్పడియున్న వెండ్రుకల వరుసలుగనుక ఇవి పశువుముఖమునకు అందము నిచ్చుటయే గాక నొసలునందు పుట్టు చెమటను కండ్లలోనికి రాకుండ జేసి కండ్లను కాపాడుచుండును. కనురెప్పప్రక్కనుండు వెండ్రుకలు మిక్కిలిసూక్ష్మమైన వస్తువులు కంటిలోబడకుండ తప్పించుటయేగాక కంటికి నీడను అందమును యిచ్చుచున్నది.

---

## కనుగుడ్డు

పశువు కనుగుడ్డు గుండ్రముగా నుండును. ఇది కనుగుంట యనబడెడు ఎముకగూటిలో నమర్పబడియున్నది. అందు

వలన సాధారణముగా దీనికి దెబ్బ తగులనేరదు. ఇది మిక్కిలి కోమలముగా నుండును. కావున దీనిని కాపాడుటకై కనుగుంట యందు ఒకవిధమైన క్రొవ్వుపదార్థముండును. అది దిండువలె నేర్పడి గ్రుడ్డునకు అదరుదెబ్బ తగులకుండ జేయుటయేగాక ఎముకలతో రాపిడికలుగకుండగను గ్రుడ్డు నానావిధముల తిరుగుటకును, దానికి వేడినిగలిగించుటకును ఉపయోగపడుచున్నది. కొన్నిపశువుల కనుగ్రుడ్లు గుంటయందు లోతుగా నమర్చబడి యుండక మెరకగా నుండును. అందువలన కన్నులు పెద్దవిగా కనబడును. కనుగ్రుడ్డు సర్వదా కదుగబడుచుండుటకు కొన్ని విచిత్రమైన యేర్పాటులు గలవు. కనుగ్రుడ్డు బంతివలెనుండి చుట్టును ఆవరణపుపొరలను కలిగియున్నది. వీనిలో పైభాగము నందుండునది పైపొర. దీనినేమనము తెల్లగ్రుడ్డని చెప్పుచున్నాము. దీనికి వెనుకనుండునది మధ్యపొర. ఇదినల్లగానుండుటవలన దీనిని నల్లగ్రుడ్డని చెప్పుచున్నాము. పశువుకనుగ్రుడ్డుయొక్క పైపొర తెలుపురంగు గలిగి మిక్కిలి దృఢమైన నారవంటి పదార్థముతో చేయబడి యున్నది. ఇది లోపలనుండు మృదువైన భాగములను కాపాడుచుండును. అన్ని పొరలలోను యిది గట్టిదగుటవలన సాధారణముగా బ్రద్దలు కానేరదు. ముందరిభాగము కొంచెము గుండ్రనిమేరతప్ప ఈపొర కనుగ్రుడ్డు నంతను కప్పియున్నది. ఇంకను ముందరిభాగమున ఉబ్బెత్తుగా కనబడును. పశువుకనురెప్ప లెప్పుడును ఆడుచుండుట చేత నీ తెల్లగ్రుడ్డుయొక్క నునుపును దానిగుండ వెలుతురు పోనిచ్చు శక్తియు కాపాడ బడుచుండును. కనురెప్ప లాడు

చుండుటచేత తెల్లగుడ్డు యెప్పుడును తేమగానుండి శుభ్రము చేయుచుండును.

నల్లగుడ్డు పశువు కంటిలోనుండు పైపొరకును, లోపలిపొరకును నడుమ నుండును. దీనియందు నల్లని రంగుపదార్థముండుటచేత యిది నల్లగా నుండును. దీనినే నల్లగ్రుడ్డు అందురు. ఈగుడ్డు కంటికి రంగునిచ్చును. గవ్వకండ్లు తేనెకండ్లు మొదలగునవి దీనివలననే కలుగుచుండును.

---

## మెడ

పశువునకు మెడ చాల పొడవుగా నుండును. ఇది నిలుచుండిగడ్డిమేయవలసిన జంతువుగాన మెడపొడుగు లేకున్నచో నేలమీదగడ్డిని అందుకొనజాలదు. ఇంకను పశువుతలలోనున్న భాగములన్నియు మెడమీదనే ఆధారపడియున్నవి. కాన మెడలోనున్న సామానులుగూడ మిగుల దృఢమైనవిగ నుండవలెను.

---

## పండ్లు

పండ్లు శుభ్రముగా నున్నయెడల పశువుముఖమునకు అందము వచ్చును. బాగుగా నమలుటకు వీలగును. పశువు తిను ఆహారము కొరకుటకును, చించుటకును, నమలుటకును తగిన రూపపరిమాణములు గలవియై మిక్కిలి దృఢమైన సాధనములుగా జేయబడియున్నవి. పశువుశరీరమునం దుండు ఎముకలకంటె పండ్లు మిగుల కఠినమైనవి. పండ్లన్నియు పశువు

దౌడలయందుండు గొట్టములలో నమర్చబడి యుండును. ఆ గొట్టములలో సిమెంటును బోలియుండు జిగురుపదార్థమునుండి వీటిని ఎముకలతో జేర్చి పట్టుకొనును. ఇంకను పంటిమధ్య జిగురువంటి పదార్థములోనికి రక్తనాళములు పోవును. ఇంకను లవణపదార్థము లుండును. ఇవి ఒకదానితో నొకటి రాచు కొనుటచేత అరిగిపోకుండునట్లుగా చిగుళ్ళకు పైన ఒకవిధమైన పూతగలిగియుండును. నెమరువేయుజంతువులకు క్రిందిభాగమున ఎనిమిదిపండ్లుండును. పైన మునిపండ్లు లేకుండుటచేత తన యాహారమును క్రిందిపండ్లతోను, పై యిగుళ్ళతోను బట్టి పెరుకును. అందువలన పశువు మేతమేయునపుడు తల నాడించుచుండును. పశువునకు క్రిందను మీదను ఇరువదినాలుగు పండ్లుండును. ఈ పండ్లనుబట్టియే వయస్సు కనుగొనవచ్చును.

---

## ఆహార వాహిక.

ఇది పశువుగొంతునకు మొదమభాగమందుండును. దీనికి స్పర్శజ్ఞాన మధికము. ఆహారపదార్థములు దీనికి తాకిన వెంటనే దానిని లోపలికి పోనిచ్చి వెనుకభాగమంచు ముడుచుకొనుచు దానిని ముందునకు జరుపును. ఇట్లు మేత నీరు కొంత పోయినతరువాత తిరిగి వెనుకభాగము ముడుచుకొనుటవలన యిది క్రమముగా జరుగుచు జీర్ణాశయములోనికి బోవును. ఇది జాలరుసంచివలె నుండును. మరియు పశువునోటికి నెమరు తెచ్చుకొను విధము కూడ ఈ మార్గముననే. ఈ గొట్టము

యొక్క లోపలి భాగము యెల్లప్పుడు తడిగా నుండును. అందు వలన ఆహారము ఈ గొట్టముగుండా జారిపోవును.

---

## జీర్ణకోశము.

నెమరువేయు జంతువులకు నాలుగు ఆహారతిత్తులుండును. మొదటిదానిని పెద్దతిత్తి యందురు. పశువు మేసెడి మేత ఈతిత్తిలోనికి జేరును. ఈ తిత్తియొక్క లోపలిభాగమున ఒక విధమైన పొర లుండును. వీనిచేత చక్కగా మేత తడితో నిండి యుండును. తరువాత రెండవతిత్తిలోనికి ప్రవేశించును. ఈ తిత్తిలోపలిభాగము కాసులు కాసులుగా నుండును. నెమరు వేయుటకు కావలసిన రసము యిచ్చట చేరియుండును. ఇది పై తిత్తికంటె దళసరిగ నుండును. పైతిత్తిలోనున్న మేత ఈతిత్తి లోనికి జేరి యుండ లుండలుగా నగును. ఈయుండలను పశువు నోటిలోనికి దెచ్చుకొని చక్కగా నమలి మ్రింగును. ఇంకను రాళ్లు, ఇనుపముక్కలు, మొదలగు అన్యపదార్థములు ఈ తిత్తిలో జేరి యుండును. పశువులచే పూర్తిగా నెమరువేయబడిన ఆహారము యీతిత్తిలో జేరిబాగుగ జీర్ణమగును. ఈ తిత్తి కాగితములవలె పొరలుపొరలుగా నుండును. ఈపొరలకు ఒకవిధమైన సూక్ష్మజీవు లంటియుండును. పూర్తిగా నెమరువేయబడిన మేత ఈతిత్తిలో జేరి బాగుగా జీర్ణమగును. ఈ తిత్తిలోనున్న మేత తడిలేనట్లుండును. జీర్ణమైన మేత నాల్గవతిత్తిలోనికి జేరును. దీని లోపలి భాగమునందు ఎఱుపు రంగుగల మెత్తత లుండును.

ఇచ్చట జాఠరరసము పుట్టుచున్నది. ఇది పుల్లగ రుచిగ నుండి రుచిని గలిగించును. నీరు మొదలగు ద్రవపదార్థములు పశువు మ్రింగిన వెంటనే ఈతిత్తిలోనికి జేరును. ఈతిత్తిచివరనుండి పేగులు ఆరంభమగుచున్నవి. ఈపొట్టకును, మొదటిపేగున కును మధ్య కంఠమేర్పడియుండును. మొదటిపేగుమొదలు కొని ముడ్డివఱకు 150 అడుగుల కొలతగల పేగు ఉండును. పశువు దేహ మెంతపొడుగుండునో, అంతకు ఇరువది మొదలు ఇరువదియైదు అంతలు పొడవుగల పేగుండు నని పశుశాస్త్రజ్ఞులు తెలుపుచున్నారు.

---

## పశువుయొక్క ఆహారము జీర్ణమగువిధము

పశువుశరీరము పనిచేయుచున్న ఆవిరియంత్రమును పోలియున్నది. యంత్రమునకు నీరు, బొగ్గు,గాలి యిచ్చుచున్నంత కాలము అది పనిచేయుచుండును. దానికి ఆహారమిదియే. కొంత కాలమైన తరువాత అరిగిపోయినభాగములు అనగా చీలలు మేకులు లోహములతో చేయబడిన తదితరభాగములను తిరిగి పూర్తిచేయుచుండ వలయును. దీని కీరీతిగ ఆహార మిచ్చుచున్నయెడల యంత్రము వేడియెక్కి తనలో మరలను పనిచేయించుటయేగాక దానికి కట్టబడియున్న బరువైన పెట్టెలును, పెట్టెలలోనుండు మనుష్యుల సామానులను ఈడ్చుకొని పోవుచుండును. ఇట్లు పనిచేయుటకు యీ యంత్రమునుండి అంగారక్షారవాయువు నీటి ఆవిరి బయలు వెడలు చుండును. అగ్ని

గుండములో నుండి కాలగా మిగిలి నిలిచిపోయిన బొగ్గుగూడ బయటికి త్రోసివేయబడును. పశుదేహమును పోషించునది ఆహారము. శరీరమునకు ఆధారమైన వస్తువులలో ప్రాణవాయువు తరువాత నీరు ముఖ్యమైనది. తినినమేతను బలుచన చేయుటకును, జీర్ణించిన ఆహారమును రక్తమునందు కలుపుటకును, పనికిమాలినపదార్థములను విసర్జించుటకును సహాయపడుట దీని ముఖ్యమైన పని. తరువాత లవణపదార్థము లత్యావసరములు. ఇవి జీర్ణసాధనములకు ముఖ్యమైనవి. ఆమ్లరసమందున్న లవణపదార్థ మిదియే ఇంకను సున్నపులవణములు కూడ కావలయును. ఈ లవణములు ఎముకలను వృద్ధిచేయును. ఇనుము కలిసియున్న లవణమువల్ల రక్తము ఎఱ్ఱబడును.

పశువు తినుమేత నోటిలో ప్రవేశించినంతలో అచ్చటికి ఉమ్మినీరు వచ్చి మేతను తడిపి పదనుజేయును. ఉమ్మినీటి గ్రంథులు పశువునోటియందు ప్రత్యేకించి యుండును. ఉమ్మినీటిని తయారుచేయుట వీనిపని. ఈ ఉమ్మినీరు ఆహారమును తడిజేయును. నమలిన ఆహారములో జిగురువలె నుండుటకు ఈ ఉమ్మినీరు ఉపయోగపడుచున్నది. మేతలో నున్న పిండిపదార్థములు చక్కెరగా మారవచ్చును. ఉమ్మినీటి గ్రంథులు పశువు నోటిలోనికి రానైయున్న ఆహారముతో మిళితమగుటకు సిద్ధముగా నుండవలాగున రక్తములో నుండి ఉమ్మినీటిని తయారుచేసి నాలుకయొక్క చివరభాగపు సమీపమునను౦డును. ఈనీరు తేమను కలుగజేయుచుండును. పశువు తిను మేత దినుసులను తననాలుకతో ఒడిసి పట్టుకొని మునిపండ్లచే త్రుం

చుకొనును. మేత నోటిలో ప్రవేశించినంతనే అచ్చటికి ఉమ్మి నీరు వచ్చి మేతను తడిపి పదను చేయును. అంతట పశువు నాలుక సహాయముచేత తననోటియందలి మేతను ప్రక్కపండ్లసందున త్రోసికొని నమలిమ్రింగును. అది అన్నవాహికగుండా పెద్దతిత్తితో జేరి యిమిడియుండి ఆతిత్తిలో నుండు నీటిచేతను, నీటిలోపలనుండు ఉమ్మిచేతను ద్రవమెక్కి నెమరువేయుచుండును, ఈ ఉమ్మిసహాయముచేత పిండిపదార్థములు చక్కెరపదార్థములుగా మార్చబడుచున్నవి. ఈపదార్థముల ఆహారము తక్కువగానున్నయెడల రక్తవ్యాపకము, శ్వాస, జీర్ణము యివి తాము చేయవలసిన పనులు చక్కగా చేయవు. ఇంకను ఈ పిండిపదార్థములు చక్కెరపదార్థములుగా మారి వెంటనే రక్తములో ప్రవేశించు చున్నవి. పశువు నెమరువేసిన మేత అరల పొట్టలలో జేరి నారగా నుండు పదార్థములు అరలమధ్య నిలిచియుండును. మృదువైనది నీటితో కలిసి నాలుగవతిత్తిలోనికి జేరుచున్నది. ఈతిత్తిలో నుత్పత్తియగు క్షారరసము యొక్క సహాయముచేత ఉమ్మినీటివలన జీర్ణింపగా మిగిలిన పిండి పదార్థములును, మాంసకృత్తులును, ఇంకను జీర్ణముకాని క్రొవ్వుపదార్థములును నాలుగవతిత్తిలోనుండి ఈ కోశము చివరయందుండు కంఠద్వారముగుండా మొదటిలోనికి ప్రవేశించుచున్నది. దేహమువల్ల ఉత్పత్తియైన పైత్యరసము మధుర వాహిక అనెడి అవయవముచేత ఉత్పత్తి చేయబడిన మధుర రసము రెండుగొట్టములగుండ మొదటి పేగులోనికి జారి అచ్చట చేరియుండు మాంసకృత్తులు, పిండి లవణపదార్థములు

రక్తములో చేరుచున్నవి. మిగిలిన పదార్థములు పేగులగుండ జారిపోవుచు అందుండెడి మంచి పదార్థములను తీసికొని రక్తములోనికి కొనిపోబడుచుండును, మిగిలిన పదార్థములను విడుచుచుండును.

---

# కండరములు

పశువు ఎముకచట్టముపై నుండు ఎరుపు మాంసపుముక్కలకు కండరము లని పేరు. కండరములలో రక్తము కలిసి యుండుటచేత ఎరుపురంగుగ నుండును. ఒక్కొక్క కండరము పలు సన్నని కండరపు పోగులచే అమర్చబడి యున్నది. ఇంకను బలమైన తెల్లని నరములచే ఎముకలతో జేర్చి కట్టబడి యున్నది. ఈ కండరములలో కొన్ని పొడుపుగాను, చిన్నవిగాను, కొన్ని దర్బముగాను, మరికొన్ని గుండ్రముగాను, కొన్ని తట్టగాను, మరికొన్ని పెద్దవిగాను నుండును. ఈ కండరములను మనము సూక్ష్మదర్శినితో చూచినచో వానిలోనుండు వస్తువులన్నియు వివరముగా తెలియును.

---

# కాలేయము.

ఇది పశువుడొక్కలో కుడివైపున నుండును. ఇది తెలుపువర్ణము కలిగియుండును. దీనిపైన కఠినమైన పొర కప్పుకొని యుండును. దీనియందు పైత్యరసము తయారగును. ఈ పైత్యరసము పసుపురంగుకలిగిన ఆకుపచ్చరంగుగా నుండును.



వా ంసకండరములు.



ఆహారకోశము.

ఇది పులువు పదార్థములకు వ్యతిరేకగుణములు కలిగియుండును. కాలేయము చేయుపని మరియొకటి గలదు. విషపదార్థములను పశువు మ్రింగునపుడు యిది కాపాడి అట్టిపదార్థములు రక్తములో చేరకుండ నాశనముచేయును. ఇది ముఖ్యముగా రక్తమును పరిశోధించి దానియందుండెడి విషమును పట్టుకొని రక్తమును విడిచిపెట్టుచుండును.

---

## ప్లీహము

దీనినే నెరడిగుండె యని చెప్పుదురు. ఇది కాలేయమునకంటె పలుచగ నునుపుగ నుండును. దీనిపైన బిగువైన తెల్లపొర గప్పబడియుండును. ఇది డొక్కలో ఎడమవైపున నుండును. ఇది మెత్తగానుండి స్పంజివంటి పదార్థముతో చేయబడియుండును. ఇది దొమ్మ పెద్దరోగము మొదలగు సంకటములు సంభవించినపుడు ఆవిషమువలన దేహమున కపాయము రానీయకుండ కాపాడును. ఈ కారణముచేతనే విషజాడ్యము సంభవించి చనిపోయిన పశువుప్లీహము ఉబ్బియుండును.

---

## ఊపిరితిత్తులు

ఇది పశువుకు కుడివైపున నొకటియు, ఎడమవైపునొకటియు పశువు ఎదలో నుండి పీకె రెండుగా చీలుచోటకలిసి ద్రవముతోకూడిన తెల్లనిపొర గ్రప్పుకొనియుండును. ఈతిత్తులతో

సన్ననివాయుగోళము లుండును పశువు పని చేయునపుడు ఉచ్ఛ్వాసనిశ్వాసము లతివేగముగా జరుగుచుండును. గాలి లోపలికి పోయినపుడు ఉబ్బును. వెలుపలికి వచ్చునపుడు తగ్గును. గాలి లోపలికి పీల్చుటను ఉచ్ఛ్వాసమనియు, బయటికి త్రోసివేయుటను నిశ్వాస మనియు చెప్పబడును.

---

## మూత్రపిండములు

ఇవి పశువు వెన్నుపూసలకును, త్రొంటియెముకలకును నడుమగా వెన్నెముకకు ఇరుప్రక్కలను చెరియొకటియు నుండును. అనగా కుడివైపున నొకటియు, ఎడమవైపున నొకటియు నుడును. ఇవి క్రొవ్వుతో గప్పబడి యుండుటచేత శీతబాధనుండియు, హానినుండియు కాపాడబడుచుండును.

---

## కొమ్ములు

భగవంతుడు పశువునకు ఆత్మరక్షణకై తలపైన కొమ్ముల సృష్టించియున్నాడు. కొమ్ముల మొనలు తేలె సన్నముగా నుండును. పైకి ఎత్తుకొని వంపుగలిగియుండును. రైతులు పశువుల కొమ్ముల విషయమై జాగ్రత్తగా నుండవలెను. అవి పోరాడునపుడు కొమ్ములకు పలువిధములైన అపాయములు కలుగుచుండును.

---

## వెండ్రుకలు

పశువు వెండ్రుకలు మిక్కిలి కుఱుచలు. కనుకనే ఈగలు మొదలగునవి వాని నెప్పుడును బాధించుచుండును. ఈ బాధ ఉష్ణకాలమందు వానికి మిక్కిలి అధికము. తొలకరి ఆరంభించగనే ఈగలబాధ యెక్కువగా నుండును. అందు కొరకై భగవంతుడు ప్రత్యేకముగా తోక యనునది సృష్టించి దానిచివర వెండ్రుక లమర్చియున్నాడు.

---

## చర్మము

జంతువులశరీరములమీది చర్మములకు తోళ్ళని పేరు. ఈచర్మము దేహములోపలి వస్తువులను కాపాడు ఒక సంచి వంటిది. మూతగ నుండుటయేగాక ఎండ వాన మొదలైన వానివలన లోపలి అవయవములకు హానికలుగకుండ కాపాడు ఒక కవచముగా నున్నది. ఇది రక్తములో నుండు పదార్థములను వెలుపలికి పంపివేయును. చర్మమునకు రబ్బరువలె సాగెడి శక్తి అధికముగా గలదు. ఇది పైకి నునుపుగ నుండును. భూతదర్పణముతో దానిని పరిశీలించిన దానిమీద ననేకములగు రంధ్రములు కనపడుచుండును. పశువుశరీరమునందు కలిగెడు మలినమును పైకి త్రోసివేయుటకు చెమట గొట్టములు చర్మమునందున్నవి. రక్తములోకలిగెడు మలినపదార్థములలో సగభాగము యీగొట్టములగుండ బైకిబోవును. మలమూత్రములు సరిగ పోకుండుట యెటుల హానికరమో, శరీర

ముపై మాలిన్యమేర్పడి చెమటను నిరోధించుటకూడ అటులే హానికరము. దుమ్ము మొదలగు వస్తువులు చర్మముపై నంటుకొని చెమటగొట్టములను మూసివేయుటవలన రక్తములోని మలము చెమటరూపమున పైకిపో వీలులేక లోపలనే యుండి వ్యాధులను కలిగించును. ఆరోగ్యమైన పశువుయొక్క చర్మము అతికఠినముగను, అతిమృదువుగను యుండక దృఢముగా నుండును. ఇంకను వెచ్చగను, కొంచెము తేమగలదిగను, నున్నగను, మెత్తగను ఉండును.

---

## పాదములు

పచ్చిగడ్డి సాధారణముగా నీటితేమగల పొలములలో పెరుగుచున్నది. పశువులు యిట్టిచోట్ల తిరిగి మేత మేయవలెను. కనుక వానిపాదములు భూమిలోపల దిగబడకుండ యుండవలయును. పాదము పెట్టినపుడెల్ల అది భూమిలో దిగబడుచుండునెడల దానికి ప్రియాసగా నుండును. పశువుపాదమునకు ఒక్కొక్కదానికి నాలుగు వ్రేళ్ళు గలవు. వెనుకభాగమందలి రెండును మిక్కిలి పొట్టివ్రేళ్ళు. ఇవి పశువు నడచునపుడు నేల తాకవు. చీలియున్నట్లు కనబడు వ్రేళ్ళు రెండును కొమ్ములవలె మిక్కిలి కఠినముగానుండు పదార్థములోపలనుండి రక్షింపబడుచున్నవి. ఈకొమ్ముపదార్థము లోపలనుండు వ్రేలునకు గిట్ట అనియు గొరిజ అనియు పేళ్లు.

---

## నెమరు వేయుట

పశువులు పచ్చిక మేయు చోట్లు సాధారణముగా పర్వతముల యొక్కయు, అరణ్యముల యొక్కయు సమీపప్రదేశములు. అట్టి ప్రదేశముల యందు పులి సింహము మొదలగు క్రూర జంతువులు తిరుగుచుండును కనుక పశువులు ఒక్కచోట నిలబడి సావకాశముగా ఆహారమును నమలి మ్రింగుటకు వీలులేదు. అవి బహుశీఘ్రముగా మేతమేసి తమ రక్షణస్థానములకు చేర వలయును. మనవలె దీర్ఘకాలము ఒక్కచోటనే యుండి మేయుచుండిన యెడల పెద్దపులి మొదలగు క్రూరమైన జంతువులు వానిని నోటవేసికొని పోవును. అట్టి అపాయము కలుగకుండునట్లు వానికి నాలుగు విధములైన జీర్ణకోశములు యేర్పడి యున్నవి. పశువు తనకు కావలసిన మేతనంతయు బాగుగ నమలకయే అతి త్వరితముగా మ్రింగివేయును. పిమ్మట భద్రముగా నుండు స్థానమునకు బోయి పండుకొనిగాని, నిలుచుండిగాని మొట్టమొదట మ్రింగినదానిని ఉండలుండలుగా నోటిలోనికి దెచ్చుకొని బాగుగా నమలి మరల మ్రింగుచుండును. దీనికే నెమరువేయుట యని పేరు.

---

## ఆరోగ్యము

ఆరోగ్యము పశుజాతికి ముఖ్యతమము. కాని చాలమంది రైతులు తమ పశువుల నెట్లారోగ్యస్థితియం దుంచవలెనో యెరుగజాలకున్నారు. మనదేశములో ఆరోగ్యముగానున్న

పశువులసంఖ్య చాల స్వల్పము. ఆరోగ్యము దైవమని కూడ నుడువ దగును. పశువు లారోగ్యముగా నుండుటకు - తినుటకు మంచి మేతయు, త్రాగుటకు మంచి నీరును, పీల్చుటకు శుభ్రమైన గాలియును లభించునటుల జేయుట మన కర్తవ్యము. ఈపశువులను జాగరూకతతో కాపాడుచున్న యెడల నెట్టి వ్యాధులును రాజాలవు. ఆహార విహారములందును పాటుబడు నప్పుడును పశువులను మిగుల జాగరూకతతో చూచుచుండ వలయును. పశువులను ఎండలోనుంచక తడవనీయక కాపాడు చుండవలెను. పశువునకు దేహారోగ్యమునకంటె అధికమైన శ్రేయస్సు లేదు. అట్టి ఆరోగ్యము లేకపోయినప్పుడు ఆపశువు యేమాత్రమును పనిచేయజాలదు. ఒకవేళ చేయగలిగినను ఆ పని పశువునకు మిక్కిలి శ్రమయనిపింపకపోదు. కాబట్టి ప్రతి రైతు తమ పశువులను ఆరోగ్యస్థితిలో నుంచుట ముఖ్య ధర్మముగ పరిగణించబడినది.

---

## ఆహారము

వివిధదేశములందు పశువుల కాహారముగ నుపయోగించు పదార్థములు వివిధములుగ నుండును. ఇట్టి పదార్థస్వభావము దేశముయొక్క శీతోష్ణస్థితిని బట్టియు, ఆయాపశువులు చేయు పనులనుబట్టియు మారుచుండును. దూడలుగానుండు వయస్సులో దేహముయొక్క సకలభాగములను వృద్ధిచేయుటకును, పశువు బ్రతికియున్నంతకాలము నిరంతరము భాగములను దిరిగి బాగుచేయుటకును, దేహవ్యాపారములకు సాధ

నముగ నుండుటకును ఆహార ముపయోగమై యున్నది. పశువులకు పెట్టు ఆహారపదార్థములలో జీర్ణముకాగల మాంసకర పదార్థము లెంతయెత్తున నున్నవో, ఉష్ణకరపదార్థము లెంతయెత్తున్నవో, క్రొవ్వుపదార్థము లెంతయెత్తున్నవో విచారింపవలెను. పశువులకు బెట్టు ఆహారపదార్థములలో యేయేపాళ్లు కలిపి పెట్టవలెనో తెలిసికొనుట ముఖ్యమైన పనియైయున్నది. ఆహారము విస్తారముగా దొరకు కాలమందును, వేసవికాలమందును, పశువులకు హెచ్చుతగ్గులులేక సమానముగా మేత మేపవలయును. ఆమేత సులభముగ జీర్ణమగునదిగను, సారవంత మగునదిగను ఉండవలయునుగాని నిస్సారమైనట్టియు బూజుపట్టి యున్నట్టియు తుక్కుగడ్డి ముక్కుగడ్డి మొదలగునవి మేపరాదు. వేసవికాలమందు సరియైన మేత దొరకకపోవుటచే క్షుద్బాధకు ఓర్వలేక విషవంతములైన ఆకలములు తిని పశువులు పలువిధములైన వ్యాధులకు లోనగును.

---

# వాయువు

పుట్టినది మొదలు చనిపోవువరకు మేలుకొన్నను, నిద్రబోవుచున్నను ఎడతెగక చేయుపని గాలిని పీల్చుటయే. కనుక పశుజాలము బ్రతుకుటకు వాయువే ప్రాణాధారము. గాలి మనకంటికెగపడదు. అది వీచునట్లు స్పర్శరూపమున తెలియును. సముద్రమంతయును నీటిమయమై యుండుటవలననే మనముండునట్టి భూమికూడ వాయువుచేత నావరింపబడి

యున్నది. ఇట్లు భూమియందంతంట వ్యాపించియున్న దట్టమైనగాలిఅడుగున సముద్రములో చేపలున్నట్లుగా మనమున్నాము. నీటినుండి వెలికి దీయగా చేపలు చచ్చునట్లు గాలినుండి మనలను జంతుజాలములను విడదీసినయెడల బ్రతుకజాలము. గాలి ప్రతి పశువునకు ముఖ్యాధారమని తెలిసికోవలెను. కొన్ని ప్రదేశములనుండి వెలువడు గాలి మంచిదిగను, మరికొన్ని ప్రదేశములనుండి వెలువడుగాలి చెడ్డదిగ నుండును. పశువులు శ్వాసకోశములలోనికి వాయువును బీల్చకుండ జీవించుటయే కష్టము. బహిర్వాయువునందు మూలభాగమగు ప్రాణవాయువు పశువుయొక్క జీవితాధారమైయున్నది. పశువుశరీరమందలి పోషణకును, ఉష్ణతకును, అనుకూలమగు గతులకును, చురుకుదనము బుట్టించుటకును, నరములకు సామాన్యముగా శరీరమునకంతకును బలము కలుగజేయుటకును, పరిశుభ్రతమమగు వాయువు అవసరమైయున్నది. వాయువు చలనము లేకపోవుటవలన చెడిపోవచ్చును. ఒకప్పుడు మురికితో గూడియుండును. విషయుతమై గూడ నుండవచ్చును. అపరిశుద్ధమైన గాలి బీల్చుటవలన ఈదేశమందు అనేక పశువులు మరణించుచున్నవని నిస్సంశయముగ జెప్పవచ్చును. శ్వాసకోశములలోనికి వాయువు నోటిద్వారమునను, నాసికాద్వారమునను, కొన్ని మధ్యమార్గములగుండా శ్వాసకోశముల లోనికి బోవును. బహిర్వాయువు నోటియందును, ముక్కునందును, ప్రవేశించిన పిమ్మట శ్వాసకోశముల లోనికి ముక్కుద్వారా పోవలయును గాని నోటిద్వారా పోగూడదు. ముక్కునందలి

యొముకలు ఒకవిధముగ నీవాయువునందలి మురికి పదార్థము లను వెలిజేయుటకు వీలుగ నేర్పడియున్నవి. ఇదియునుగాక నాసికారంధ్రములు విశేషముగ రక్తనాళములచే నావరింప బడి యుండుటచే చలికాలమునందు నీవాయువు శ్వాసకోశ మున లోనికి బోవుచుండర కొంత వెచ్చదనము గలిగియుండుట కుపయోగపడును.

---

## జ ల ము

ప్రపంచమునకు జలమే ప్రాణాధారము. లోకమునం దలి కొన్నిభాగములు ఎండి మాడిపోవు యెడారులైయున్నవి. వాటిలో ఇసుక మాత్రముండును. అవి గాలిమూరముగ సదా లేచుచుండును. అట్టి ప్రదేశమునకు మనమొక జల ప్రవాహము రానిచ్చితిమేని ఒక గొప్ప మార్పు త్వరలోనే కనబడును. నేలమీద పచ్చిక మొలచును. వృక్షాదులుకూడ మొలచును. పక్షులు చెట్లకొమ్మలమీద వ్రాలి గానము చేయును. మనుష్యులకును, మృగములకును, ఆహార మగు పడును. గనుకనే యుదకమునకు జీవనమను పేరువచ్చినది. పశువులు కల్మషోదకమును త్రాగుటచే ననేక రోగములపా లగుచున్నవి. యజమానులు కొంచెము శ్రద్ధ తీసికొనిన యెడల వానిని నివారింపవచ్చును. పశువుల కాహారముపెట్టక కొన్ని దినము లుంచవచ్చునుగాని నీటిని త్రాగించనిచో ఒక్క దినమైన నుంచలేము. అట్లుండుటకు కారణమేమి ? పశువు దేహములో విశేషభాగము జలమున్నది. ఒకపశువు అనేక

శేర్ల బరువు తూగుచున్నది. అందు జలమే ఎక్కువగా నుండును. ఆజలమంతయు పోగొట్టినయెడల దేహము చాల తక్కువగా తూగును. పశుదేహమునకు అనేకమైన సూక్ష్మనాళములు గలవు. వానిద్వారా భక్షిత ద్రవ్యసారము దేహమునం దంతటను వ్యాపించుచున్నది. గనుక పశువు అనుదినము తప్పక ఏదో ఒకవిధమైన యాహారమును భుజింపవలసియున్నది. ఇట్లు తినినమేత ఆయా జీర్ణకోశములందు జీర్ణమై, వాని ప్రక్కనుండు రక్తనాళములలో ప్రసరించి దేహమందంతటను ప్రవహించి శరీరమునందుండు అన్నిభాగములను పోషించును. ఇట్లు జీర్ణకోశములయందు జీర్ణమైన పదార్థములను దేహమునందన్నిభాగములకు రక్తముతీసికొనిపోయి చేర్చుచుండును. కాబట్టి ఇది సులభముగ బ్రవహించుటకు జలమువలె ద్రవమైయుండవలెను. కావున రక్తమునందెల్లప్పుడు కొంతజల ముండుటత్యవసరమై యున్నది. రక్తమునందు జలము తగ్గినయెడల మరికొంతజలముదానికి జేర్పవలయునని పశువునకు తెలుపుచున్నది. అందుచే మరల జలము త్రాగును. కావునఇవ్విధముగ జలముగై కొని దేహమందలి మలినమును స్వేదరూపముననుమూత్రరూపమునను తొలగించును. పశువుత్రాగు జలము పరిశుభ్రముగా నుండవలెను. నిర్మలముగా నుండనియెడలఆరోగ్యము చెడుటయేగాక అనేకవ్యాధులుపుట్టి మరణమునకు సిద్ధమగును. కాబట్టి రైతులు తమ పశువులకు మురికి, వాసన, రంగు, లేని నిర్మలమైన నీరు నొసంగి పశుసంతతిని వృద్ధిచేయుదురుగాక.

---

# శరీరపరిశ్రమ

పశువు తినునట్టి యాహారము పూర్తిగ నరుగుటకును రక్తాభిసరణము సరిగ నుండుటకును, వలసినంత పరిశ్రమ శరీరమున నుండవలెను. ఎద్దులను దున్నలను ఎల్లప్పుడు సోమరిగా నుంచి మేపరాదు. అది చాల పొరబాటు అవి కండ బట్టి బలిసి బండికట్టినపుడెల్ల వగర్చుచుండును. కాబట్టి రైతు సోదరులారా! మీపశువులకు తగినంతపరిశ్రమ నిచ్చుచుండిన యెడల అవి సురక్షితముగ నుండును. సాధారణముగ మన రైతులలో కొందరు మారకపుబేరగాండ్రుందురు. వీరు బలహీనమైన పశువులనుగాని, జబ్బుపశువులనుగాని, స్వల్పధరలకు తీసికొని మేపుదురు. ఆపశువులు త్వరగా బలము తేలునట్లు కొన్నిరకముల దాణాదినుసులువేసి దృష్టిదోషము తగులునను యుద్దేశ్యముతో యింట్లలోనుంచుదురు. వాటికి సరియైన దేహపరిశ్రమలేక తెల్లబారి కాంతిగలుగునట్లుండును. వాటిని రయితులు జూచి మిక్కిలి భ్రాంతి జెంది వెంటనే ఎంత ఖరీదైననుసరే యిచ్చి తీసికొనివచ్చెదరు. తరువాత బండికట్టుట గాని, నాగలిదున్నుటగాని తటస్థించును. అప్పుడు ఒకటి రెండు మాసములు బాగుగాపనిచేయును. తరువాత పశువునకు వగర్పు, వాతము మున్నగు రోగములు సంభవించుచుండును. అంతటనుంచి మరల పశుచికిత్సాలయములకు తీసికొనివచ్చి చికిత్సలు చేయించుచుందురు. ఈమాదిరిగనే పాడిపశువులలో గూడ నుండును. కాబట్టి రైతుసోదరులు చక్కగా గమనించి

మీపశువులకు తగినంత శరీర పరిశ్రమ కలుగునటుల జేయుదురు గాక!

## విశ్రాంతి

కష్టపడి పనిచేసిన పశువునకు విశ్రాంతి అవసరము విశ్రాంతివలన అలసటజెందిన అవయవములు తిరిగి బలముజెంది యథాప్రకారము పనిచేయుటకు దార్ఢ్యముగలవగును. ఎల్లప్పుడు యింటిదగ్గర సుకరముగా మేపు పశువునకు పరిశ్రమ ఎంత అవసరమో పాటుపడుపశువునకుకూడ విశ్రాంతి యంతయవసరము. శరీర మెట్లు విశ్రాంతిఁగోరునో పశువు జీర్ణకోశముగూడ అట్లే విశ్రాంతిఁగోరును. బండ్లకిరాయితోలు రైతులు పశువులకు విరామమీయక తమకిరాయి నపేక్షించి వానిని రాత్రింబవళ్ళు చంపుదురు. ఇటువంటి రైతులు చాలమూఢులని చెప్పవచ్చును.

## దేహమును శుభ్రముగా నుంచుట

ఉష్ణదేశములయందు స్వేద మెక్కువగనుండును. శీతలదేశమునందు ఊపిరిమూలమునను మూత్రముగుండను, విసర్జింపబడు కల్మషములు, ఉష్ణదేశములయందు శరీరస్వేదమునుండి బయటికిబోవును. కల్మషములు శరీరముమీద నిలిచియుండిన యెడల శరీరముయొక్క వ్యాపారమును గట్టిపెట్టును. మనదేశ

ములో రైతులందరు పశువుల దేహమును శుభ్రపరచరు. ఇది చాల పొరబాటు. దేహమునకు మడ్డిజేరుకొనును. ఈమడ్డి నిలువయుండుటవలన గజ్జి, తామర, పొడ, నుసిమిరి మున్నగు చర్మవ్యాధులు పుట్టును. పాటుపడు పశువులను, పాడిపశువులను శుభ్రముగా తోమి కడుగవలెను. అప్పుడప్పుడు గేదెలకు మంచినూనెగాని ఆముదముగాని, వ్యాసులైనుగాని రాచి స్నానము చేయించిన చాల ఆరోగ్యముగా నుండి పాలు బాగుగా యిచ్చును.

---

## జంతుకళేబరములగూర్చి కొన్ని విషయము

ఆహారముగ నుపయోగింప బడునపుడును, సాంక్రామిక వ్యాధులు మరణకారణము కానపుడును, చనిపోయిన జంతువులను తక్కిన సేంద్రియవ్యర్థపదార్థములవలెనే తొలగింపవలయును. సాంక్రామికవ్యాధులచే మృతినొందిన జంతువులను కాల్చివేయవలెను. లేక సున్నముగాని ఉప్పుగాని వేసి పాతరవేయవలెను. అప్పుడు వ్యాధికి కారణములగు సూక్ష్మజీవులు నశించును. చనిపోయిన పశువులను కొందరు పాతివేయుదురు, మరికొందరు ప్రవహించు కాలువలలోనికి విడిచెదరు. కాని మనుష్యులనువలెనే పశువులనుగూడ కాల్చుటయందెట్టి ఆక్షేపణయు లేదు. ఇందుకు ప్రత్యేకము బట్టీలుండును. వీనిలో కాల్చుట మంచిది. వ్యయభీతిచే శవమును బాగుగ కాల్చ

కుండుట గర్వ్యము. పాతివేయుటకూడ మంచి పద్ధతియే. గోతులుమాత్రము 10, 12 అడుగుల లోతునకు తక్కువగా నుండరాదు, చచ్చినజంతువులను పారవేయుశ్మశానములు కాపురముండుస్థలములకును, జలాశయములకును సాధ్యమైనంత యెక్కువ దూరముగ నుండవలెను. కళేబరములను నదులలో పారవేయుటయు, శిఖరములపై వదలివేయుటయు, దుర్గంధము లకు మూలకారణములగుటయేగాక అనేక రోగముల పాలగును.

---

## అంటువ్యాధులు.

హిందూదేశములో వ్యాప్తినొందియున్న వ్యాధులలో చాలవరకు అంటువ్యాధులే యైయున్నవి. ఈవ్యాధులు జీవాణువుల సంబంధములైనవి. ఇందుకుదాహరణములు—దొమ్మ, పెద్దరోగము, గురక మున్నగువ్యాధులు.

అంటువ్యాధులు రెండువిధములుగ నెంచవచ్చును. ఒకటి ఒకపశువునుండి మరియొకపశువునకు శరీరముయొక్క అస్వస్థతాభాగస్పర్శవలననేగాని మరియొక విధముగ వ్యాప్తి నొందదు. రెండవవిధమగునది వాయుమార్గమునగాని, జలమార్గమునగాని వ్యాప్తినొందును. అంటువ్యాధుల విషయములో తగుజాగ్రత్తలను బుచ్చుకొనుటవలన వ్యాధుల యొక్క వ్యాప్తిని తగ్గింపవచ్చును, వీటియొక్క ఉద్రిక్త లక్షణములుగూడ తగ్గింప జేయువచ్చును. కొన్ని అంటువ్యాధులయందు ప్రత్యేకములగు జీవాణువులు పశువు శరీరమునందు

ప్రవేశించి నంతనే తప్ప వ్యాధులు కలుగనేరవు. విషజ్వర మందు ఆజ్వర సంబంధమగు జీవాణువు రక్తమునందు ప్రవేశించిననే గాని ఆవిషజ్వరము కలుగనేరదు. ప్రతివ్యాధియును కొంత నియమితకాలము పశువు శరీరము నాశ్రయించి యుండును. ఈ నియమితకాలము అనేక కారణములనుబట్టి వ్యాధి గల పశువులయందు మార్పుండవచ్చును. వ్యాధిసంబంధమగు జీవాణువు శరీరమునందు ప్రవేశించిన తరువాత కొంతకాలము వరకు వ్యాధిలక్షణము లేవియు కనబడవు. ఈ మధ్యకాలమును వ్యాధిపరిపక్వకాల మని పేరిడవచ్చును. అనంతరము వ్యాధి లక్షణములు కనబడి వ్యాధియొక్క ఉద్రిత స్థితియందు మరణము సంభవింప వచ్చును. లేక వ్యాధియొక్క ఉద్రిత స్థితి గడచిన పిమ్మట వ్యాధి నివారణకావచ్చును. అంటువ్యాధి ఒక్కసారి సంభవించి నెమ్మదించిన తరువాత సామాన్యముగ మరల కొంతకాలమువరకు ఆవ్యాధి సంభవింపనేరదు. అంటు వ్యాధి సంభవించినపుడు దానిని సాధ్యమైనంత శీఘ్రముగ గుర్తెరింగి వ్యాప్తి జెందకుండునటుల తగు జాగ్రత్త బుచ్చుకొనవలెను.

---

## అంటువ్యాధుల నిలుపుటకు మార్గములు

ఒక గ్రామమునందు పశుజాడ్య మారంభమైనప్పుడు జాడ్యము తగిలినవాటిని ప్రత్యేకముగా నుంచి తగు చికిత్సలు చేయవలెను. అంటుజాడ్యము సోకినదని అనుమానింపదగిన

పశువును విడిగానే యుంచవలెను. రోగి వసించియున్న స్థలమునకు సంబంధించిన కొట్టపుగోడలు, నేల, గాబుతొట్టెలు మున్నగునవి శుభ్రపరచవలెను. రోగపశువులకు చికిత్సచేయువారలనుగాని, చచ్చినవాటిని కోయువారలనుగాని, అంటుసోకియుండు స్థలములలో తిరుగు కుక్కలనుగాని, కాకులనుగాని, మంచిపశువులున్న ప్రదేశములకు రానీయరాదు. పెద్దరోగము సంభవించిన వెంటనే మంచిపశువులకు టీకాలు వేయించుట మంచిది. ఇట్లు జేయుటవలన నీవ్యాధిని పారదోలవచ్చును. పశువు శరీరము శుభ్రముగా నుంచవలెను. ఆరోగ్యహితమగు మేతగాని, దాణాదినుసులుగాని పెట్టవలెను. పరిశుభ్రమగు నీటిని కాచి త్రాగించవలెను. పరిశుభ్రమగు గాలి వచ్చునట్టి కొట్టముల యందుంచవలెను. రోగపశువులు వేయు మలమూత్రాదులు కాల్చివేయుట మంచిది. అంటురోగము గ్రామమునందంతట వ్యాపించి యున్నపుడు చచ్చిన పశువులను కోయించక ప్రత్యేక స్థలమందు పూడ్చిపెట్టుట మంచిది. అంటువ్యాధి యేదైన ప్రవేశించినపుడు మామూలు అలవాటులయం దేవిధమగు మార్పులను జేయరాదు. పశువులకు అలసటగలిగించు పనులు చేయరాదు. చలిగాలి సోకనీయరాదు. రోగమునుండి తేలిన పశువులను కనీస మొక పక్షముదినములు వరకైనను విడిగానుంచి తరువాత పశుశరీరము శుభ్రముగా కడిగి మందలో కలుపవలెను. కొద్ది జబ్బులనైనను నిర్లక్ష్యము చేయగూడదు. తగినచికిత్సలుమాత్రము తప్పకుండ జేయవలెను. ఏదైనను వ్యాధియొక్క ప్రా

రంభమైననే తగు చికిత్సలు చేసిన యెడల శీఘ్రముగ కుదిరిక నొందగలదు. సూక్ష్మవ్యాధులయందు విశేషవిషయములలో విశ్రాంతియును, తగు ఆహారమార్పును, కుదిరికయును గలుగ జేయవలయును. శరీరము వ్యాధిసహితమైనప్పుడు పశువుతో పనిచేయించక క్రమక్రమముగా కండబట్టు పదార్థముల బెట్టుచుండవలయును.

---

## సూక్ష్మజీవులు దేహములో ప్రవేశించు మార్గము.

సూక్ష్మజీవులు పశువు దేహములోనికి ప్రవేశించువిధములనేకములు గలవు. పశుశరీరమునకు దెబ్బతగిలిన స్థలమునందుండినవి లోనికి ప్రవేశించును. గాలిలోగలసి పశువునోటిగుండపోవును. కొన్ని సూక్ష్మజీవులు తమకు నియమితమగు ద్వారములనే ప్రవేశించును. మరికొన్ని యిట్టివిచక్షణ లేకయే లోనికి రాగలవు. లోనికిబోయిన తరువాత ప్రవేశస్థానమునందు వాపును గలుగజేయుటవలనగాని రక్తనాళములయందు అడ్డుపడుటవలనగాని వ్యాధుల నుత్పాదనముచేయును. ప్రతి వ్యాధికి ఒకకారణభూతమగు నొకసూక్ష్మజీవి యుండును. కొన్ని వృక్షములు కొన్ని నేలలయందుమాత్రమే ఎట్లు పెరుగునో అటులనే కొన్నిసూక్ష్మజీవులు కొన్నిజాతిపశువులనే బాధించుటయు దేహమునందు ప్రవేశించినతరువాత కొన్ని అవయవములను బాధించుటయు తటస్థించుచుండును. వ్యాధులను కలుగజేయు సూక్ష్మజీవులు దేహమునకు వెలుపలకూడ నివసింపగలవు. దొమ్మవ్యాధి నుత్పత్తిజేయు సూక్ష్మదండిక తేమనేల

యందునను, కుళ్ళుచున్న సేంద్రియపదార్థములమీదను పెరుగును. సూక్ష్మజీవులు లోనికి ప్రవేశించినపుడు వానివలన గలుగు బాధలు వానిమొత్తమునుబట్టియు, దేహదార్ఢ్యమునుబట్టియు నుండును. గాయములు పుండ్లు మొదలగువానియందు చీము పుట్టించునవి యీసూక్ష్మజీవులే. అతివేగముగ లోతుగ దొలుచుకొని వ్యాపించు వ్రణములకు యీజీవులే మూలకారణము. పశువు శరీరమందలి రక్తకణములకును, ఈసూక్ష్మజీవులకును, యుద్ధముజరిగి ఆపోరాటములో నిరుపక్క సేనలును కొంతవరకు చచ్చును. అట్టి చచ్చినశవములును, కొన్ని బ్రతికియున్నకణములును, సూక్ష్మజీవులనుండి స్రవించువిషములచే కరగిపోవు శరీరభాగములును, రక్తమునుండి స్రవించు కొంతరసియును గలసి చీము యేర్పడుచున్నది. పాలు పెరుగు ఎక్కువకాలము నిలువజేసినప్పుడు పులిసి తుదకు మురిగిపోవునని మనమంతర మెరిగినదే. ఇట్టిమార్పులు సూక్ష్మజీవులవలన కలుగును.

## ఈగలు

ప్రపంచమందన్నిచోట్లను దిరుగు ఈగలే పశుకోటికి మిక్కిలి క్రూరమగు శత్రువులు. కందిరీగకున్నట్లు దీనికి కొండి లేదు. నల్లచీమకున్నట్లు పట్టుకొరువంటి కొట్లు నవయవములు లేవు. పురుగులనుబట్టుకొనుటకు సాలీడువలె నల్లికగూటినైన నది కట్టలేదు. దోమవలె నెత్తురు బీల్చుశక్తిలేదు. అయినను చిన్న పురుగు లన్నిటిలో నపరిశుద్ధమై, అసహ్యమై, నీచమై, క్రూరమై, హీనమై యుండునది ఈగయే. మిక్కిలి హీనజాతి

ప్రాణులలో మిక్కిలి నీచమగునది యీ ఈగయే. ఈగలు గ్రుడ్లనుంచి బుట్టుచున్నవి. మిక్కిలిమురికియైన స్థలమునందు తల్లి ఈగ గ్రుడ్లు పెట్టును. పశువుల కొట్టమందు ఈగలు యెంత తక్కువగ నున్న అంత ఆరోగ్యతావిశేషమునుజూపును. ఈగలులేకుండ నుండిన పరిపూర్ణారోగ్యత సూచించును. ఫిరంగిగుండుకన్న వ్యాధిహితము లగు జీవాణుగర్భితమగు ఈగ ఎక్కువఅపాయకరమైనది. ఈగ ఒకమాసములో 50625000 క్రొత్తఈగలను ఉత్పత్తిజేయును. ఈగలు పెద్దరోగము, దొమ్మ, క్షయ, పారుడు రోగము, మశూచి మున్నగు వ్యాధులను గొంపోయి వ్యాప్తత జెందజేయును. ఈగలు యెంత దూరము పోవునో కనుగొనుటకు గాను కేంబ్రిడ్జి వైద్యాలయమునందు 25000 ఈగలకు రసాయనశాస్త్ర సంబంధమగు రంగునువేసి వదలివేసిరి, వీటిని మరల బట్టుకొనుటకు గాను 50 పరీక్షాలయములను బెట్టిరి. వీటిలో 191 ఈగలను రెండు ఫర్లాంగుల దూరములో బట్టుకొనిరి. ఈఅంశమును బట్టి ఈగలు వాయుప్రచారమును బట్టియో, లేక వాటి కాకర్షణముగ నుండు ఆహారపు వాసననుబట్టియో కొంతవరకు ప్రయాణము చేయుచుండునని మనము గ్రహించవలెను.

---

## పశువుల కంటువ్యాధులు తగులకుండ టీకాలువేసి సంరక్షించుట.

పూర్వమువలె పశువుల కిప్పుడు మేత లభించుట లేదు. మనుజుల కాహారమున కెట్టి కలవుగలిగెనో అంతకన్నను.

నెక్కుడు కలిగు పశువులకు కలుగుచున్నది. పశుసంపదయే భారతవర్షమునకు నిజసంపదగనుండెను. ఆకాలమంతయు మారి పోయినది. మన పశువులకు జబ్బులనేకములు వచ్చుచుండుటయు అనేకపశువులు ఆకాలముననే చచ్చుటయు తటస్థించుచున్నది. గాలికుంటు వగైరాయంటువ్యాధులు వచ్చునపుడుగాని నామదుచేల మేసిన గొడ్లను రక్షించునపుడుగాని ప్రభుత్వవైద్యశాల లిసుమంతయైనలాభ కారిగ లేవు. "శాస్త్ర కాలమున వృద్ధినొందిన పశువైద్యము సూత్రకాలమున విశేషాభివృద్ధిజెందెను. మన ప్రజలందున్న రైతులు కొందరాశ్చర్యముగ సూత్రకాలమునాటి పద్ధతుల ననుసరించియే ఇప్పుడు నుచితముగ వైద్యము చేయుచున్నారు. అయినను వారికి శాస్త్రపరిచయ మంతగాలేక తాతముత్తాతలనాటి సాంప్రదాయానుసారము జ్ఞాపకశక్తి యున్నంతవరకు వైద్యము చేయుటయే సాధ్యమగుచున్నది. ప్రతిగ్రామమునందు అధమ మొక పశువైద్యుడు, చిన్న పశువైద్యశాల ప్రతి నాలుగైదు గ్రామములకు ఒక కేంద్ర పశువైద్యశాలనుండుట ఆకేంద్రపశువైద్యశాలయందు గాలికుంటువగైరా యంటుజాడ్యములచే పీడింపబడుచున్న పశుగణమునకుచోటిచ్చి రక్షించి అంటువ్యాధియితర భాగములకు వ్యాపకుండునట్లు చేయుటయు ప్రభుత్వధర్మము.

మందలు మందలుగా పశువు లొక్కసారి చనిపోవుట అంటువ్యాధులవలనయని రైతులందరెరుగుదురు. కాని వానిని మాన్పుసాధనము టీకాలు వేయుటయే. గవర్నమెంటువారీగొప్పవ్యాధిని టీకాలువేసి మాన్పివేయుచున్నారు. అంటు

వ్యాధు లొక్కొక్కటి ఒక్కొక్క జీవాణువు వలన కలుగు చున్నది. నల్లతెగులను అంటువ్యాధిని బుట్టించు సూక్ష్మజీవులు శరీరములో ప్రవేశించుట వలన గలుగును. శరీరములో ఈ జీవులు చేరనిపక్షమున ఆ వ్యాధి కలుగుట కవకాశము లేదు ఈ వ్యాధి సూక్ష్మజీవులు అతిసూక్ష్మతరములు. అవి అణుదర్శిని సహాయములేక దృగ్గోచరములు గావు. అణుదర్శినితో జూచిన అతిస్పష్టముగ కనబడును గాని విడిగా కన్పించవు. అట్టివి శాస్త్ర విజ్ఞానము చేత కనుగొనబడును. పశువుల ఆరోగ్యము వాని రక్తమును బట్టియుండును. ఒకప్పుడు వ్యాధి అంటినను అంటకున్నను మొత్తముమీద వ్యాధి రాకుండ కాపాడుకొనగల గుణము రక్తమునందే గలదు. ఒకసారి అంటుతెగులు తగిలి స్వస్థతపొందిన పశువునకు ఆ వ్యాధి రాదని మీకు తెలియును గదా? అంటువ్యాధులు తగులుటయనగా ఆ తెగుళ్ళ కనువగు జీవాణువులు పుట్టుట. అవిపుట్టి శతసహస్రములుగా క్షణికకాలములో కోట్లకొలది వృద్ధిజెంది జంతునాళములలో నుండు రక్తములోనికి వ్యాధిని రానీయకుండ కాపాడదగు శక్తిని క్షీణింప జేయును. ఆవ్యాధి నెమ్మదించవలెననిన అట్టిజీవాణువుల రక్తమందు వృద్ధియగుకొలది అంటువ్యాధి యొక్క జీవాణువులు రూపుమాసిపోవలయుననిన పశువురక్త మొకగ్లాసులోపోసి రెండుగడియలసేపు నీడలోపెట్టినయెడల ఆరక్తమునుండి పసువర్ణముగల ద్రవమేర్పడి క్రమముగా రక్తముపైన తేరియుండును. రక్తమందలి ఈ పచ్చని పదార్థమే అంటువ్యాధులను నిర్మూలించు సామర్థ్యము కలది. ఈద్రవ

మును ముక్తిసార్ అను ప్రదేశముననున్న గవర్నమెంటు ఔషధశాలలో అనుభవజ్ఞులగు శాస్త్రజ్ఞులవలన తయారుచేయబడుచున్నది. అంటువ్యాధులచే బాగుగా లేచి తిరుగుచున్న మంచి యెద్దులనుండి ఈద్రవము తీయబడుచున్నది. ఈద్రవము కొంచెము శరీరములోని కెక్కించిన అంటువ్యాధులను దరికి రానీయనంత బలము కలిగియుండును. ఏఅంటువ్యాధికైనను ఈ టీకాలు వేయుట మిక్కిలి ప్రయోజనకారి యనియును, నిరుపద్రవకరమనియు రైతులు తెలిసికొనవలయును. దొమ్మ యను రోగము ఒకవిధమగు సూక్ష్మజీవులచే కలుగుచున్నది. సూక్ష్మజీవులు జంతువురక్తములో నుండును. సూక్ష్మదర్శిని యను యంత్రముతో మనము పరిశీలించిన స్పష్టముగా తెలియును. ఈ వ్యాధికి సంబధించిన పశువుయొక్క కొన్ని రక్తపు చుక్కలను తీసికొనివచ్చి ఆరోగ్యముగా నుండు పశువుల చర్మములోనికి యెక్కించిన యెడల రెండు మూడుదినములలో వానికి తప్పక చావు సంభవించును. ప్యాస్టియర్ దొరగారు, చెంబరుల్యాండుదొరగారు, రౌక్సుదొరగారు వీరు ముగ్గురును ఈవ్యాధి పటుత్వము తగ్గించి వారికి యిష్టమువచ్చిన నానాసారములుగల రసములను సృష్టిచేయగలిగిరి. ఈటీకాల రసము ఇప్పుడిప్పుడే యెక్కువగా వాడుచున్నారు. ఈటీకాలు వేయుటవలన చాలభాగము వ్యాధులు నెమ్మదించుచున్నవి. టీకాలు వేసిన మొదటిదినము పశువునకు కొంత జ్వరము వచ్చును, తరువాత 15 దినములకు మరల టీకాల రస మెక్కించవలెను.

---

## ప్రస్తుత వైద్యస్థితి.

పూర్వము పశువైద్యములో ప్రసిద్ధిచెందిన మహాపురుషులలో ననేకమంది గలరు. ఆ కాలములోగూడ ఆంగ్లేయ వైద్యముకంటె ఆయుర్వేదవైద్యమే చాల వృద్ధిజెంది యున్నట్లు మన శాస్త్రములు తెల్పుచున్నవి. అప్పుడు పలువిధములైన వనమూలికలు, వానినామములు సవిస్తరముగ తెలిసియుండెడివి. కాని ఇప్పుడా వైద్యము నశించి ఆంగ్లేయవైద్యము మాత్రము బాగుగా వ్యాపించుచున్నది. ఇప్పుడిప్పుడే మద్రాసు గవర్నమెంటువారు మాత్రము అక్కడక్కడ కొన్ని వెటర్నరీఆస్పత్రిలు పెట్టించి ఆంగ్లేయ పశువైద్యమును వ్యాపింపజేయుచున్నారు. పల్లెటూళ్ళలో కొంతమంది పశువైద్యులున్నారు. వీరికి శాస్త్రజ్ఞాన మంతగా లేకపోయినను స్వానుభవముతో మాత్రము పశువైద్యము చేయుచున్నారు. వెటర్నరీడాక్టరుగారు కావలెనసిన గ్రామములో సాధారణముగా దొరకుట కష్టము. వారికొరకు ప్రత్యేకముగా ఫీజులిచ్చి తాలూకా కేగి వారిని తీసుకొనివచ్చి చికిత్సలు చేయించుకొనవలయును. ఈప్రకారముగా పశువైద్యము దుస్థితిలో నుండుట చాల విచారకరము.

---

## శాస్త్రయుక్తముగ వైద్యము నేర్చుకొనుట అవసరము.

ఏశాస్త్రమైనను నాలుగైదు సంవత్సరములు చదువనిది జ్ఞానము కలుగదు. కాని అనేకగ్రామములవారు మాపశుచికిత్సాలయమునకు వచ్చి పశువైద్యశాస్త్రము నేర్చుకొనవలెనని

కుతూహలపడుచున్నారు. కాని వీరు కోరినటుల పశుశాస్త్రము, వైద్యము మూడునాల్గుమాసములలో నేర్పుట చాలదుర్లభము. సాధారణముగ కనీసము వీరు మూడుసంవత్సరములైనను శాస్త్రయుక్తముగ వైద్యము నేర్చుకొనుటకు వీలగునుగాని కొలది మాసములలో నేర్చుకొనుట యనునది అసాధ్యము.

---

## ఆంగ్లాయుర్వేద శాస్త్రముల భేదములు.

ఆయుర్వేద పశుశాస్త్రమునుబట్టి కొంతవరకు జ్ఞానము సంపాదించినవారికి ఆంగ్లేయవైద్యపద్ధతులుకూడ కొన్ని తెలిసియున్న ఉపయోగకరముగ నుండును. కొంతమంది పూర్వాచారపరాయణులు యేనాడో చెప్పబడిన ఔషధప్రయోగములందే విశ్వాసముంచి పనిచేయుదురు. నూతనవిధానములెంతప్రయోజనకరములైనప్పటికిని దరిజేరనీయరు. ఇది వారి మాధ్యము. ఇంకను వారిలో కొందరు తమ శాస్త్రమే ప్రపంచములోనున్న అన్నిశాస్త్రములకంటెను మించినదని ఏదోవిధముగ ఋజువుపరచుటకుగాను ప్రయత్నించుచుందురు. ఇటువంటి అభిమానము కొంతవర కుండవలసినదేగాని మంచిచెడ్డలను యోజించక తాపట్టినకుందేటికి మూడుకాళ్ళే యనువారికి క్రొత్తవిషయములను బోధించుట చాలకష్టము. నిండుకుండ తొణకదుగాని శాస్త్రజ్ఞానములేని పశువైద్యులు తదితరులకంటె గంభీరవాక్యములు పలుకుచు అన్నివ్యాధులు తామే కుదుర్చగలమని చెప్పుచుందురు. కాని కొందరు పశువైద్యులు కూరగాయ వైద్యములుచేసి పశువులపాలిటి రాక్షసులై చంపు

చున్నారు. మరికొందరు వెటర్నరీవారికంటెను అమోఘమైన పశుసేవ చేయుచుందుమని విజ్ఞప్తిగుచు తదితరులను దూషించుచుందురు. ఇటువంటి తెలిసితెలియని పశువైద్యులవలన కలుగు మేలుకంటె కీడే యధికమగును.

---

## వైద్యమునందు నిరంతరము గలుగుచుండు మార్పులు.

మన దేశమునందు కాలపరిస్థితులనుబట్టి రోగములుకూడ పలువిధములుగా మారుచున్నవనుటలో నతిశయోక్తి లేదు. ఇప్పుడు మనము చేయుచున్న పశువైద్యపద్ధతియంతయు మూడునాలుగుసంవత్సరములలో మారి యొకనూతనరూపమును ధరింపవచ్చును. పూర్వము పెద్దరోగమను వ్యాధి మనగ్రామములో వ్యాపించియున్నప్పుడు జెముడుపాలటీకాలు వేసియు, జొన్నకలి- మజ్జిగకూడా మున్నగునవి బెట్టియు ఆరోగములను నిర్మూలనము జేసెడివారు. ఇప్పటి కాలపరిస్థితులను బట్టి ఈ రోగవిధానమంతయు మారి క్రొత్తరూపములుగా దేశమంతటను వ్యాపించి రైతుల నాందోళనపరచుచున్నది. కాబట్టి కాలపరిస్థితుల ననుసరించి వ్యాధులుగూడ మార్పు చెందునని ముఖ్యముగా గ్రహించవలెను.

---

## ఆంగ్లాయుర్వేదౌషధముల గుణములు.

ఆయుర్వేదౌషధములలో మిక్కిలి పరమోత్కృష్టమైన వస్తువు లనేకము లున్నవి. మిక్కిలి ప్రయోజనకరమైన

వస్తువులు అతివిశేషముగా హిమాలయ ప్రాంతములందు దొరకును. పూర్వమునుండియు ఆయుర్వేదౌషధములే మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. కాని వాటియొక్క మహిమను గ్రహించి ఆచరణలో పెట్టు పశువైద్యులు చాల తక్కువగా నున్నారు. ఎటువంటి బీదరైతైనను తనపశువున కేవ్యాధియైన సంభవించినప్పుడు కొంతపైకమును తీసికొని బజారునకు వెళ్ళి వస్తువులు తీసికొని రావలసిన గతి పట్టినది. పూర్వ మెచ్చోట జూచినను వనమూలికలు దొరికెడివి. ఏవ్యాధి కేయేచికిత్సలు చేయవలెనో ఆవస్తువులనుసంపాదించి చికిత్సలు చేయుచుండెడివారు. ఆకుపసరులలో గూడ అనేకసుగుణము లున్నవి. ఆంగ్లేయౌషధములకంటె ఈపసరులలో మంచిగుణములు గలవు. కాని ఆంగ్లేయ వైద్యశాస్త్రపారీణులకుగూడ వనమూలికలు మంచి పనిచేయునని నమ్మకము కలదుగాని వాటి నేయేవిధముగ నుపయోగించవలయునో తెలియకపోవుటచే వారంతగా సమ్మతించుటలేదు. పశువైద్యము జేయు ఆంగ్లవైద్యులను ఆయుర్వేదవైద్యసలహా లడిగిన మా కంతగా తెలియ వందురు. కాబట్టి ఆంగ్లాయుర్వేదౌషధముల గుణముల రెండిటిని తప్పక గ్రహించవలెను. దేశ కాలానుగుణ్యముగ నిప్పటి పరిస్థితులనుబట్టి ఆంగ్లేయౌషధములే ప్రచారములోనికి వచ్చుచున్నవి. ఈ యౌషధగుణము లెల్లరికి తెలియుట దుర్లభము. ఔషధగుణములు కనిపెట్టుట కైనను కొన్ని వైద్యశాల లుండవలెను. ఆశాలలలో సుప్రసిద్ధమైన పండితుల నుంచి కొన్ని గ్రంథములను వ్రాయించి యెల్లరకు తెలియజేయవలెను. అశోకచక్ర

వర్తి రాజ్యము చేయునప్పుడు రాజ్యమునందెల్లెడల చికిత్సాలయముల నెలకొల్పి పశువైద్యమును వృద్ధిలోకి తీసికొనివచ్చెనని పూర్వచరిత్రలు తెలుపుచున్నవి.

---

## ఆయుర్వేద పశువైద్యులు.

పూర్వకాలమందు ఆకలములు తినుచు విరాగులై సంచరించు గోసాయిలు సాధారణముగా తమసహజవృత్తులచే జీవించుచు వైద్యముచేయుట యొక గౌరవముగ నెంచుకొను చుండెడివారు. వారికి వైద్య శాస్త్రాభ్యాసము ప్రధానవృత్తి కాకపోవుటచేత దానియందు వారికి అభిరుచి తరతరములనుండి తగ్గుచూ వచ్చినది. తెలిసి తెలియని పశువైద్యు లనేకమంది యెల్లెడల నున్నారుగాని వ్యాధినిర్ణయము తెలియక పశువులను చంపుచున్నారు. ఈపశువైద్యు లెక్కువగా మోటువైద్యము చేయుదురు. వారికి శాస్త్రజ్ఞాన మంతగా తెలియదు. పశువున కే వ్యాధి సంభవించినను ముందు కారపుపాలు, సారాయి వాడుదురు. అప్పటికిని తగ్గనిచో యమకింకరులవలె పశువు శరీరమునంతయు కాల్చుదురు. మనదేశములో నక్కడక్కడ మిక్కిలి తెలివిగలపశువైద్యులున్నారుగాని వారు తదితరులకుమాత్రము నేర్పరు. ఏపశువునకైన వ్యాధి సంభవించినప్పుడు తాము స్వయముగ నెవరికిని తెలియకుండ నేయౌషధరో తెచ్చి పోయుదురు. ఈవైద్యులు తమగుట్టును బయటపెట్టక వైద్యమును నాశనము జేయుచున్నారు. కొందరువైద్యులు రోగ

నిదానము గ్రహించక తమయిష్టమువచ్చిన మందుల నుపయోగించి పశువులను చంపుచున్నారు. కాబట్టి శాస్త్రజ్ఞానము కలిగి అనుభవముతో చికిత్సలుచేయు వైద్యుడే ఆయుర్వేదపశువైద్యు డనిపించుకొనును.

---

## వైద్యులవలన యుపద్రవములు.

శాస్త్రము తెలియని వైద్యుడు యమదూత యని పెద్దలు చెప్పిన వాక్యమందు చాల నిజముగలదు. నాలుగైదువందల రూపాయల ఖరీదు చేయగల ఎద్దునకు యేవిష జాడ్యమైన సంభవించినప్పుడు ఆరైతుపడు ఆతురత ఇంతింతయని చెప్పుటకు నలవిగాదు. కాని పశువైద్యము తెలిసినవైద్యులు గ్రామములలో చాల తక్కువగ నుందురు. వీరిలో కొందరికి వైద్యము సరిగా తెలియదు. రైతునకు గతిలేక ఆవైద్యులనే రప్పించి చికిత్సలు చేయించుచుందురు. ఇది చాల పొరబాటు. రైతులు తమ మూఢవిశ్వాసముచేతను, వేరొకవైద్యుడు సమయమునకు దొరకకపోవుటచేతను ఆపత్కాలమందు రాబోవు అసందర్భములను తెలిసికొనక కనబడిన ప్రతియాకుపసరును, వనమూలికలను వ్యాధిసంభవించిన పశువులకు పెట్టుటచే వెంటనే ఆపశువు తన ప్రాణములను కోల్పోవుచున్నది. ఇంకనుకొందరు మోతాదుల నిర్ణయములు తెలియక విషవస్తువుల నిచ్చెదరు. మరికొందరు తెలిసి తెలియని చికిత్సలుచేసి పశువులను చంపుదురు. కాబట్టి పశువైద్యుడనగా పశు శరీరశాస్త్రము, పశువైద్య వస్తుగుణదీపిక, పశువైద్య చింతామణి మున్నగు

సద్గ్రంథముల చదివి అనుభవముతో చికిత్సలు చేసి ప్రచారము చేయు వైద్యుడే గొప్పవాడని నా యభిప్రాయము. మన రైతులు తమ పశువునకు జబ్బు రాగానే వెంటనే పోవలెనని గ్రామము లోనున్న పూర్వులను, వైద్యులను రప్పించి చికిత్సలు చేయు చుందురు. ఇది చాల పొరబాటు. ఏ వైద్యునితో చికిత్సలు మీరు చేయించుదురో ఆయనతోనే చికిత్స ఆఖరవరకు చేయించవలెనుగాని మఱియొకరితో చేయించరాదు. ఇంతియే గాకుండ భూతవైద్యులను రప్పించెదరు. వీరు విభూతిమంత్రించి యిచ్చెదరు, మరికొందరు దురాయి కట్టించెదరు. కొందరు మంత్రములను పెట్టించెదరు. కాని పశువైద్యులలో యిటువంటి వారు పూర్వకాలమునందుండెడివారనిన నమ్మవచ్చునుగాని, ఇప్పటి కాలపరిస్థితుల ననుసరించి నమ్ముటకు వీలుగాకున్నది. రైతులు సామాన్యముగా వైద్యులయొక్క హస్తవాసినిబట్టి రోగములు నెమ్మదించునని ఒక వాడుకగలదు. ఇదెంతవరకు నిజమో తెలియదు. ఏవోకొన్ని కఠినవ్యాధులు తప్ప సామాన్యముగా నే వ్యాధియైనను దాని యంతట వదియే కుదురును.

---

## వ్యాధి నిదానము.

పశువునకు యేరోగమైన సంభవించిన యెడల ఆరోగ నిదానము జాగ్రత్తగా పరిశీలించవలయునుగాని తెలిసి తెలియని చికిత్సలుమాత్రము చేయరాదు. పశువులు నోరులేని జంతువులు గాన మనుష్యులే బాగుగా వాటిని పరీక్షించి తగిన సదుపాయములు చేయవలెను. కొందఱు వైద్యులు "దొమ్మరో

గము" తగిలిన "కురమరోగ" మనియు, "కురమరోగము" తగిలిన "దొమ్మరోగ" మనియు చెప్పి చేతగాని చికిత్సలు చేయుచుందురు. కాబట్టి పశువైద్యులు తగినంత శాస్త్రము చదివి చాల అనుభవముతో చికిత్సలు చేయవలెనుగాని వైద్యమంత నాకే తెలియు నను గర్వముతో తెలిసి తెలియని మందులు పోసి పశువులను మాత్రము చంపరాదు. అట్లు చంపిన నీకేగాక నీకుటుంబమునకుగూడ మహాపాతకము చుట్టుకొనును. వ్యాధియొక్క గుణములు తెలిసిన తరువాత చికిత్సలు చేయుట సులభము. ఇంతియేగాక కొందరు పశువైద్యులు పశువైద్య గ్రంథములను చదివి రోగనిదానము తెలిసికొనకుండ పుస్తకములోనున్న చికిత్సలే చేయుదురు. ఇదియునుగూడ చాల పొరబాటు. ఎన్నిపుస్తకములు చదివినను, అనుభవములేని వైద్యము చేయరాదు. కాబట్టి ఈ పశువైద్య వస్తుగుణదీపిక, పశువైద్య చింతామణి జదివి ఏయౌషధము లే యేవ్యాధుల కుపయోగించునో తెలిసికొనిన వారు అంటితో తృప్తినొందక విశేష పరిశ్రమచేతను, అనుభవముచేతను, మాత్రము సంపాదింప శక్యమగు వ్యాధినిదానాదివిషయములను తెలిసికొనుటకు నిరంతరకృషి చేయుదురనియు, యేదోయొక వ్యాధిని అదృష్టవశమున కుదర్చకలిగినంత మాత్రమున తన కంతయు తెలియు నని గర్వపడరనియును నమ్ముచున్నాను.

---

## వ్యాధియొక్క నడకను గుర్తించుట.

నోరులేనిపశువు వ్యాధియొక్క ముందునడకను గుర్తించుటకు మిగుల అనుభవమును మంచి బుద్ధికుశలతయును గావలయును. వ్యాధియొక్క ముందునడకను సరిగా చెప్పగలుగుటకు వ్యాధియొక్క సహజగమనమును జక్కగా దెలిసినవాడై ఆరోగ్యముయొక్క సహజతత్వమును యెరిగినవాడై తానుపయోగించు ఓషధులయొక్క గుణములను, శక్తులను గ్రహించుటయందు మిగుల అనుభవముగలవాడునై యుండవలయును. వ్యాధియొక్క ముందునడకను గూర్చి వైద్యుడు తనంతట తాను పశువుయొక్క యజమానునికి చెప్పరాదు. ఎవరైన అడిగినయెడల స్పష్టముగా తెలిసియున్నసంగతిమాత్రము చెప్పవచ్చును. అనుమానముగానున్న సంగతి చెప్పుటయందు బహుజాగ్రత్తగా నుండవలయును. వైద్యులు చెప్పుసంగతులు సాధ్యమైనంత వరకు ఆశనుపయోగించునవిగా నుండవలెను. స్పష్టముగా పశువునకు మరణము సంభవించు స్థితియందు వైద్యుడు తానెరిగినసంగతినంతయు స్పష్టముగా యజమానునకు చెప్పవలెను.

---

## ఋతువులనుబట్టి రోగములు.

వర్షాకాలపు గాలిపాటుటచేత జలుబు రోగములును, శీతాకాలపు గాలిపాటుచేత పైత్యవాత రోగములును, వేసవికాలపు గాలిపాటుచేత కాకరోగములును, వడగాడ్పులచేత రక్తవాత కాక రోగములును పశువులకు సంభవించుచుండును.

---

## ఆరోగ్య నిర్వచనము.

పశువు ఆరోగ్యదశయం దుండునపుడు గుంపులో కలసి మెలసి యున్నపుడు మేతమేయుకాల మెరిగి నెమరువేయుచుండును. చెవులు మాటిమాటికి ఆడించుచుండును. ముక్కుమూతి చెమ్మగలిగియుండును. కన్నులు నిర్మలముగ, కాంతిగ నుండును. చర్మము మృదువుగ నుండును. వెండ్రుకలు చర్మముమీద వాలియుండును. పశువు నోరదాని నోరటి నాకికొనుచు కాలోచితముగ పేడవేయును. ధారాళముగా మూత్రము పోయును. సర్వాంగములయందు వేడిగాని, కుంటుగాని లేకుండును.

---

## అనారోగ్య నిర్వచనము.

పశువు మందవిడిచి దూరముగాపోయి నల్లకప్పువేయును. కొమ్ములు వెచ్చగను, మూతి చెమ్మలేక వెచ్చగానునుండి నీరుడు పసుపురంగువలె కొంచెముగా పోయుచు కొంచెముపేడ గట్టిగావేసి మేతమాని మిక్కిలి దాహముగొనియుండును.

---

## నేత్ర పరీక్ష.

పశువునేత్రములో తెలుపు రంగుమీద పసుపురంగు కన్పించినయెడల కామెరోగ గుణలక్షణమని తెలిసికొనవలెను.

---

## నాలుక పరీక్ష.

పశువునాలుక యెత్తి పరీక్షించినయెడల నాలుకక్రింద నరములు లావుపారి యున్నయెడల వాతరోగ లక్షణమనిన్నీ,

ఆనరములకు ఆకుపచ్చరంగు కలిగి యున్నయెడల కాకరోగ లక్షణమనిన్నీ తెలిసికోవలెను.

---

## నోటి పరీక్ష.

నోరు దుర్వాసన కొట్టుచున్నయెడల వాతరోగలక్ష ణమనిన్నీ, పెదవుల లోపలిభాగము తెలుపురంగు, పెదవుల నరములకు ఆకుపచ్చరంగు కలిగి యున్నయెడల వాతరోగ లక్షణ మనిన్నీ తెలిసికోవలెను.

---

## చెవుల పరీక్ష.

పశువు చెవులను గుప్పిళ్ళతోపట్టి పరీక్షించినయెడల ఆ గుప్పిళ్ళ మొదటియందుమాత్రము వేడిగానున్నయెడల వాతరో గలక్షణమనిన్నీ, చెవులంతటను దేహాము సగభాగమున్ను వేడిగ నున్నచో పైత్య కాక రోగలక్షణమనిన్నీ గ్రహిం చవలెను.

---

## వెన్నెముక పరీక్ష.

పశువునడుముమీాద చేయిఆనించి చూచినయెడల అక్కడ తడిగానున్నయెడల వాతపైత్యరోగలక్షణ మనిన్నీ, నడుమంతయు చల్లబడియున్నయెడల జలుబురోగలక్షణమనిన్నీ గ్రహించవలెను.

---

## మూత్ర పరీక్ష.

పశువు మూత్రము కొంచెము చిక్కగ, పసుపువర్ణముగ నుండినయెడల కాకరోగలక్షణమనిన్నీ, తెలుపు ధాతువుగా నుండెనేని జలుబులక్షణమనిన్నీ, ముందుగా రక్తపునీరుడు పోసి తరువాత మామూలుమూత్రము పోసిన తాపగుణలక్షణమని న్నీ తెలిసికొనవలెను.

---

## మల పరీక్ష.

పశువు మేత బాగుగాదినుచు, నీరు బాగుగాత్రాగుచు మలమునళ్ళు వదలివేయుచుండిన యెడల కాకరోగలక్షణమనిన్నీ ఆమలము చెడువాసన వేయుచున్నయెడల వాతరోగలక్షణమ నిన్నీ తెలిసికొనవలెను.

---

## ధాతు పరీక్ష.

సుఖముగానుండు పశువులకు ఒకనిమిషమునకు 40 మొదలు 50 వరకు ధాతువు ఆడుచుండును. హెచ్చుతగ్గులుగ నున్నయెడల ఆజంతువు జబ్బుపడిన దని తెలిసికొనవలెను.

---

## ధర్మామీటరు.

పశువుయొక్క ఉష్ణోగ్రతను (జ్వరము) పరీక్షించుదానికి ధర్మామీటరందురు. ఉష్ణతాపమాపక యంత్రమనియు నందురు. ఉష్ణతాపక మనగా వాయువుయొక్కయు, జలము రక్తము మున్నగు ద్రవ్యములయొక్కయు, ఉష్ణోగ్రతను పరీక్షించుట,

ఉష్ణముయొక్క ముఖ్యధర్మము విస్తరించుట. శీతలముయొక్క ముఖ్యధర్మము ముడుచుకొనుట. ధర్మామీటరుయొక్క క్రింది భాగమున నుబ్బుగా ఉండవలె నందుదానిలో పాదరసమును పోసి గొట్టములోని గాలినంతయు దీసివేసి పై భాగమున సెగజూపి మూసివేయుదురు. ఆ గాజుగొట్టముపొడుగు వరుస శీతోష్ణపరిమాణము అంశములు డిగ్రీలుగ విభజించెడు సంకేలను గీసెదరు. ఈ ధర్మామీటరుపైన కచ్చితమైన కొలతలను వీలగునట్లు అంకెలవరుస 90 నుంచి 110 వరకు విస్తరించి పది పది భాగములుగా విభజింపబడి యుండును ప్రతి రయితు దగ్గర నీ ధర్మామీట రుండుటగత్యము. దీని మొదటి భాగమును పశువు ఆసనములోగాని, ఎదరాల లోగాని పెట్టి పరీక్షించవచ్చును. దిని నుపయోగించు పశువుల డాక్టర్లు చాల జాగ్రత్తగా పశువు ఆసనములో పెట్టవలెను. లేనిచో అది తన్నును లేక పోడుచును. ఒక్కొక్కసమయము ములో పుల్లకూడ విరిగిపోవును. ఆరోగ్యస్థితిలో పశువు శరీరముయొక్క వేడిమి 100 డిగ్రీలుండును. అంత కేమాత్రి మెక్కువగ నున్నను పశువునకు జబ్బుచేసినదని గ్రహించవలెను. పశువునకు జ్వరము సామాన్యముగా నున్నచో సామాన్య ఉష్ణము 100 డిగ్రీలకుపైగా పాదరసము ప్రవహించును. సామాన్యగుర్తుకు అనగా 100 డిగ్రీలకు తక్కువగా పాదరసము దిగినయెడల పశువు నిస్త్రాణస్థితిలో నున్నదని గ్రహించి వెంటనే వేడిచేయుటకు మందు లుపయోగించవలెను. పశువుయొక్క ఉష్ణము కొలిచినతరువాత ధర్మామీ

టరు క్రిందివైపునకు జాడించి దానిలోని షాదరసమును సామా
న్యపుగురుతుకంటె క్రిందికి దింపి వేడినీటితోగాని తదితర లోష
న్సుతోగాని కడిగి శుద్ధిచేసికొనవలెను.

---

## పశువైద్య పరికరములు.

ఔన్సుగ్లాసు, డ్రాముగ్లాసు, గాజుకల్వము, పింగాణికల్వము, పౌడర్లుకలుపురాయి, చూర్ణములు చేసికొనుటకు కత్తి, థర్మామీటరు, త్రాసు, నిక్కెల్ వెండిపిచ్చికారి, ఎనీమాకాక్ రబ్బరుట్యూబుతోసహా, స్టెతెస్కోప్ (గుండెలను పరీక్షించునది) డ్రాపుబాటిల్సు, సీసాలమూతలు తీయు కార్కుస్క్రూ, బకెట్లు, పలువిధములైన సీసాలు మొదలగు పరికరములను సంపాదించుకొనవలయును.

---

## జ్ఞాపకముంచుకోవలసిన ముఖ్య విషయములు.

పశువులయొక్క దేహతత్వము తెలిసేవరకు మందులు క్వార్ధిమోతాదులతో వాడుట మంచిది. చూడిపశువుల విషయమయి తగినంత జాగ్రత్తతీసికొని రోగనిదానము గ్రహించి తగినమం దీయవలయును గాని తదితరపశువులకువలెనే ఈ పశువులకు నీయరాదు. అన్నిమందులలోను చేరెడివస్తువులు క్రొత్తవిగను, పరిశుభ్రమైనవిగను చూచి జేర్చవలెను. ప్రాతవస్తువులు నిస్సారమైనట్టియు, పుచ్చిపోయినట్టియు మూలికలను వాడరాదు. వస్తువులన్నిటిని బాగుగ పరిశీలించి, బాగుచేయించి, ఎండించి, ప్రత్యేకముగ చూర్ణముచేయించి వస్త్ర

గాలితము చేయవలసినవి చేయించి భాగముల ప్రకారము మందులలో చేర్చవలెను. లేనియెడల భాగములలో తేడాలు కలిగి మందులు సరిగా పనిచేయకపోవును. ప్రతివస్తువు నేయే వ్యాధికి యోగ్యణముచేయునో ఈపశు వైద్యవస్తుగుణదీపికలో చూచిన మీకే తెలియును. కాని ఈగ్రంథములో వ్రాసినంత మాత్రమున మీరు చదివి అర్థము చేసికొనుటకంటె తగినంత అనుభవము సంపాదించి చికిత్సలు చేయించుట మంచిది. పురుగులను చంపుటకు లోని కిచ్చెడు మందులు జాగ్రత్తగా నీయవయును. శస్త్రముచేయు పనిముట్లు జాగ్రత్తగా వాడవలయును. ఔన్సుగ్లాసు, డ్రాముగ్లాసు, ఉపయోగానంతరము పరిశుభ్రముగా కడిగి మరల నుపయోగించుటకు సిద్ధపరచుకొనవలెను. విషసంబంధమైన మందుల సీసాలపైన విషమును తెలుపుగుర్తు లుండవలెను. ప్రతిమందుసీసా పైనను కూడ చీటి యుండవలెను.

---

## చూర్ణములు.

కొన్ని మందులను పౌడర్ల రూపమున పశువు శరీరములోపలి కియ్యవలసియుండును. ఈ పౌడర్లయం దుపయోగింపబడు పదార్థములు గడ్డలుగాగాని పలుకులుగ గాని యుండవచ్చును. అట్టివానిని మెత్తగ చూర్ణముచేయుటకు గాను ప్రత్యేకముగా రాతితో చేయబడిన చిన్న రోలును అడుగుభాగమున రాయియును పైభాగమున కొయ్యయును గలిగియుండి చేతితో పట్టుకొనుటకు వీలుగానుండిన చిన్నరోకలి

యును అవసరమై యున్నవి. నియోగింపబడిన ఔషధ పదార్థములలో మెత్తని పొడిగ గొట్టవలసినవి వున్నయెడల నట్టివానిని మెత్తగ పొడిజేసి పొట్లములు గట్టవలెను.

---

## మాత్రలు.

మాత్రలను జేయుటయందు మ్రింగుటకు వీలగు పరిమాణమును వహించియుండునటుల జేయవలెను. మాత్రలను జేయుటయందు ఔషధపదార్థములు గలియునటుల జేయుటకు జిగురు, గ్లిసరిన్, స్పిరిట్, వ్యాసులైను మొదలగు వస్తువులుపయోగించవలెను.

---

## తైలములు.

శరీరముపైన రుద్దుటకుని యోగింపబడిన తైలమువినిమింట్ అనబడును. దీనిని పైభాగమున మర్దనచేయుటకుమాత్రమే ఉపయోగింతురు. దీనిని అరచేతిలో కొంచెము వేసికొని పశువుయొక్క అస్వస్థతాభాగమున నింకిపోవునటుల రుద్దవలెను. మరికొంచెము వేసికొని మరల రుద్దవచ్చును. ఈతైలములలో ననేకములు మెత్తనిస్థలములందు దాకినయెడల రేగుదలను మంటను గలుగజేయును. గనుక దీని నుపయోగించిన వెనుక చేతులను శుభ్రముగా కడుగుకొనవలెను. తైలములను యెన్నడును లోని కియ్యరాదు.

---

## ఔషధముల సమ్మేళనము

ఈగ్రంథములో జెప్పబడిన ఔషధముల మిశ్రమమును జేయువిషయమై కొంచెముగా జెప్పదగియున్నది. దీనికి ఆంగ్లేయభాషయందు కంపౌండింగు అందురు. ఈపనిని బహు జాగ్రత్తతోడను, పరిశుభ్రతతోడను జేయుటయేగాక, తూనికయందుగాని కొలతయందుగాని కొంచెమైనను హెచ్చుతగ్గులులేకుండగ పశువుల కౌషధము లిచ్చుటయు ముఖ్యమైయున్నది. ఈపనిని జేయునప్పుడు పరధ్యానములేకుండగ బహుశ్రద్ధాభక్తులను వహించియుండవలెను. ఏలయన ఒకవస్తువునుపయోగించుటకు బదులుగ నింకొక వస్తువు నుపయోగించిన యెడల ప్రాణాపాయము దటస్థించుటయు గలుగును.

---

## తూనిక.

ఔషధముల తూచుటయందు బహు ఖండితముగా నుండవలెను. పశువులకు 2 లేక 3 ఔన్సుల కంటె నెక్కువగ దూచుట యెన్నడును సామాన్యముగ దటస్థించదు. కొన్ని విషయములలో డ్రాములవరకు మాత్రము తూచుటయు, మరికొన్ని విషయములలో గ్రెయినులవరకు మాత్రము తూచుటయు తటస్థించుచున్నది. ఈతూనికకొరకై మధ్య స్తంభమును గలిగియుండి యొకవైపున గాజుపళ్ళెముగలిగి యుండిన త్రాసును సంపాదించుట మంచిది.

---

## కొలత.

ఔషధములు కొలుచుట తేలికయయినపనియేగాని తక్కిన వాటివలె దీనియందును జాగ్రత్తయు నలవాటు నుండవలయును. ఈ కొలతలు గుర్తుపెట్టుటకు గాజుగ్లాసులు అమ్మబడును. ఆగ్లాసుల కిరువైపుల కొన్నిగుర్తులు వేసియుండును. కొలతగ్లాసును యెడమచేతియొక్క బొటనవ్రేలునకును పిమ్మటి రెండువ్రేళ్ళకును మధ్యగా బట్టుకొని కంటితోసమానమైన యెత్తునకు దీసికొనిరావలయును. ఏసీసాలోనుండి మందును బోయవలెనో ఆసీసాను కుడిచేతితోబట్టుకొనిదానియొక్క మూతను ఎడమచేతిచిన్నివ్రేలితోబట్టుకొని యుండవలయును. ఈమూత నీప్రకారము బట్టుకొనుటకై కొంతవరకు నలవాటు కావలయును. కాన అట్లు జేయుటలో జారవిడిచి దానిని బగులగొట్టు అపాయమునుండి తొలగుటకుగాను కొలుచునప్పుడు దానిని విడిగానుంచుట యుత్తమము.

---

## రోగముల కౌషధములు.

ఈక్రింద నుదహరించబడిన ఔషధప్రమాణములు పూర్ణవయస్సుగల పశువులకును, అర్థవయస్సుగల పశువులకును వాడవలెను. ద్రవరూపముగల మందులను జాగ్రత్తగా నీయవలెను. ముష్టి పాషాణము మొదలగు విషవస్తువులను అనుభవపూర్వకముగా వాడుకచేయువారు తప్ప తదితరు లెంత మాత్రము వాడరాదు. ఆవిషపుమందులు గల సీసాలమీద

స్వభావములో గొప్ప అక్షరములతో "విషము" అనివ్రాసి చీటీముక్కలను అంటించి వాడవలెను. దూడలకు ప్రత్యేక శ్రద్ధ తీసికొని ఉపయోగించవలెను.

---

తూనికలు.

1 స్క్రూపిలు—2 అణాబిళ్ళలయెత్తు
1 డ్రాము— 3 బేడలయెత్తు
3 డ్రాములు—రమారమి తులమెత్తు
1 ఔన్సు—$\frac{1}{2}$ చటాకు లేక $2\frac{1}{2}$ తులములు
1 పౌండు—8 చటాకులు లేక $\frac{1}{2}$ శేరు

---

కొలతలు.

1 మినిము—1 చుక్క
1 ద్రవమానపుడ్రాము—50 చుక్కలు
4 ద్రవమానపుడ్రాములు—$\frac{1}{4}$ చటాకు
1 ద్రవమానపుఔన్సు—$\frac{1}{2}$ చటాకు
1 పైంటు—10 చటాకులు
1 క్వార్టు—20 చటాకులు లేక $1\frac{1}{4}$ శేరు
1 గాలను—5 శేర్లు

పైలెక్కలను పశువులకు సామాన్యముగా వెటర్నరీ ఆస్పత్రిలలో వాడుదురు.

---

# పశువైద్య వస్తుగుణదీపిక

## అ

అడ్డసరము—Adhatoda Vasika:— దీనిని సంస్కృతములో వాసికః యనియు, హిందీ లేక యూనానీలో అడూసా, అంసా యనియు, అరవములో ఆడతోడై యనియు అందురు. ఈ చెట్లు మన దేశ మందంతటను పెరుగుచున్నవి. ఇవి దొడ్లలోను తోటలలోను, గుబురుగా పెంపొందును. 4,8,20 అడుగుల యెత్తువరకు బెరుగును. దీనిఆకు యిరుప్రక్కల నునుపుగను, దీనిబెరడు బూడిదవర్ణము కలదిగ నుండును. దీనికాయలోపల రెండు గదు లుండును. ఆగదులలో సన్నని నాలుగు గింజలుండును. దీనిచెక్కతో కొందరు రుద్రాక్షలు చేయుదురు. దీని వేరుయొక్కయు, ఆకుయొక్కయు రసము చేదుగ వెగటుగ నుండును. ఆయుర్వేద పశువైద్యులు వీని ఆకులను తఱచుగా వాడుదురు. దీని కాయలుకూడ చేదుగ నుండును. ఆకురసములో విరేచనములు కట్టించు గుణము కలదు. ఇంకను పశువుల కు గలుగు వగర్పను వ్యాధికి పనిచేయును. అడ్డసరము యెక్కువగా పశువుల శ్వాసకోశములలో పుట్టువ్యాధులకుకూడ నుపయోగపడును. అడ్డసరపాకులు తెచ్చి వానికి ఉప్పురాచి రాత్రిమంచులో నానవేసి మరునాడుదయమున తినిపించినచో పశువునకు వాతరోగము నివర్తియగును. ఇంకను వీనిపసరు పశువులకు కలుగు నల్లతెగులనువ్యాధికి పనిచేయును. అడ్డసర పాకురసము పశువుశరీరములోనికి పోగానే చలువజేయుగుణము కలిగియుండును.

పసరు మోతాదు:- పెద్దజంతువులకు 4 తులములు లగాయతు 6 తులములవరకు ఈయవచ్చును.

చిన్నజంతువులకు 1 తులము లగాయతు 3 తులముల వరకు ఈయవచ్చును.

అవిసె—Linseed plant:— దీనిని సంస్కృతములో అతసీ, రుద్రపత్నీయనియు, అరవములో అవిసినాటుఅళి, విద్రై, పెరుఅళివిద్రై అనియు, హిందీ లేక యూనానీలో అల్‌సి, తిసి యనియు నందురు. ఈచెట్టు 20,30 అడుగుల ఎత్తువరకు పెరుగును పువ్వులు పెద్దవిగానుండి ఎరుపువర్ణముగాగాని, తెలుపువర్ణముగాగాని, యుండును. కొందరు ఆకును, కాయలను కూరగా వండుకొని తిందురు. దీనిమాను చెక్కరసము చేదుగ నుండును. అవిసెఆకుపసరు వేడిజేయును. దీని ఆకుపసరును మిరియాలగంధముతో అరగదీసి పశువుల నేత్రములకు కలుగు తెలుపులకు (నీటికాసులు) వుపయోగించిన నెమ్మదియగును. దీనివిత్తులు మూత్రరోగముచే బాధపడుచుండెడి జంతువున కొకవిధమైన పానకముగ తయారుజేసి త్రాగించెదరు. ఈగింజలను పిండిగా విసరి నీటితోకలిపి పిసికి ముద్దగాజేసి పశువులశరీరముమీద లేచు వ్రణములకును, నెత్తురుగడ్డలకును కట్టినచో వానిని మాన్పును. ఇంకను దీని ఆకురసము పశువులకు కలుగు చర్మవ్యాధులకు పనిచేయును. ఆకుపసరు లోపలికి త్రాగించిన వేడిజేయును. దూడలను బలపరచువారు ఈగింజలను కొంతకాలమువరకు మేతతో చేర్చి పెట్టుచుండినచో అవి కండబట్టి

దృఢముగా నుండును. ఇంకను యీగింజలనుండి చమురుతీసి పశువులకు సంభవించు జీర్ణసంబంధమైనజాడ్యములకు వాడవచ్చును.

వసరు మోతాదు పావుశేరులగాయతు అర్ధశేరువరకు.

అనుములు – Dolichos Loblob :—సంస్కృతములో రాజశింబీయనియు, హిం: యూ: బల్లర్, భట్వాంస్ అనియు, అరవములో మొచ్చై యనియు నందురు. ఇవి మనజిల్లాలలో మెట్టనేలలయందు విస్తారముగ పండును. ఇవి మనరాజధానికి పశ్చిమతీరమున ముఖ్యముగా పచ్చియెరువుక్రింద వాడబడుచున్నవి ఏప్రియల్, మేనెల వానలలో చల్లి జూన్, జూలై నెలలో వరిపైరు నాటుటకు ముందు యీపెరిగిన మొక్కలను దున్నివేయుదురు. ఊడ్చిన కొన్నాళ్ళకు మిగుల బలముకలుగును. తీగెలు పాకుట కాధారమేమైన గావలయును. కావున గోగు, ఆముదము మొదలగువానితో కలిపి చల్లుదురు. వీనియం దొకసువాసన గలదు. ఇంకను వీనిని సజ్జ, జొన్న, రాగి మున్నగు పైర్లతో విత్తుదురు. డిశంబరు లేక జనవరి మాసమందు పండును. కాయలు పండునపుడు గింజలను వేరు పరచుటకుగాను కఱ్ఱలతో కొట్టబడును. అనుములను సాధారణముగా బీదలు తిందురు. పచ్చి అనపకాయలను కొందరు చిక్కుడుకాయలవలెనే కూరవండుకొని తిందురు. ఇంక నీగింజలను గుగ్గిళ్ళుగా చేసి తినిన మిగుల రుచిగా నుండును. ఈగుగ్గిళ్ళను పశువులకు పెట్టిన పాలు బాగుగానిచ్చును. పశువు పేగులలో నుండు మలినపుండ్లను మాన్పును. ఇంకను పశువుయీని మాయ

వేయునిదానికిని, మూపితినిన పశువునకును పనిచేయును.

మోతాదు:—పూటకు అరసోలెడులగాయుతు సోలెడువరకు.

అరటిచెట్టు - Plantain tree :—దీనిని సం: కదళీ యనియు, హిం: యునా: కేలా, అరవములో ప్లాన్టెన్, బనానా అనియందురు. ఈ చెట్లలో అనేక జాతులు గలవు. వీనిదుంప, వ్రేళ్ళు పొత్తి, ఆకులు, మున్నగువాని రసము స్వాదుగ, వెగటుగ నుండును. అరటిదుంపను తెచ్చి పరిశుభ్రముగా నీటితో కడిగి మానెడు నీటిలోవేసి త్రొక్కి రసముతీసి పశువు యొక్క వయస్సునుబట్టి ఒకసోలెడు గాని తవ్వెడుగాని పచ్చ జొన్నపిండిని కలిపి ఉడికించి చల్లార్చి పశువునకు త్రాగించినయెడల పెద్దరోగము, పారుడురోగము, రక్తవిరేచనములు, మున్నగు వ్యాధులు నివారణమగును. అరటిచెట్టువ్రేళ్ల రసములో నెయ్యి, చక్కెర కొద్దిమోతాదు కలిపి పోసినయెడల పశువులు, కుక్కలు, మొదలగు జంతువులు తినిన పాషాణ విషమును విరచును, దుంపరసము, ఆకురసము కూడ పశువులకు కలుగు అవిరి మున్నగు నేత్రవ్యాధులకు పనిచేయును. ఇంకను ఎండినయాకుల చూర్ణము వెన్నతో కలిపి రాసినయెడల మెడమీాది పుండ్లకు, అబ్బువాపులకు పగుళ్ళకు పనిచేయును.

అక్కలకర్ర — Pellitory root:—దీనిని సం:అకారకరభః. హిం:యునా: అకర్ కర్ అకోగాకోరా, అర:అక్కకారం అని పిలిచెదరు. ఇది ఒకవిధమగు చెట్టువేరు. ఈచెట్లు కొండల

మీద విస్తారముగా పెరుగును. అక్కలకర్ర వేడిజేయును. దీని వేరురసము కారముగ నుండును. పశువు నరములకు ఈరసము బలము గలిగించును. దీని చూర్ణము పశువుకడుపులోని కిచ్చిన వాతము హరించును. విరేచనము గావించును. దీని గంధమును నెత్తురుగడ్డలకు పూసిన అణగిపోవును. లేదా చీము పట్టి పగులును. పశువునకు సంభవించు నీటికాసులను వ్యాధికి అక్కలకర్ర అరతులము, ఉప్పుడుబియ్యము తులము, లవంగాలు అరతులము తెచ్చి పొడిజేసి నిమ్మకాయ రసములో కలిపి కోడిఈకతో కంటికి పట్టించినచో నీవ్యాధి నివారణమగును.

మోతాదు:—½ తులము మొదలు 1 తులమువరకు

అల్లము — Zingiber:—దీనిని సంస్కృతమున ఆర్ద్రకం అనియు హిందీ, యూనానీలో అదరిక్ అనియు, అరవములో ఇంజయనియు అందురు. అల్లము మనదేశమునం దంతటను సాగుచేయబడుచున్నది. ఎఱ్ఱనేలలో నిది బాగుగా పెరుగును. వర్షాకాలమునందు పొలము దున్ని చిన్నచిన్న గోతులు తీసి వానిలో పేడవేసి అల్లపుముక్కలను నాటెదరు. నాటినతరువాత పొలమంతయు నాకులతో గప్పుదురు. మొక్కలు పెద్దవి కాకపూర్వము వర్షములు విస్తారముగా కురిసి నీరునిలిచే యెడల అల్లము ముఱిగి కుళ్ళిపోవును. కావున నీరంత నిలువకుండ జాగ్రత్తగా చూచుచుండవలెను. అల్లమునుండియే శొంఠి తీయుదురు. మనదేశమునుండి తదితర దేశముల కెగుమతి యగుచున్నది. మనకు చీనా, జపానుదేశములనుండి కూడ

అల్లము వచ్చుచున్నది. మరియు మన మెరుగుపరిచేసిన అల్లము పంచదారతో గలిసియు, తేనెతో గలిసియు మనకు తిరిగి వచ్చుచున్నది. అల్లము కారముగలిగి ఘుల్లగా నుండును. పశువు కడుపులోనుండు చెడుపదార్థములను పోగొట్టు స్వభావము కలదు. ఇది కాకజేసి తగ్గును. దీనిలో జీర్ణముచేయుపదార్థ మెక్కువగా నున్నది. పశువులకు కలుగు అజీర్తి, దగ్గు, ఒగర్పు, రక్తమూత్రము, రొంప మొదలగు జాడ్యములకు దీనిని వాడుదురు.

మోతాదు:—1 తు మొదలు 3 తు వరకు.

**అతిమధురము** — Liquorice root:—దీనిని సం:యష్టి మధురం, హిం: యూనానీ: కప్పల్‌సూక్, ములైదీ, అర: అతి మధురం అని అందురు. ఈచెట్లు పెషావరు, సింధు ప్రాంతము లందు పైరగుచున్నవి. దీనిలో చలువచేయు గుణముకలదు. ఇంకను గురువిందవేరుతో సంబంధించిన దానికి అతిమధురమని వాడుకగలదు. ఇది తియ్యగా, స్వాదుగానుండును. పశువులకు కలుగు నేత్రరోగములకు, చర్మవ్యాధులకు పనిచేయును.

మోతాదు అరతులం మొదలు ఒకటింపాతిక తు వరకు

అత్తి-Kicees:—సం॥ ఉదుంబరగః, క్షీరవృక్షు, హిం: యూ: గుల్లర్, అంజీర్, ఫూమర్, అర, అత్తిప్పష్టం అనియందురు దీనినే మేడిచెట్టనియు, బొడ్డచెట్టనియు కూడ నందురు. ఈచెట్టు యెత్తుగనే పెరుగును గాని ప్రకాండము వంకర టింకరగా నుండును. వర్షాకాలములో దీని యాకులు రాలిపోవును. దీనిపచ్చి

కాయలను పండ్లను గూడ తిందురు. దీనినుండి వచ్చు జిగురును పిట్టలను బట్టుకొనుట కుపయోగించెదరు. కలప పొయ్యిలో నికి నూతి చట్రములకు పనికివచ్చును. దీని చెక్కరసము చూర్ణము వెగటుగ నుండును. దీనిపాలు పశువులకు కలుగు చర్మవ్యాధులకు వాతరోగములకు పనిచేయును. ఈపాలు పశువులకు అప్పుడప్పుడు సంభవించు వ్రణములకు కంతులకు కల్లవాపుల కుపయోగపడును. దీని చెక్కపొడి నూనెలో కలిపి తామర మున్నగు వ్యాధుల కుపయోగింపవచ్చును. అత్తిపండులో చలువజేయు గుణము కలదు. ఈపండ్లను పిసికి చెడురక్తముతో గూడియుండు గడ్డలకు కట్టిన త్వరగ చీముపట్టి పగులును.

అంకుడు — Anti-dysentericum:—సం: కృష్ణకుటజః హింది: యునాని: కౌరేయ, కూరా, అర: కులాఫ్ అని అందురు. దీనినే రెప్పాలచెట్టనిన్ని కొండజెముడనిన్ని అందురు. ఈచెట్లు మనదేశమునందంతట బెరుగుచున్నవి. పాలకొడిసె చెట్టువలె నుండును. రెండేసికాయలు గుత్తిగనుండి వానిచివరలు ఒకదానితో నొకటి కలసియుండును. దీని పువ్వులు తెలుపుగ నుండును. దీని ఆకులపాలు కారముగ నుండును. దీనిబెరడు గింజలు ఔషధములలో నుపయోగించుదురు. దీనికలప మృదువుగా నుండును గాన దీనితో దువ్వెనలు బొమ్మలు మొదలగునవి చేయుదురు. దీనిపాలు కాకజేయును. దీనిఆకులు పశువులకు కలుగు చర్మవ్యాధులకు దొమ్మ, కురమ, అజీర్తి మొదలగు వ్యాధులకు పనిచేయును.

అపరధాన్యములపొట్టులు:—వరి, పచ్చిగడ్డి, గోధుమ, ఉలవ, మినుము, పెసర, కంది, శనగలు మొదలగు అపరధాన్యముల పొట్టులందు మాంసకృత్తుపదార్థము లెక్కువగా నుండును. గనుక నీపొట్టులు ఎక్కువమంచివి. ఇవి పశువులకు బలము నిచ్చును. పాడిపశువులకు మేపిన పాలు వెన్న బాగుగా కలుగును. వరిపొట్టులో పదివేల పాళ్ళలో 1000 పాళ్ళ నీరు, 1381 పాళ్ళ మాంసకర పదార్థములు, 5020 ఉష్ణకరపదార్థములు, 675 పాళ్ళు నార, 964 పాళ్ళ ఉప్పు, 760 పాళ్ళ తదితరభాగములును - కంది, పెసరపొట్టులలో 1130 నీరు, 812 మాంసకరపదార్థములు, 4143 ఉష్ణకరపదార్థములు, 2965 నార, 720 ఉప్పు, 6 ఇతరవస్తువులును- గోధుమ పొట్టులో 1250 నీరు, 1362 మాంసకరపదార్థములు, 6148 ఉష్ణకరపదార్థములు, 620 నార, 270 ఉప్పు, 30 తదితర వస్తువులును- ఉలవపొట్టులో 1160 నీరు, 2275 మాంసకరపదార్థములు, 5359 ఉష్ణకరపదార్థములు 480 నార, 576 ఉప్పు, 150 తదితరవస్తువులు- పచ్చిగడ్డిలో 8300 నీరు, 201 మాంసకరపదార్థములు, 767 ఉష్ణకర పదార్థములు, 561 నార, 150 ఉప్పు, 21 తదితర వస్తువులునుండును. పైనచెప్పిన ఆహారములలో పచ్చిగడ్డి మిక్కిలి సారవంతమైనది. తరువాత ఉలవ, కంది, పెసర, గోధుమ, వరి పొట్టులుకూడ నించుమించుగా దీనితో సమానమైనవే.

ఆముదపుచెట్టు - Castor oil plant :—సం: ఏరండః హిం: యూ: తాకీ, గఢీలూ, అర- సారక్యాయ్ అని అందురు.

ఈ చెట్లకు జన్మభూమి ఆఫ్రికాయని చెప్పుటకు సందియము లేదు. అచ్చటనుండి ఈ పైరు ఆసియా, ఐరోపా ఖండములకు జేరినది. ఆసియా ఖండమునం దిది భరతవర్షమునందును, హిందూమహాసముద్రములోనున్న దీవులలోను, పారసీక దేశమందును, అరేబియా, చైనా, జపానురాజ్యములందును పైరు చేయబడుచున్నది. ఈ చెట్లలో రెండుజాతులు గలవు. ఒక జాతి మనదేశములో ప్రతిచోట సాధారణముగా పైరు చేయ బడుచున్నది. రెండవది నివాసస్థానముల చుట్టునుండు ఆవరణములలో పెరగుజాతి. ఇది చాలాసంవత్సరములు జీవించియుండగలదు. ఆముదపు ఆకులను పశువులు తినిన లెస్సగా పాలి య్యగలవు. ఈ చెట్టుయొక్క గింజలనుండి చమురు దీయుదురు. ఈగింజల నొక సంచిలో పోసి రేకండ్లవంటి వాని మధ్య బెట్టి వానిని దగ్గరకు నొక్కుదురు. ఈపనిచేయుముందు గింజలను నానవేసి త్రొక్కుదురు. అప్పుడు ఒకవిధమైన చమురు బయలుదేరును. మరికొందరు గింజలను వేయించి పొడుముగొట్టి దానికి నాలుగురెట్లు నీరుకలిపి మరుగబెట్టుదురు. ఆముదము నీటికంటె తేలికయగుటచే నీటిమీద తేలుచుండును. ఆ తేలునట్టి చమురు తీయుదురు. కాని ఈపద్ధతు లిప్పు డంతగ లేవు. యంత్రసహాయమున ఆముదము చేయుటయే మంచిది. ఆముదమును దీపమున కుపయోగించు వాడుక మనదేశమందు పూర్వము నుండియు వాడుక గలదు. యంత్రములు తేలికగా దిరుగుటకును, అరిగిపోకుండుటకును ఉపయోగింపబడు నూనెలలో ఆముద మొకటి. ఈఆముదము వైద్యమునకు మూలకారణము.

ఇది వెగటుగ చిరుచేదుగ నుండును. కాకజేయును. నరములను శుభ్రపరచును. మావివేయక బాధపడుచుండు పశువునకు లోపలికిచ్చినవెంటనే మావివడును. ఇంకను లోపలికి ఇచ్చిన యెడల పేడను మెత్తగిలజేయును. పేగులలో పేరుకొనియుండు మలిన పదార్థములను పోగొట్టును. ఇంకను పశువులకు కలుగు మలబద్ధము, ఉబ్బగిడి, అజీర్తి, కడుపుబ్బు, పారుడురోగము మొదలగు సంకటముల కన్నిటికి మిగుల ప్రయోజనకారి.

మోతాదు:-20 తులములు లగాయతు 40 తులములవరకు.

ఆవాలు :—సం: సర్షపః, హిం: యూ: రాయీ, అర: కడుఘూ అందురు. ఈకుటుంబపు మొక్కలు శీతలదేశమునందేకాని ఉష్ణదేశములందంతగా పెరుగవు. ఇవి యెక్కువగా కొండలమీద పెరుగును. వీనిని గోధుమలతో కలిపి పొలములలో జల్లుదురు. పంట బాగున్న యెడల యెకరమునకు ఆరుమణుగులు పండును. ఇవి యెరుపు, తెలుపు, నలుపు, రంగులుగల మూడుజాతు లుండును. వీనిలో నల్లావాలే మంచివి. తెల్లావాలు ఔషధములలో వాడుదురు. ఇవి వాతము హరించును. వేడిజేయును. వీనిని తరచుగా జబ్బుపడిన భాగమునకు పట్టువేయుదురు. వీనిని పట్టువేయునపుడు వేడినీటితో కలిపి పట్టువేయవలయును. వాచియుండు ప్రదేశముపైన యీపిండితో పట్టువేసినచో తగ్గును. ఇవి పశువుయొక్క నురుగుదబ్బలరోగము సంభవించినపుడు ప్రక్కలమీదను, కడుపునొప్పికి పొట్టమీదను, గుండెకాయ పేగులు వాచినపుడు ఆయాప్రదేశములు

మీదను పట్టువేయువలెను. ఇంకను పశువులకు కలుగుదొమ్మ, వాతము, జెనుకునొప్పులు, కొమ్ముసంబంధమైన జాడ్యములు మొదలగువానికి పనిచేయును.

మోతాదు:— అరతులము లగాయతు తులమువరకు.

ఆముదపుపిండి—Castor flour:—దీనిని పశువులు తినినయెడల విరేచనములగును. ఎక్కువగ దినినయెడల హానికూడ సంభవించును. కనుక దీనిని పశువులకు పెట్టరాదు. దీనిని పొలములకు యెరువుగా నుపయోగించెదరు.

ఆరిక—Paspalem:—సం: కోద్రవక, హిం: యూ: కోడో, అర: వరగు అందురు. ఈమొక్కలు జూలై లేక ఆగస్టు మాసములలో మెట్టనేలలో విత్తబడి జనవరిలేక ఫిబ్రివరి మాసములలో కోతకువచ్చును. ఇదిమిక్కిలి దృఢమైన పైరు. ఒకనెలవరకు వర్షములేకపోయినను నిలువగలదు. ఇది భూమిని సారవంతముగా చేయునట్టిదియై యుండుటచేత ఈపంటయినతరువాత ఆనెలలో యేమియును విత్తక ఒకసంవత్సరము వరకు వదలిపెట్టబడును. కొన్నిసమయములలో దీనితో కందులు ఆముదాలు మొదలగుపైరులతో వేయబడును. ఆరికఅన్నము వెగటుగా స్వాదుగానుండును. పశువులకు ఆరికఅన్నము పెట్టిన మిగుల బలముకలుగజేయును. గాలికుంటువ్యాధికి ఆరికఅన్నమును పెట్టవలెను. ఈధాన్యమును కోళ్ళకు, బాతులకు తినిపించిన అధికముగ గుడ్లుపెట్టును.

ఆడాలు—Arabis:—ఇవి పెద్దావాలంత పరిమాణము గలిగియుండును. ఎరుపురంగు గలిగియుండును. పశువులకు కల్లు

వాతరోగములకు దీనిని తఱచుగా వాడుదురు.

ఆదొండాకు—Capparis:—సం: తుజాలక, హిం: యూ: కుదురా, అర: కోలైకార్యఁయ్ అందురు. దీనినే ఆరు దొండయందురు. ఏచెట్టుపైనను నెగబ్రాకు గుబురుమొక్క. దీనికి ముళ్ళుగలవు. పువ్వులు కణుపునందు దగ్గరగ నొకదానిపై నొకటియుండును. దీనిఆకురసము వేడిజేయును. విరేచనము గావించును. పశువులకు కలుగు వాతరోగములకు దీనివసరు పనిజేయును.

## ఇ

ఇంగువ—Assafoetida:—సం: హింగు, హిం: యూ హీంగ్, అర: పెరుంగాయం అందురు. ఈమొక్కలు పెరిష్యా ప్రాంతములలో నెక్కువగా పెరుగును. ఇవి ఉన్నతప్రదేశము లందును రాతినేలలందును మొలచును. ఇవి 3, 4 అడుగుల ఎత్తువఱకు బెరుగును. ఈమొక్కలలో చాల రకములు గలవు. ఈచెట్టువ్రేళ్ళను నరకుటవలన నేర్పడెడి జిగురు నిలవయుంచుట వలన నలుపురంగుగ నుండును. దీనినే ఇంగువ యందురు. కొందరు వర్తకులు దీనిపైన రంగులు పూయుదురు. ఇది కారు వాసనగను వెగటుగను కారముగను ఉండును. దీనిలో చురు కుదనము బుట్టించు గుణము కలదు. మిక్కిలి వేడిజేసి ఆర్చును. శ్వాస నణచును. విరేచనముచేయును, జీర్ణముగావించును. ఇంకను కడుపులోని వాయువును బయటకు వెడలించును. పశు వులకు కలుగు కడుపుబ్బు కడుపునొప్పి వాతము చర్మవ్యాధు లకు పనిచేయును. ఈనినవెంటనే పశువులకు 2, 3 తులములు

ఇంకువ పెట్టినయెడల వాతరోగము హరించును.

మోతాదు:—తులములగాయతు 3 తులములవరకు.

ఇంగిలీకము — Cinnabar :— సం: హింగుళ, హిం: యూ: ఈంగుర్, అర: ఇంగిలీకం అందురు. ఇది రెండువిధములుగా నుండును. ఒకరకము సాధారణమైనది. మరియొకదానిని వలందల ఇంగిలీక మందురు. ఇది వంటసంబంధమైనది. ఎరుపు రంగుగను, బరువుగ నుండును. దీనిని నీటిలో వేసిన కరుగదు. పొడిచేసిన మిగుల ఎఱ్ఱగ నుండును. ఇంగిలీకములో పాదరసము కలదు. పైనచెప్పబడిన వలందల యింగిలీకమందు పాదరస మెక్కువగా నుండును. దీని మోతాదు తగుజాగ్రత్తగా నుపయోగించవలెను. లేనిచో పైత్య మెక్కువై ప్రాణాపాయము తటస్థింపవచ్చును. పశువులకు కలుగు కణతులకు, చర్మరోగములకు, వాపులకు పనిచేయును.

ఇసుళ్లు -- winged white ants:—వర్షాకాలమునందు చెదలపుట్టలలోనుండి గుంపులు గుంపులుగా వచ్చు రెక్కలుగల పెద్ద చెదలపురుగులు ఈపురుగుల రెక్కలు కాల్చి మసిచేసి ఆముదములో కలిపి పశువుల మెడమీదకలుగు అరుగ్రివాపులకు, పుండ్లకు వాడిన త్వరగా మానును.

ఇప్ప — Bassia:—సం: మధూకః, హిం:యూ:మహువ, తో:వా, అర: మదూకం అందురు. ఈమొక్కలు కొండప్రదేశములలో పెరుగును. ఆకులు కొమ్మల చివరగుబురు గుబురులుగా నుండును. వీని పువ్వులను కొందరు తిందురు.

వీని నుండి సారాయి తీయుదురు. ఇంకను చమురు గూడ తీయుదురు. ఆముదముకంటె చిక్కగ నుండును. పువ్వులను ఎండబెట్టి పిండిగాచేయుదురు. ఇప్పనూనె వేడిచేసిఆర్పును. ఈచెట్టు బెరడు రసము పశువులకు కలుగు వాతరోగములకు తుట్టెవురుగులరోగమునకు పనిచేయును. ఈనూనె చర్మవ్యాధులకు, వాతరోగముల కుపయోగపడును. ఇప్పపిండి పశువులకు కలుగు మోకాళ్ళవాపులకు పనికివచ్చును.

ఇండుపగింజలు—Clearing nuts:—సం: కతకబీజాని, హిం: యూ: పాయుఫసారీ, అర: తైతంకొట్టె అందురు. అనగా చిల్లగింజలు. ఈచెట్టు ముసిడిచెట్టుకంటె పెద్దది. ఈచెట్లు కొండలమీదమాత్రమే పెరుగుచున్నవి. పండ్లను తిందురు. ఈగింజలు జిగటగ నుండును. వీని నరుగదీసి మడ్డిని నీటిలోకలిపినయెడల స్వచ్ఛమైన నీరు పైకి తేరును. ఇంకను ఈగింజలను కాల్చి మసిచేసి పంచదారలో కలిపి పశువులకుకలుగు నేత్రరోగముల కుపయోగింతురు.

ఇసుక—Sand:—దీనిని మంగలములో వేయించి తీసి గుడ్డలోగాని, గోనెపట్టా తునకలోగాని వేసి వెచ్చవెచ్చనిది పశువులకు కలుగు వాతనొప్పులకు, కణతులకు, తదితర దెబ్బలకు కాచినయెడల వెంటనే సుగుణమిచ్చును.

మోతాదు:—సోలెడు లగాయతు మానెడువరకు.



ఉత్తరేణి—:Achycanthes Aspera·—సం: అపామార్గ, హిం: యూ: చిచడా, చిర్, అర: నాయురివివేరు అందురు.

ఈ మొక్కలు అన్నిచోట్లను పెరుగును. దీనిలో నలుపు యెరుపు, తెలుపు అను మూడురకములు గలవు. దీనికంకి చాలపొడుగుగానుండును. కాయలు పుష్పకోశములలోనే యుండును. కాయలు ముదరగనే అవి తలక్రిందులుగ వంగును. అట్లువంగియుండుటవలన మనబట్టలకు అవి అంటుకొనుచున్నవి. ఉత్తరేణి ఆకు నూరి పశువునకు ఎముకవిరిగిన భాగమందు కట్టిన నెమ్మదియగును. కట్టినకట్టు వారము లేక పక్షముదినములుంచి తరువాత తీయవలెను. దీనిఆకురసము కారముగ, చేదుగ నుండును. ఆకులు నూరి పట్టువేసిన పశువుల పొదుగు పుండ్లకు, చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును. దీనిఆకులు యెండబెట్టి పొగ వేసినయెడల పశువులకు గలుగుదగ్గు శ్వాసములకు పనిచేయును.

మోతాదు:— అరసోలెడు లగాయతు సోలెడువరకు.

ఉమ్మెత్త—Datura:—సం: ధత్తూరః, హిం: యూ: ధతూరా, అర: ఊమ్మత్తి అందురు. ఈ మొక్కలు పలుచోట్ల పెరుగుచున్నవి. పువ్వులు, ఆకులు పెద్దవిగనే యుండును. కాయలమీద ముండ్లుండును. కొన్ని తెగలలో ముండ్లులేవు. నల్ల ఉమ్మెత్త చాల శ్రేష్టమైనది. దీనిఆకులను కాయలను ఔషధములలో వాడుదురు. దీని ఆకు కాయ వెగటుగ నుండును. ఆకుపసరు వేడిజేయును. పశువులకు కలుగు నునుగుదబ్బలరోగము, రొంప, కడుపునొప్పి, వాతము, ధనుర్వాయువు మొదలగువానికి దీని ఆకుపసరు, పొడి వాడవచ్చును. ఇంకనుపశువులకు కలుగు మోర్లువ్యాధికి ఈఆకుపసరు బాగుగా పనిచేయును.

మోతాదు:—పసరు అరతులము లగాయతుతులమువరకు నివ్వవలయును.

ఉస్తి—Solanum:—సం: అలర్కఫలం, హిం: యూ: భట్కటైయా, అర: తూదువఖ్లై అందురు. దీనినే ఉచ్చింత, ములుఉచ్చింత అందురు. ఈమొక్కలు నేలమీద పాకును. ఆకులమీదను, కాయలమీదను ముండ్లుండును. దీని ఆకులు, కాయలు, వేరు చేదుగ నుండును. ఆకురసము శాకజేయును. పశువులకుకలుగు దొమ్మ మొదలగు వ్యాధులకు పనిచేయును.

ఉలవలు-Horse gram:—సం: కులత్థః, హిం: యూ: కుల్థీ, అర: కొళ్ళు అందురు. వీనిలో తెలుపు, నలుపు, ఎరుపు రంగులుగల మూడుజాతు లుండును. వీటిలో నలుపురంగుగలవి యెక్కువ పనిచేయును. ఈమొక్కలు వర్షములు లేకపోయి నను పెరిగి పశువుల యాహారమునకై పనికివచ్చు పైరలో నొకటి. దీనిని పైరుచేయుటకు తేలికైన గరపుభూములు చాలును. ఇవి ఉత్తరహిందూస్థానమందుకంటె మనరాష్ట్ర మందెక్కువగా పండుచున్నవి. ఉలవలు వేడిజేసి ఆర్చును. కాయధాన్యములలో సామాన్యముగ దాణాగా నుపయోగింప బడు దినుసు ఉలవలు. ఇవి పాడిపశువులకును, పాటుపడు పశు వులకును దివ్యమైన యాహారము. వీనిని ఉడకబెట్టిగాని నాన వేసి రుబ్బిగాని పెట్టవలెను. దుక్కిపశువులకు మొదటివిధము నను, ఆవులకు గేదెలకు రెండవవిధముగను పెట్టుదురు. కాని కొన్నిచోట్ల దుక్కిఎద్దులకుగూడ నానవేసి రుబ్బి పెట్టుటయే

వాడుక. పశువులకు కడుపునొప్పి పుట్టిన యెడల కల్లుబెల్లము, ఉలవపిండి కలిపి ఒకపూట పెట్టిన వెంటనే తగ్గును. ఇంక నీ పుల వలు ద్రొమ్మ వాతరోగములకు పనిచేయును.

పరిమాణము:— సోలెడులగాయుతు అడ్డెడువరకు.

ఉసిరిక-Emblic Myrabalan tree:—సం: ఆమలకా, హిం: యూ: ప్యాజ్, అర: పెంగాయుం అందురు. ఈచెట్లు మనదేశమునం దెక్కువగా నున్నవి. ఇవి మెట్టపొలముల యం దెక్కువగా పెరుగును. దీని ఆకులు, పువ్వులు, కాయలు ఔషధములం దుపయోగపడుచున్నవి. దీనికాయలయొక్క గాని, చెక్కయొక్కగాని, ఆకుయొక్కగాని రసము, కషాయము ఒగరు, పులుపు, రుచి కలిగియుండి స్వాదుగానుండును. రసము చలువజేయును. పశువులకు కలుగు వారుడురోగము నకు నేత్రవ్యాధులకు తదితర వ్యాధులకు పనిచేయును. దీని చెక్కకు కుళ్ళు వ్రణములను మాన్పుశక్తి గలదు.

పరిమాణము:- అరతులము మొదలు రెండుతులములవరకు.

ఉప్పు - Common salt:—సం: లవణం, హిం: యూ: నమక్, నోన్, అర: ఉప్పు అందురు. దీనినే సముద్ర లవణమనియు, కల్లుప్పనియు నందురు. ఎండకాలమందు సముద్రపునీరును అర్ధయెకరమునుండి రెండుయెకరముల విస్తీర్ణముగల గుంటలలో విడతురు. అందుండి లోతులేని చిన్నచిన్న పొలిమేరగల మళ్ళకు విడుచునటుల యేర్పాటుచేసి యుంచు దురు. ఒకమడినుండి మరియొకమడికి తిన్నగా విడుచుటకు సుమారు 15 దినములు పట్టును. ఈద్రవమును పెద్దహౌజు

లలో నింపుదురు. ఆవాజులనుండి యంత్రశాలలో కారు చుండు యినుపపళ్లెరములోనికి కావలసినప్పుడు గొట్టముల మూలముగా గొనిపోయి ఆపళ్లెరములలో వేసి కాచుదురు. ఇటుల ద్రవభాగ మంతయు నిమిరినతరువాత నీరంతయు పోవుటకు గాను యీలవణమును రంధ్రములుగల తొట్లలో వేసి చల్లారిన పిదప వర్తకశాలకు గొనిపోవుదురు. దీనినే సముద్రలవణ మందురు. ఉప్పుకాచుట అందరకు తెలిసిన చికిత్సయే. పశువులకు కలుగు వాతనొప్పులు, వాపులు, బెణుకునొప్పులు మొదలగువాటికి ఉప్పుకాపులు తీయుటమంచిది. ఉప్పు రక్తశుద్ధి చేయును. మలమూత్రములు ధారాళముగా వెడలి నులుపురుగుల నశింపజేయును. పాడిపశువులకు ఉప్పును దాణాలో యెక్కువగా పెట్టరాదు. అట్లు పెట్టినయెడల బలముతగ్గును. పాటుపడు పశువులకు మాత్రము ఎక్కువగా పెట్టవచ్చును. ఉప్పు పశువు శరీరములోనికి ప్రవేశించగనే వేడిజేసి ఆర్చును. తరువాత జీర్ణము గావించును. పశువులకు కలుగు సరకు, గాళ్లు, నేత్రవ్యాధులు, చర్మవ్యాధులు, వాతరోగములు మున్నగు వానికి పనిచేయును.

మోతాదు:— గిద్దెడు మొదలు సోలెడువరకు.

ఊడుగ - Alangium:— సం: అంకోలః, హిం: ఢేరా, అర: అళింజి అందురు. దీని చెక్కరసము కారముగ చేదుగ నుండును. దీని విత్తులనుండి తైలముతీయుదురు. రసము వేడిజేయును. పశువులకు కలుగు కడుపునొప్పి, కామా

లా (కామెర్లు) చర్మవ్యాధులకు దీని చెక్కరసము పనిచేయును.

ఉదకము-Water:—సం: జలం, హిం: పానీ. ప్రవహించుచు శుచిగ తేలికగనుండి గాలి యెండ తగులుచు విస్తారముగ నున్న ఉదకము మిగుల శ్రేష్టమైనది. తియ్యగ చల్లగ నుండి మనోహరముగ నుండును. ప్రాణాధారమైనది. చలువ జేయును. దప్పికను పోగొట్టును. ఆహారమును జీర్ణముగావించును. బలము కలుగ జేయును. శరీరములో నుండు రక్తమును అన్నివైపులకు ప్రసరింప జేయును.

ఉప్పునూతినీళ్లు-Brackish well water:—ఉప్పగా వెగటుగా నుండును. కాక జేయును. జీర్ణసంబంధ మగు కడుపు నొప్పి కడుపుబ్బు మొదలగు వ్యాధుల కుపయోగించవచ్చును.

## ఎ

ఎండ-Sun shine:—ఎండ విస్తారముగా తగులుట వలన దప్పిక యెక్కువగును. వ్యాధిచేనున్న పశువు నెండలో నుండిన అతి వేడిజేసి మృతినొందుటకు సిద్ధమగును. చెమటను కలుగజేయును. బలమును తగ్గించును.

ఎర్రకలువదుంప-Water lily:—సం: రక్తోత్పలం, హిం: యూ: లాల్‌బబూలా, అర: గానాక్కిలై. కలువయు, తామరయు నొకకుటుంబములోనివే. ఈకుటుంబపు మొక్కలన్నియు నీటిలోనే పెరుగును. ఆకులయొక్కయు పుష్పముల యొక్కయు కాడలు మిక్కిలి పొడుగా నుండును. వీనియందు గాలి యుండుటకు సొరంగములు గలవు. వీనిలో పుష్పములు పూచెడు కాడకు ఒక్కటే పుష్పముండును. వీని గదులలో

నన్నిగోడలనుండియు గింజలు పుట్టుచున్నవి కలువ మొక్క ప్రతిచెరువులోను ప్రతికోనేరులోను బెరుగగలదుగాని తామర మొక్క బెరుగజాలదు. ఇవి రెంనును అందమునకు బ్రసిద్ధి. ఎఱ్ఱకలువ పువ్వుల రేకులు పశువులకు కలుగు హృదయరోగములను పోగొట్టును. ఎఱ్ఱకలువగింజలు అజీర్ణమునకు, పారుడు రోగమునకు, రక్తవిరేచనములకు పనిచేయును. కలువదుంప రసము వెగటుగా నుండును. ఈ దుంపకూడ పైవ్యాధులకే పనిచేయును.

ఎలుగుబంటి నెత్తురు:—దీనిరక్తము అతివేడి చేయును. పశువులకు గలుగు దొమ్మ, పెద్దరోగము మొదలగు వ్యాధులకు దీనినెత్తురు ఒక అరతులము తీసికొని కలిసీటిలో కలిపి త్రాగించిన వెంటనే సుగుణమిచ్చును.
మోతాదు:— పావుతులము మొదలు ముప్పావుతులము వరకు.

ఏనుగపల్లేరు—Pedalium:— సం: మహాపలంకషా, హిం: యూ: బారాగోకూ్రి, అర: అన్నై నెరింజి పెద్దపల్లేరు. ఈ మొక్కలు ఇసుకనేలలో బెరుగును. దీనివేరు నారింజరంగుగానుండును. ఈ మొక్కలు అరంగుళము మొదలు రెండడుగులవరకు బెరుగును. పువ్వులు పచ్చగానుండును, గొల్లలు పెరుగులో నీరుపోసి వీనిఆకులను వేయుదురు. వెంటనే పెరుగుగట్టిపడును. దీనిఆకులరసము నువ్వులనూనెలో కలిపి రాచినయెడల పశువులకు కలుగు వాతనొప్పులు నివారణమగును. ఇంక దీనిఆకు పసరు పశువులకు కలుగు కురమవ్యాధి కుపయోగించెదరు.

ఏనుగుకాలిగోరు:— ఈగోరును సానమీాద అరగదీసిన

గంధము పశువులకు కలుగు నేత్రరోగములకు వాడిన చక్క-గా పనిచేయును.

ఏలకులు—Cardamons:—సం : ఏలా, హిం: యూ: ఇలాయచీ, అర: ఏలక్కాయ్. ఈచెట్లు కొండలమీాదను, అడవులలోను 5 మొదలు 8 అడుగుల యెత్తువరకు బెరుగును. ఈ చెట్లు 500 మొదలు 50 వేల అడుగులవరకు నెత్తుగానున్న ప్రదేశములయందుగాని పెరుగజాలవు. ఇవి దక్షిణఇండియా యందును, సింహాళమందును పెరుగుచున్నవి. అల్లమువలెనే యిదియు జీర్ణాశయమునందు పనిచేయును. ఏలకులు వేడిజేసి ఆర్చును. వీనిలో ఆహారమును జీర్ణింపజేయుశక్తి గలదు. సువాసనగానుండును. ఏలకులు కొద్దికారము, చిరిచేదుగ నుండును. పశువు శరీరములో నుండు విషవాయువులను పోగొట్టును. పశువులకు కలుగు అజీర్తి, కడుపుబ్బు కడుపునొప్పి మొదలగు వ్యాధులకు పనిచేయును.

మోతాదు:— అరతులంలగాయితు తులంవరకు.

ఒండుగడ్డి— కాడకుఆకులు రెండుప్రక్కలనే యుండును. ఈగడ్డి మెరకనేలలయం దెక్కువగా మొలచును. ఈగడ్డిని పశువులు బాగుగాతినును. పాడిపశువులకు మేపిన వెన్నను కలుగజేయును.

## క

కరక్కాయ - Terminalia chebula:— సం: హారితకీ, హిం: యూ: హడ్, హర్, అర: కడుక్కాయ్. ఈచెట్లు కొండలమీాదను, బయలుప్రదేశములందును గూడ బెరుగు

చున్నవి. కరక్కాయలలో అనేకరకములు గలవు. ఈకాయ బెరడును, పటికను కలిపి నీళ్ళలో వేసి కాచి ఆనీటిలో బట్టలు ముంచినయెడల పచ్చనిరంగుపట్టును. ఈకాయలను జర్మను లెక్కువగా వాడెదరు. దీనిపైబెరడు వగరుగ వెగటుగ నుండును. కారముగకూడ నుండును. కరక్కాయ చలువచేసి ఆర్చును. జీర్ణముచేయు గుణము కలదు. సమస్తవ్యాధులకు దివ్యౌషధ ము. ఈకాయలనుండి తైలముతీయుదురు. ఈతైలము వగరుగ కారముగ నుండును ఈతైలము పశువులకు కలుగు చర్మ వ్యాధులకు పనిచేయును. పశువులకు కలుగు వాతము, కడుపు నొప్పి, గ్రిహాణి, మెత్తగాళ్లు మున్నగువ్యాధులకు ఈచెక్క బెరడు పనిచేయును.

మోతాదు:—తులము మొదలు 3 తులములవరకు.

కలబంద - Aloe Indica:—సం: కుమారీ, హిం: యూ: గ్వార్ పాతా, అర: కుమరీత్సా జై. ఇది మనదేశమందు విస్తారముగా దొరకును. కలబందమట్టలు ఆకులే. నిలువచేసి కొనవలసిన ఆహారపదార్థము యీమొక్క వేళ్లయందు నిలువజేసి కొనును. ఈమొక్కల కంతగా నీరవసరములేదు. ఈమట్టలో పలి మెత్తనిగుజ్జును తీసి రసముగా పిండి యుపయోగించుకొన వచ్చును. ఈరసము జిగురు వెగటు గలిగియుండును. చలువ చేయును. పశువులకండ్లలో దుర్మాంసము పెరిగినందుకు, తోక నుసిమిరికి తోకగురుజునకు పనిచేయును. కలబందమట్టను ఉడి కించి పసుపుతోనూరి కట్టినచో వాతరోగమువలన కలిగిన వాపులకు మోష్లవ్యాధికి పనిచేయును.

రసము పావుగొట్టము మొదలు అరగొట్టమువరకు.

కటకరోహిణి - Hellebore:—సం: కటుకా, హిం: యూ: కుట్కీ, అర: పీతరోహిణి. ఇదియొక చెట్టువేరు. నలుపు తెలుపు అని రెండురకములు. ఇది విషవస్తువు. యెక్కువ మోతాదు నీయరాదు. ఇది చేదుగ వెగటుగ నుండును. గాఢవిరేచనకారి. దీనినుండి అరఖుతీయుదురు. తెల్లకటకరోహిణి గాఢ విరేచనకారి. నల్లకటకరోహిణి జ్వరములకు పనిచేయును. పశువులకు కలుగు కఫసంబంధమైన వ్యాధులకు, వాతమునకు చర్మరోగములకు వాడవలెను.

మోతాదు:—అరతులము మొదలు తులమువరకు.

కచ్చూరములు-Curcuma zedoary:—సం: కచ్చూరకః, హిం: యూ: కచూర్, అర: పేరీచ్. ఈ మొక్కలు బంగాళాదేశమునందేగాక చీనా మొదలగు నేషియా ఖండము నందలి యితరదేశములలో గూడ పెరుగుచున్నవి. ఈ మొక్క వేసవికాలమందు పుష్పించును. దీని వేళ్ళను ముక్కలుగా గోసి యెండబెట్టుదురు. ఇవియే కచ్చూరములు. వీనికి మంచి పరిమళము గలదు. ఇవి చేదుగా వెగటుగానుండును. వేడిజేయును. పశువులకు కలుగు వాతరోగములకు, మలబద్ధమునకు వీనిని వాడుదురు.

కవిరి -Acacia Catechu—సం: ఖదిరసారః, హిం: యూ: ఖైర్, కత్థా, అర: కాసికట్టి, వోదలై. దీనినే కొన్ని ప్రాంతములందు కాంచు అందురు. దీనినే పోకచక్కలపై నుండుమడ్డి యందురు. ఇదిసామాన్యముగా బజారులో దొరకువ

స్తువై యున్నది ఇది వెగటుగ వగరుగనుండును. కవిరి చలువచేసి ఆర్చును. పశువులకు కలుగు విరేచనములు, రక్తాతిసారము, సరకు, అజీర్తి, నోటిపూత మున్నగువ్యాధులకు గ్యారంటీగా పనిచేయును.

మోతాదు:-తులము మొదలు 3 తులములవరకు.

కోష్టు—Costus:—సం: కుష్ఠం, హిం:యూ: కుడ్, అర: గోష్టర్, చంగల్వకోష్టు అందురు. ఇదియొక చెట్టువేరు. దీనిపొడి చేదుగా వెగటుగా సువాసనగా నుండును. వేడిచేయును. పశువులకు కలుగు వాతరోగములకు,జ్వరములకు, చర్మరోగములకు పనిచేయును.

మోతాదు:-తులము మొదలు 5 తులములవరకు.

కసివింద—Cassia Occidentalis:—సం: కాసమర్దః, హిం:యూ: కస్సొంజా, అర: కసవెంద, కసింత, కసింద అందురు. ఈమొక్కలు రాతినేలలందును, డొంకలమీదను విరివిగా పెరుగును. లేతకొమ్మలు కొంచెమెత్తగానుండును. పువ్వులు కొంచెము పసుపురంగుగలిగి యుండును. ఆకులరసము చేదుగనుండును. కాకజేయును. నరములకు బలముగలిగించును. దీనిఆకు పశునేత్రరోగములకు బాగుగా పనిచేయును. దీనియందు క్రిమిసంహారకశక్తి గలదు.

మోతాదు:— తగినంత ఉపయోగించవలెను.

కరివేప - Curry leaf tree:—సం: కాలశాకః, హిం: యూ: మీఠానీమ్, అర: కరివేప్పిలై. ఈచెట్లు మనదేశమునం దంతటను పెరుగుచున్నవి. రాతినేలలయం దెక్కువగా

పెరుగును. ఆకులు సువాసనగా నుండును. ఆకురసము సువాసనగ, వగరుగ, చేదుగ నుండును. ఈఆకును గొడ్డుమోతుపశుగలకు చూడికట్టుటకు విస్తారముగ వాడుదురు. దీనిలో క్రిమిసంహారమగు గుణమున్నది. ఆకురసము చలువచేయును.

కలకండ - Sugar candy:—సం: ఫణికా, హిం: యూ: మిస్రి, అర: కర్కందు. దీనినే పటికిబెల్లము అందురు. తీపిగా నుండును. వేడిజేసి చలువజేయును. మూత్రము గావించును. ఇది వంటసంబంధమైన పదార్థము. పశువులకు కలుగు నేత్రవ్యాధుల కుపయోగపడును.

మోతాదు:—తులములగాయతు 3 తులములవరకు.

కల్లు - Toddy:—సం: సురా, హిం: యూ: శరాబ్, శేంద్రీ, అర: కళ్ళు. దీనిని తాటి, కొబ్బరి, ఈత మొదలగు చెట్లనుండి తీయుదురు. పుల్లగా తియ్యగా నుండును. కల్లుమలమూత్రముల గావించును. చలువచేయును. కల్లులన్నిటిలో కొబ్బరికల్లు శ్రేష్టమైనది. దీనిలో అతివేడిననుచు స్వభావము గలదు. పశువులకుకలుగు వాతరోగములకు, పారుడురోగములకు పనిచేయును.

మోతాదు:—అర్థశేరు లగాయతు శేరువరకు.

కలినీరు - Acid whishings of raw rice:— బియ్యములో నీరుపోసికడుగగా వచ్చిననీటినే సామాన్యముగా కలినీరందురు. ఈనీరు కొంచెము పుల్లగా, స్వాదుగా నుండును. చలువజేయును. పశువులకు కలుగు కాకరోగము లన్నిటి కుపయోగించును.

మోతాదు:-అర్ధ శేరులగాయతు శేరువరకు.

కరిధూపము - Vegetable black:—ఇది నలుపువర్ణముగ నుండును. పూరిండ్లలోపలి కప్పుభాగమున కెక్కువగా పట్టును. వేడిజేయును. పశువులకు కలుగు తిరుగుడురోగము, గుఱ్ఱపువాతము, దొమ్మరోగములకు పనిచేయును. పుండ్లకు గూడ పనిచేయును. ఇది దీపపుమసి. ఇది మిగుల కొత్తగా నుండును.

మోతాదు:-తులములగాయతు 3 తులములవరకు.

కురాసానివాము – Black henbane seeds :—సం: యవానీ, హిం: యూ: ఖురాసాని అజ్ వాయన్ . అర: ఖురాసాని ఓమము. ఈచెట్లు హిమాలయప్రాంతములలో బెరుగుచున్నవి. దీనిలో మత్తుగలిగించు గుణము కలదు ఈమొక్కలు గుబురుగా పెరుగును. దీనిలో రెండురకములు గలవు. ఒకటి తెల్లని పువ్వులు గలది. రెండవది కొంచె మెఱ్ఱనిపువ్వులు గలది. దీనిలో తెల్లపువ్వులుగల చెట్టే మంచిది. దీని కాయలనుండియు గింజలనుండియు నెఱ్ఱనిరంగు వచ్చును. ఈరంగుతో పట్టుబట్టలకు రంగువేయుదురు. దీనిగింజలు, వేరు, బెరడు ఔషధములలో వాడుదురు. ఈవాము విరేచనము గావించును. ఈగింజల రసము తీసి పశువులకు కలికెము వేసిన మగతపోవును. దీనిని ఎక్కువ మోతాదులుగ వాడరాదు. పశువులకు కలుగు వాతరోగములకు, జీర్ణసంబధ మైన జాడ్యములకు పనిచేయును.

మోతాదు:—తులములగాయతు 3 తులములవరకు.

కుంకుమపువ్వు-Saffron:—సం: కేసరీ, హిం: యూ: కేసర్, జాఫ్రాన్ రీతా, అర: కుంగుమపూ. ఈచెట్లు కాశ్మీర దేశములోనే పెరుగుచున్నవి. ఈమొక్కలు శీతలదేశములో పెరుగును. మనదేశములో నంతగ లేవు. వీనిలో నన్నియు గుల్మములే గాని పెద్దచెట్లు లేవు. ఈచెట్లు పూర్వకాలము నుండి మనదేశమున కలవు. దీనిని మందులలో వాడుచున్నారు. కాని కొందర రంతగా పనిచేయుటలే దని చెప్పుచున్నారు. వీని పుష్పములు మిక్కిలి అందముగను, పరిమళముగ నుండును. వీటినుండియే కుంకుమపువ్వు తయారు చేసెదరు. పువ్వులను గోసి ఎండబెట్టి పువ్వులలోనుండు మధ్యకాడలను తుంచి వేసెదరు. ఇదియే మేలైన కుంకుమపువ్వు. దీనివెల తులము రూపాయిన్నర మొదలు రెండురూపాయల వరకుండును. రాజులును, ధనవంతులును దీనితో బొట్టుపెట్టుకొందురు. బహుశా దీనిని బట్టియే సాధారణముగా బొట్టుపెట్టుకొనుదానికి కుంకుమ యని పేరువచ్చియుండును గాని కుంకుమపువ్వు దీనియం దణుమాత్రములేదు. ఒకొక్కప్పుడు కుంకుమపువ్వులో కుసుంబా పువ్వు కలిపి దగాచేయుదురు. కాని కుసుంబాపువ్వునకుగూడ మంచి సువాసనగలదు. కుంకుమపువ్వు చేదుగా, స్వాదుగ, వెగటుగా, మనోహరముగా, జిగటగా నుండును. ఇది చలువ జేసి ఆర్చును. పశువులకు కలుగు చర్మవ్యాధులకు, నేత్రవ్యాధులకు పనికివచ్చును.

కస్తూరిపసుపు – Cuncuma longa a sart of :—సం: గంధహారిద్రా, హిం: యూ: కపూర్ హల్దీ, అర: కస్తూరిమంజళ్.

ఇది పసుపువలెనే యుండి సువాసనగ చేదుగ నుండును. కాక జేయును. పశువులకు కలుగు చర్మవ్యాధులకు, కణతులకు, వ్రణములకు అమోఘముగా పనిచేయును.

కోడిగుడ్లు-Fowl eggs:—ఈగుడ్లను వాడునప్పుడు రెండుమూడుదినముల క్రిందట పెట్టినవాని నుపయోగించవలెను. రుచిగ నుండును. కోడిగ్రుడ్లు రక్తమును వృద్ధిచేయును. గుడ్డులోనుండు తెల్ల సొనను మంచినూనెలో కలిపి పశువుల కాళ్ళకు సంభవించు ఆకస్మికపు దెబ్బలకు పట్టువేసిన యెడల వెంటనే సుగుణమిచ్చును. సొన చలువజేసి ఆర్చును. ఇంకను బశువులకు కలుగు చెల్లి, చర్మవ్యాధులకును, బుడ్డకొట్టిన తరువాత బలముకలుగజేయుటకును వాడుదురు. పశువులకు విషముపెట్టినచో ఈగుడ్లలో తెలుపులు తీసి గంజిలోగాని, పాలలోగాని కలిపిపెట్టిన విషము విరుగును.

మోతాదు:-ఒకగుడ్డు లగాయతు 4 గుడ్లవరకు.

కోడినెత్తురు-Blood of fowl :—కోడిరక్త మెఱ్ఱగా నుండును. మిగుల వేడిజేయును. పశువుల అవయవములలో యేభాగమైన విరిగినయెడల వెంటనే కోడిని కోసి ఆనెత్తురు గుడ్డకు పట్టించి విరిగినభాగమునకు చుట్టవలెను. ఆకట్టు వారముదినములవరకు తీయరాదు తరువాత తీసి మరల ఉత్తరేణి ఆకు నూరికట్టిన నెమ్మదించును.

కోడిరెట్ట:—అప్పుడు వేసిన పచ్చికోడిరెట్ట తీసికొని అర్ధశేరు వేడినీటిలో కలిపి త్రాగించిన పశువులకు కలుగు

కడుపుబ్బు, చలిదొమ్మ, గుఱ్ఱపువాతము మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును.

కొఱ్ఱలు - Italion millet:—సం: కంగు, హిం: యూ: కాంగనీ, కాంగూ, అర: తియొనెమ్. వీనిలో పసుపు, తెలుపు, నలుపు రంగులుగల నాలుగు జాతులు గలవు. మెరక భూములలో పైరగును. ప్రత్తిచేలలో తరచుగా వేయుదురు. రాగులు, సజ్జలకంటె కొఱ్ఱలు శ్రేష్ఠమైనవి. పాడిపశువులకు నీ గింజలుపెట్టిన నవి యెక్కువ పాలిచ్చును పాలు, పెరుగు నమ్ముకొను గొల్లలు ఈధాన్యము నెక్కువగ పెట్టుదురు. అందువలన పా లెక్కువగును. కొఱ్ఱలు కాకజేయును. రక్తమును వృద్ధిచేయును. కొఱ్ఱచొప్పను పశువు లంతగా దినవు.

కుక్కపాల - Country Ipeca:—సం: వటపత్రికా; హిం: యూ: జంగ్లీపికాక్, అర: నాయిపాళై, నచ్చిరుప్పాక్. దీనినే వెఱ్ఱిపాల యందురు. దీని ఆకుపసరు రక్తవిరేచనములకు, దొమ్మలకు అద్భుతముగా పనిజేయును.

కళిసితీగె:—ఇవి తీగెలు తీగెలుగా నల్లుకొనును. దీని ఆకులు చిన్న తమలపాకులవలె నుండును. రక్కెస పొదల మీద నెక్కువగానుండును. కాయలు దుష్టుపుకాయలవలె జంటలుగ నుండును. ఇవి ఎండి పగిలినపుడు దీనిలోనుండి జిల్లేడు దూదివంటి దూదివచ్చును. పగిలినకాయలు నాగుపాము పడగ వలె నుండును. ఈచెట్టుఆకురసము కల్లవాపులకు, వాతనొప్పులకు, పశువులమెడమీద కలుగు అరుపుపులకు పనిచేయును.

కందులు Red gram:— సం: ఆఢకీ: హిం: యూ: అర్హర్, అరతువరై: మన దేశములో పప్పునిమిత్తము ఎక్కువగా వాడబడుచున్నవి. ఆఫ్రికా, వెస్టుఇండియా ద్వీపములలోగూడ పైరు చేయబడుచున్నవి. ఇసుక భూముల లోను గరపభూములలోను చెట్లు పెరుగును. గాని పంటపండదు. దీనికి నల్లభూములే శ్రేష్ఠము. జొన్న, బుడమ, నువ్వులు, బొబ్బర్లు మున్నగు వానితో కందినికలిపి జల్లుదురు. కంది కంపను వంటచెరుకుగను, దొడ్లకు కంచెలగ నుపయోగింతురు. కందిగింజలను అరగదీసి కండ్లకు పెట్టినచో పశువులకు గలుగు నేత్రవ్యాధులకు పనిచేయును. ఈ గింజల నెక్కువగా కండ్ల వెంట నీరుగారుచుండు పశువులకు గంధముతీసి వేయవలెను.

కావిరాయి Red Ochre:— సం: రక్తగైరికం, హిం: యూ: గిలేముఖ్తుం, అర: సెంగావి. వీనిలో కొన్ని ఎరుపుగను, మరికొన్ని పసుపురంగుగ నుండును. ఇవి ఒక విధమైన రాళ్లు. ఇవి తీపిగా, వగరుగా నుండును. కొన్నిదేశములలో బీదవాండ్రు ఈరాళ్లను తిందురు. ఆకలిని అణచివేయు గుణ మున్నది. పశువులకు కలుగు రక్తమూత్రము, రేచీకటి, మొదలగు నేత్రవ్యాధులకు ఈరాయి అరగదీసి వాడవలెను.

మోతాదు:—ఒకగొట్టము లగాయతు రెండుగొట్టములవరకు.

కొబ్బరి Cocoanut:— సం: నారికేళ, హిం: యూ: నారియల్, అర: తెంగాయ్. పచ్చికొబ్బరి కాకచేసి అర్పును. చమురుగలిగి రుచిగానుండును. పశువునకు ఆకస్మికముగా గలుగు జీర్ణసంబంధములైన జాడ్యములకు పనిచేయును. కొబ్బరిని

కోరి పసుపుకలిపి కట్టినయెడల పశువునకు కలుగు శేరువాపు నకు పనిజేయును.

కొబ్బరిపిండి-Cocoanut flour:— బొంబాయిలో కొబ్బరిపిండి విశేషముగా తయారుచేయబడుచున్నది. మలబారునుండి కొబ్బరికాయలు బొంబాయికి గొనిపోబడుచున్నవి. అచ్చట వానిని చిప్పలుగా గోసి యెండబెట్టి చమురుదీయుదురు. చమురు దీయగా మిగిలినపిప్పి పశువుల కాహారముగా వాడబడుచున్నది. ఈపిప్పి పాడిపశువులకు పెట్టినచో పాలెక్కువగ నిచ్చి వెన్నను కలుగజేయును. ఈపిండి పశువులకు మంచియాహారమైనను ధరయందు ప్రత్తిపిండికంటె చౌకయైనది కాదు. ఈపిండివలన పాలు తక్కువయైనను విస్తారము వెన్నను కలిగియుండును.

కొబ్బరిపాలు Cocoanut milk:—ఈపాలు రుచిగా నుండును. పశువులనోటి దుర్గంధము పోగొట్టును. పశువులకు కలుగు అజీర్తి కడుపుబ్బు పారుడురోగము మున్నగువ్యాధులకు ఈ పాలు బాగుగా పనిచేయును. ఈపాలు కాకజేయును.

మోతాదు:-అరసోలెడు లగాయతు సోలెడువరకు.

కొబ్బరినూనె-coconut oil:— దీని నేకొబ్బరినెయ్యియందురు. రుచిగా నుండును. జీర్ణశక్తి బలము కలుగజేయును. సమస్తమైన పుండ్లను మాన్పును. పశువులకు కలుగు అజీర్తి, ఘాతరోగములు, బెణుకునొప్పులు, కర్ణరోగములు, కాలినబొబ్బలు మొదలగువాని కుపయోగపడును.

మోతాదు:-పావుశేరు లగాయతు అర్ధశేరువరకు.

కుడితి-Rice washings.—పాడిపశువులకు బియ్యపుకుడితి జొన్నకుడితి, గంజి, మజ్జిగ తవుడు కలిపినకుడితి మొదలగునవి ఉదయసాయంకాలములందు పాలుపితుకక పూర్వము పెట్టుదురు. ఈకుడితి పెట్టుటచే పశువులకు సంతోషము కలుగును, పశువు పాలున్నంతవరకు బాగుగాచేపును. నిలవయున్నకుడితి త్రాగినచో పశువులకు రోగములు సంభవించును.

కొవ్వు- Fat:—దీనిని మలాములలో ఎక్కువగా వాడుదురు. ఇది పొక్కిన ప్రదేశములమీద పూయుటకును, కోమలములైన భాగములకు గాలి తగులనివ్వక రక్షించుటకును మిగుల నుపయోగకారి. పశువులకు కలుగు కణుతులకు, చర్మవ్యాధులకు దీనిని వాడుదురు.

కొడిశపాల- Anti-dysentricum:— సం: ఇంద్రయవః, హిం: యూ: తెసానుల్, ఆసాఫీర్, అర: కొడిశపాలై. దీనిని పాలకొడిశె చెట్టనిన్నీ, పెద్దఅంకుడు చెట్టనిన్నీ యందురు. ఈ చెట్లు మనదేశమునందంతటను పెరుగుచున్నవి. దీని బెరడు గింజలు ఔషధములలో చిరకాలమునుండి వాడుచున్నారు. దీని కలపతో దువ్వెనలు, బొమ్మలు మొదలగునవి చేయుదురు. దీనిగింజలనుండి నూనె తీయుదురు. ఈ నూనెను వాతనొప్పులకు, చర్మవ్యాధులకు విస్తారముగా వాడుదురు.

కుంకుడు-Sanpindus:—అరిష్టః, హిం: యూ: రీఠా, అర: పొంగాంకొట్టై. ఈ చెట్లు మనదేశములలో చాలచోట్ల పెరుగుచున్నవి. పుష్పములు వాసనగానుండి చిన్నవిగా నుండును. దీని కాయలరసము చేదుగ నుండును. ఈ రసము పశువులకు త్రా-

గించిన ఉష్ణము కలిగించును. చర్మము చీడకలిగి యుండునపుడు గాని, లేక పేనుపట్టియుండు నపుడుగాని చీడకు మందురాచి నపుడుగాని ఈ కాయరసముతో దేహము కడుగుట చాల మంచిది. పశువుల తోకలకుగలుగు నుసిమిరి, గురుజు మున్నగు వ్యాధులకు నాచే తయారుచేయ బడిన తోకక్రిమిసంహారిణియను మలాము మర్దనచేసి ఈకుంకుడుకాయ రసముచే మురికిపోవునటుల రుద్దవలెను. ఈరసము వేడిచేయును. దొమ్మ రోగమునకు ఈరసము వకటి రెండు గొట్టములు పోసినవెంటనే నివర్తియగును.

కుప్పింట - Acalypha Indica:— సం: హరితమంజరీ, హిం: యూ: కుపి, అర: కుప్పామణి. ఇది ప్రతిసంవత్సరము లేచెడి చెట్టు. ఈమొక్క లెక్కువగా కాలువగట్లమి దను, దొడ్లలోను మొలచును. దీని ఆకు మూరొ్కండాకువలె నుండును గాని దానికంటె కోలగ మృదువుగనుండును. దీని ఆకుపసరు పశువులకు కలుగు దొమ్మ, పీనస, చర్మరోగముల కమోఘము గా పనిచేయును.

పసరు మోతాదు:-అరగొట్టము మొదలు గొట్టమువరకు.

కుసుంబ - Carthames Tinctorius:—సం: కుసుంభః, హిం: యూ: కుసుమ్, అర: కుసుంబమరం. ఈమొక్కలను బొంబాయి, బంగాళాదేశములందు గొన్నిచోట్ల పైరు చేయుచున్నారు. దీని ఆకు వెడల్పుగ నుండి బల్లెపు అకారముగ నుండును. తొడిమలేదు. ఈమొక్కలు గరపనేలలందు పెరుగును. ఈ చెట్టు గింజలనుండి ఒక విధమైన నూనెను తయారు చేయుదురు.

దీని పువ్వులను, నూనెయును పశువులకు కలుగు వాత నొప్పులకు చర్మవ్యాధులకు పనికివచ్చును.

కారింగువ-A sort of Assafoetida:—ఈ చెట్లుచిన్నవి. పువ్వులు పెద్దవి. వికసించినపుడు తెల్లగా నుండును. కాని క్రమక్రమముగా పచ్చబడును. కారింగువ ఒక విధమైన జిగురు. మలబద్ధకము పోగొట్టును. పశువులకు కలుగు చర్మవ్యాధులకు బెణుకు నొప్పులకు వాడుదురు.

కారము-Chillies Powder:—బాగుగ పండి యెండిన మిరపకాయలనుండి తయారుచేసిన పొడి. కాక జేయును. విరేచనముగావించును, వాతము నణచును. చర్మరోగములకు వాడుదురు

కానుగ-Pongamia glabra:—సం: కరంజః,హిం:యూ: కరంజ్, అర: పుంగమరం. దీని చెక్క ఆకు రసము చేదుగనుండును. ఈ కానుగ జాతులలో ఆరురకము లుండును. ఈ చెట్టు గింజలనుండి నూనె తీయుదురు. ఈ నూనె చేదుగ నుండును. కాక జేయును. చర్మవ్యాధులకు గ్యారంటీగా పనిచేయును. ఆకుల రసము కడుపుబ్బు, విరేచనములకు పనిచేయును. దీని విత్తులు పెరుగులోనూరి దూడలకు కలుగు గజ్జికి రాయుదురు. దీని ఆకులు నూరి కట్టిన పురుగులుపడిన వ్రణములకు పని చేయును.

కాడజెముడు- Milk Hedge :—ఈచెట్టంతయు ఆకు పచ్చరంగుగనుండును. ఇవి క్రిందకు త్వరగా రాలిపోవును. కొన్నిచోట్ల కాకులను చంపుటకు దీని పాలతో అన్నము కలిపి పెట్టు

దురు. దీని పాలు కారముగ చేదుగ నుండును. మిక్కిలివేడి జేయును. ఈ పాలు పశువులోపలికి ఎక్కువ మోతాదు నీయరాదు. అట్లిచ్చినయెడల పేగులకు అపాయము కలుగజేయును. పశువులకుకల్గువాతరోగములకు, దంతరోగములకు పనిచేయును.

కాడివేప :— దీనినే మేకమెత్తనిదుంప లందురు. ఇవి మెట్ట, మాగాని పొలములలో నెక్కువగా నుండును. ఈదుంపలు తెచ్చి మేకపాలలోగాని ఆవుపాలలోగాని, రుబ్బి ఉడికించి పట్టువేసినచో పశువులకుకలుగు అట్టువాపులకు పనిచేయును. దీనిఆకు అంచులు గరకుగ నుండును. తాడిచెట్లమీదను, తదితరచెట్లమీదను ప్రాకును.

కాకర - Momardica charantia :— సం: కారవేల్లః, హిం: యూ: కరేలా, అర: పాక్కాయ్. ఈమొక్కలు అన్ని దొడ్లలోను కంచెలమీదను పెరుగును. దీనికాయలు కూరగా వండుకొందురు. దీని ఆకురసము వెగటుగ చేదుగ నుండును. వేడిజేయును. ఆకులు విషజంతువుల కాట్లకు పనిచేయును. పశువులకు కలుగు నేత్రరోగములకు చర్మవ్యాధులకు పనిచేయును.

కామంచి- Solanum Nigrum:— సం: కాకమాచీ, హిం: యూ: మకోయ, అర: మనత్తంగాళి. దీనిని కాంచిచెట్టు లేక కాసరచెట్టని చెప్పుదురు, ప్రతిసంవత్సరము లేచెడుచెట్టు. ఆకురసము వేడిజేయును. విషజంతువుల విషము హరించును. విరేచనము గావించును. దీనిపండ్లు నల్లగ, పసుపుపచ్చగ, ఎఱ్ఱగ

నుండును. ఈఆకురసము పశువులకు కలుగు చర్మవ్యాధులకు, పురుగుముట్టినందుకు లోపలి నులిపురుగులు చచ్చుటకు నుప యోగింతురు.

మోతాదు:—అరగొట్టములగాయుతు గొట్టమువరకు.

కాజచెట్టు:—ఈచెట్లు మాగానిపొలములలో నెక్కువగా పెరుగును. దీని అడుగుభాగమున దుంప లుండును. ఈ దుంపలు తెచ్చి మేకపాలలోగాని, ఆవుపాలలోగాని రుబ్బి ఉడికించి పట్టువేసినచో పశువులకు కలుగు అదుగ్రివాపులకు వ్రణములకు బాగుగా పనిచేయును. ఈదుంపలు ఉల్లిపాయవలె పొరలుపొరలుగ నుండును.

## ఖ

ఖర్జూరకాయలు— Edible date fruit:—సం: ఖర్జూరః హిం: యూ: ఖజూర్, అర: పేరీచ్చంపష్టం. ఖర్జూరపుచెట్టు మన దేశములోకెల్ల సింధు, గుజరాతు, బండెలుఖండు, పంజాబు రాష్ట్రములలో బెరుగుచున్నవి. వీనికి సరియగు శీతోష్ణస్థితి కుదురుట కష్టము. పుష్పించుకాలమునందుగాని, కాయలుపండబోవునపుడుగాని వర్షము కురిసినచో పండ్లు పండవు. మరియు నీచెట్లకు ఉష్ణము ఎక్కువగా కావలయును. పండ్లు తినుటకు చాల రుచిగ నుండును. కాని చెట్టున పండిన పండునకు బదులుగ బజారులందు బెల్లపునీటిలో నానవేసిన వాటిని అమ్మెదరు. ఖర్జూరచెట్లనుండిగూడ కల్లు, పంచదార తయారు చేయుదురు. కాకజేసి ఆర్చును. పశువులకు కలుగు రక్తభేదులకు, వాతరోగములకు, నేత్రములకు పనిచేయును.

గంజాయి- Cannabis Sativa:—సం: విజయా, హిం: యూ: భాంగ్, గంజా, అర: వంగి, కంజా. దీనినే జ్ఞానపత్రి యందురు. ఇవి చిన్న మొక్కలుగా పెరుగును. ఇవి హిందూస్థానమునందే పెరుగుచున్నవి. వీనికి సారవంతములగు ప్రదేశములు కావలయును. ఈ మొక్కలు పది పండ్రెండడుగులు యెత్తువరకు బెరుగును దీని ఆకులు పూవులు కాయలు ఔషధములలో వాడుదురు. దీనిని అందరు సేద్యము చేయుటకు వీలులేదు. గవర్నమెంటువారి యనుమతిని బొందవలెను. ఈ మొక్కలనుండి యొక విధమైన నారయును, గింజలనుండినూనెయు తయారు చేయుదురు. దీని ఆకులు అభినివలెనే నొప్పులు నివారించుటయం దమోఘమైనమందు. అభిని (నల్లమందు) దొరకని సమయములందు దీనిని పశువులకు వాడుదురు.

పశువులకు పెద్దరోగము తగిలి పారు డెక్కువగానున్న స్థితిలో గంజాయి సీమకున్నము కవిరి మాచికాయలు పొడిజేసి అర్ధశేరు నూకలజావలో కలిపిపెట్టినయెడల పారుడుకట్టును. దీని విత్తులను కోళ్ళకు తినిపించిన విస్తారముగ గుడ్లను పెట్టును. కొన్ని పక్షులకు తినిపించిన వాని రంగు మారును.

మోతాదు :—తులము లగాయతు ౩½ తులములవరకు.

గంజి Gunjee:—వరిజొన్న మొదలగు ధాన్యములు వండినపుడు వార్చగావచ్చిన సారపునీటిని గంజి యందురు. ఈగంజినీరు పశువులకు కలుగు వ్యాధులకు తదితరమందులతో కలిపిగాని విడిగాగాని త్రాగించెదరు.

మోతాదు :-- పావుశేరు లగాయతు 2 శేరులవరకు.

గండఫెరోజా- Galbanum of Ganda Biroza:— సం: సరళస్రావః, హిం: యూ, సరల్ కీగోండ్, పారిషి: బీజదు. దీనినే సీమదేవదారుబంక యందురు. ఇది కొంచెము ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగు కలదిగా నుండును. ఇది యించుమించుగ ఇంగువగుణము గలది. ఈబంకను గ్లిసరిన్ లోగాని, కొబ్బరినూనెలోగాని, గంగసింధూరములోగాని కలిపి పట్టించిన కంతులు కరుగును. పగులనిగడ్డలను పగులగొట్టును. పశువులకు కలుగు కొమ్ములు విరుగుట, మాదలకు, మొరడుగాయములకు నుపయోగించును.

గోధుమలు- wheat:—సం: గోధూమః, హిం: యూ: గెహూ, అర: గోదుమై. ఇవి సమశీతోష్ణప్రదేశములలో పైరుగును. గోధుమలు నిక్కలి బలమైన ఆహారము. ఉత్తరహిందూస్థానములోని జనులు ముఖ్యముగా గోధుమ ఆహారమును తినుచున్నారు, పైరు వర్షాధారముచేత నల్లభూములలో పైరగును. బుడమ, సెనగ, మినుము మొదలగునవి కలిపి గోధుమలను చల్లవచ్చును. గోధుమలకు ఎముకలపొడి, ఆముదపుపుచ్చునూ రేకారము ముఖ్యమైన ఎరువులు. పశువునకు గోధుమ గంజిగాని, జావగాని పెట్టిన వంటినీరు దీయును. వేడిజేయును.

గంటెలు- Holcus spicatus:— ఇదియును మెట్టపైరే యైయున్నది. గంటెచొప్పను పశువు లంతగా తినజాలవు. కొఱ్ఱచొప్పంత శ్రేష్ఠమైనదిగాదు. గంటెజావ స్వాదుగానుండి బలము గలిగించును. ఈనిన పశువులకు ఈజావపెట్టిన పాలెక్కువవడును.

గంగసింధూరము— Red led:— సం: సిన్దూరం, హిం: యూ: సింధూర్, అర: చెందూరం. దీనిని సీసముతో తయారు చేయుదురు. పశువులకు కలుగు కణతులకు, చర్మవ్యాధులకు, అరుగ్రివాపులకు గండభేరోజలో కలిపి మర్దించినవెంటనే నివారణమగును.

గంటుభారంగి - Clerodendron:— సం: అంగారవల్లిః హిం: యూ: భారంగీ, అర: భంగి. ఈమొక్కలఆకులు, కాడలు, వేరు చేదుగా నుండును. పశువులకు కలుగు వాతరోగములకు శ్వాసరోగములకు పనిచేయును.

మోతాదు:—తులములగాయతు 3 తులముల వరకు.

గోరోజనము-Biliary calaculus of cow or ox:— సం: రోచనీ, హిం: యూ: గోరోచన్, అర: గోరోజనం. ఇది ఆవులేక యెద్దు పిత్తకోశములలో పచ్చనిగడ్డలుగ పుట్టించబడును. ఇది వెగటుగ నుండును. వేడిజేయును. నరములకు సత్తువ నిచ్చును. విషజంతువుల కాట్లకు పూసిన నెమ్మదియగును. ఇంకను పశువులకు కలుగు వాతరోగములకు, శ్వాసరోగములకు పని చేయును.

గలిజేరు - Trianthema:— సం: పునర్నవా, హిం: యూ: విషఖపరా, అర: షరున్నాయ్. వీటిలో తెల్లగలిజేరు యెఱ్ఱగలిజేరు అని రెండువిధములు గలవు. వీనిలో తెల్లగలిజేరు ఎక్కువగా పనిచేయును. రసము వెగటుగను చేదుగ నుండును. వేడిజేసి ఆర్చును. విరేచనము గావించును. పశువులకు కలుగువాతరోగ

ములకు, దొమ్మలకు, కామెర్లకు, శేరుమాదకు, ఎముకలు విరిగి నందుకు దీనివసరు వాడుదురు.

మోతాదు:—ఒకపిడికెడుల గాయతు 2 పిడికెళ్ళఆకురసము.

గచ్చ- Caesalpinia:— సం: కుబేరాక్షి, హిం: యూ: కటుకలిజా, అర: కజరుషికాయ్. ఈమొక్కలు అన్నిచోట్లను పొదలవలె గుబురుగా పెరుగును, ముండ్లుండును. దీనిలేతఆకులు, చిగుళ్ళు, వెగటుగ, చేదుగ నుండును. దీని వేరురసము వెగటుగ నుండును. ఈచెట్టుకాయలలోని పప్పు పశువులకు గలుగు ఒగర్పు, దగ్గుకు, తేలుకాటునకు పనిచేయును. దీనిఆకు ఆముదములో వెచ్చచేసికట్టిన గాలిబుడ్డవాపు, శేరువాపు మొదలగువానికి పనిచేయును.

గోరింత - Henna:—సం: కురంటకం, హిం: యూ: ఇన్ బంద్, అర: మరుతోండి). ఈచెట్లు చాలాచోట్ల గుబురుగా పెరుగుచున్నవి. ఈచెట్ల యాకులనుండి ఒకవిధమైన రంగు వచ్చును. దీనిఆకును నిమ్మరసముతో నూరి కట్టిన పశువులకు కలుగు మలిమిడి కుంట్లు, మెత్తగాళ్లు మున్నగునవి నివారణ మగును. పచ్చియాకును నూరి పశువులకు అందముకొరకు అవయవములమీద రాయుదురు.

గుంటకలగర- Verbesina:— సం: భృంగరాజః, హిం: యూ: భంగరా, అర: కరిశారంకణ్ణిం. ఇవి నీరు విస్తారముగా నుండుచోట్ల పెరుగు చిన్నచెట్టు. దీనియందు నలుపు, తెలుపు, పచ్చ రంగులుగల పువ్వులు పూయుటచే త్రివిధములుగా నున్నది. తెల్లనిపూవులు పూయునది విస్తారముగా దొర

కును. నల్లనిపూవులు గలది దొరకుటకష్టము. ప్రస్తుతము తెల్ల గుంటకలగరే మంచిది. దీనిఆకు చేదుగనుండును. వేడిజేయును. దేహములోని మలమును వెడలించును. పశువులకు కలుగు నేత్రవ్యాధులకు, చర్మరోగములకు పనిచేయును.

పసరు మోతాదు:-తులములగాయతులి తులములవరకు.

గోగు Hibiscus:—సం: పీలుః, హిం: యూ: పీలు, అర: ఫులిచ్ఛ్. ఇదిఅన్ని నేలలయందును పైరగును. నీరు నిలుచునట్టి పల్లపునేలలయందును, వర్షాధారముగల నల్లనేలయందును గూడ బెరుగును. కాని కంకరనేలలయందును, సున్నపునేలలయందును బెరుగవు. దీనియాకులు చిన్నదూడలకు మేపిన బలముకలుగజేయును. పశువులను రైతులుకొట్టు మోటుదెబ్బలకు గోంగోర ఉడికించికట్టిన నెమ్మదియగును.

గినిగడ్డి - Gini grass:—పశ్చిమ యిండియాలో పశ్వాహారములలో ముఖ్యమైనది గినిగడ్డి. ఇది సంవత్సరము పొడుగునను పశువులకు మంచిబలమును, ఆరోగ్యమును యిచ్చు మంచి ఆహారమై యున్నది. ఇది మామిడిచెట్లు మున్నగువాని క్రింద వృద్ధియగును. నీటికాలువ లేక బోదె ప్రక్కలను వేసినచో మన కెట్టి వ్యయ ప్రయాసలు లేకుండగనే పశువులకు ఆహారము లభించును. ఈగడ్డి ఆఫ్రికా దేశమునకు జెందియున్నది. 1793 వ సంవత్సరమునుండి ఇండియాలో వేయుచున్నారు. దుబ్బులు వేసిన మూడు మాసములకే మొదటి కోతకువచ్చును. గజము ఎత్తు పెరుగగనే కోసివేయవలయును. లేనిచో పశువులు తినజాలవు. ఈ గడ్డి పెళుసుగా నుండును. పశువులకు

నూతనముగా వేయునపుడు అంతగా తినవు. పారుకొనును. అలవాటైన కొలది బాగుగ తినును.

గరిక - Cynodon Dactylon:-- సం: దూర్వా, హిం: యూ: దూబ్, దూర్వ, అర: అరుహంపిల్లు. సారవంతములగు భూములలో ఈ గరిక మొలచును. దీని ఆకులు చిన్నవిగను, నునుపుగనుండును. ఈ గడ్డి పశువులకు మంచి ఆహారమైయున్నది. మంచి బలము కలుగజేయును. పాడి పశువులకు మేపిన వెన్న యెక్కువగును. పశువునకు మలబద్ధకము క్రిమిరోగము లున్నయెడల దీనిరసము త్రాగించిన బాగుగా పనిచేయును. గరికరసము చలువచేయును.

గొడ్డుతుంగ:—ఇవి చిన్నగుబురు మొక్కలు, మొక్కకు మూడు నాలుగు ఆకులుండును. దీనిని గేదెలు మాత్రము గతిలేక తినును. కొంచెము వగరుగ నుండును.

గురివెంద - Abrus Precatorius :—సం:గుంజా, హిం: యూ: ఘుంఘుచీ, అర: గుండుమణి. ఈతీగెలు పలుచోట్ల పొదలమీద, చెట్లమీద పాకును. ఇవి ఎరుపు, నలుపు, తెలుపు రంగులుగల మూడుజాతు లుండును. వీనిలో తెల్లజాతి శ్రేష్ఠము. ఎఱ్ఱగురివెంద ఆకులలో గ్లిసరైజిక్ యాసిడ్ ఉండును. ఈగింజ విషము. లోపలికి జాగ్రత్తగా వాడవలెను. దీనివేరు, ఆకు, తీగె రసము తియ్యగానుండునుగాని ఎక్కువ మోతాదుమాత్రము నీయరాదు. వేడిజేయును. పశువులను చంపుటకు మాలమాదిగెలు ఈగింజలలోని పప్పును విషముగా పెట్టుదురు.

గొబ్బి- Asteracantha Longifolia:—సం: ఇక్షురకః. హిం: యూ: తాల్ మఖానా, అర: నీరుముళ్ళి. దీనినే గొలిమిడి చెట్టందురు. ఇవి చిన్నచిన్న మొక్కలు మాగాని పొలములలోనుండు బోదెగట్లమీదను, కాలువగట్ల మీదను, ఎక్కువగా మొలచును. వీని ఆకులు ఆముదముతో వెచ్చజేసి కట్టిన పశువులకు కలుగు నడుము, తొంటి, వెన్నముక మొదలగు భాగములందుండు నొప్పులకు పనిచేయును. గొబ్బిరసము చలువజేయును.

గాడిదగడప- Aristolochia Bracteata :—సం: వృషగంధికా, హిం: యూ: కీడామారీ, అర: అడూతిన్నంపశై. ఇవి చిన్నమొక్కలు. కాలువగట్లమీద తరుచుగ నుండును. అన్ని ఋతువులలోను ఉండును. దీని ఆకులు ఆకుపచ్చ, తెలుపుగల రంగుతోల కలిసియుండును. దీనివేరు, కాడ చాల చేదుగను, క్రొంచెము కారముగ నుండును: పసరు కాకజేయును. పశువులకు కలుగు వాతరోగములకు, జ్వరము, దొమ్మ, పంపర, కల్లవాపులు మొదలగు జాడ్యములన్నిటికిని ఈ ఆకుపసరు గ్యారంటీగా పనిచేయును.

ఆకు మోతాదు —: ఒకటి రెండు గుప్పెళ్లు,

పసరు మోతాదు:— ఒకటి రెండు గొట్టములు.

గంగరావి- Morus Indica:— సం: యూపః, హిం: యూ: పారస్‌పీపల్, అర: పోరిష్. ఇదియొక పెద్దచెట్టు, మనదేశములో అన్నిచోట్లను బెరుగుచున్నవి. దీనికాయలలో పచ్చని రసమున్నది. దీనిచెక్కరసము వెగటుగా నుండును. వేడిజే

యును. దీనికాయలనుంచి తైలము తీయుదురు. ఈతైలము చర్మవ్యాధులకు పనిచేయును.

గారచెట్టు-Balanites Aegyptica:-సం: ఇంగుదీ, హిం: యూ: హింగోట్, అర: శాక్తై. ఈచెట్లు రాతినేలలయందెక్కువగా పెరుగును. దీని కాయలు, పిందెలు, వేరు, చెక్కరసము పశువులకు కలుగు జీర్ణసంబంధమైన వ్యాధులకు అమోఘముగా పనిచేయును. ఈచెట్టు ముళ్ళని తీసికొని పశువులకు కలుగు తోకజాడ్యముల కుపయోగించెదరు. గారచెట్టుకాయలనుండి నూనె తీయుదురు. ఈనూనె విరేచనము గావించును. చలువచేయును. గారపండు వెగటుగ, రుచిగ నుండును. వేడిజేయును.

## చ

చింత-Tamarind tree:-సం: ఆమ్లకోశః, హిం: యూ: ఇమ్లీ, అర: పుళి. మనదేశములో పెరుగు మహావృక్షములలో నిది యొకటి. దీని లేతఆకు, కాయలు మిగుల పుల్లగానుండును. వేడిజేయును. పశువులకు కలుగు కవుకుదెబ్బలకు గాయములకు దీనిఆకు పనిజేయును. ఆకురసము కామాల అనువ్యాధికి పని చేయును. దీని జిగురు బశువుల అవయములు విరిగినచోటను గుడ్డకు పట్టించివేసిన అతుకుకొనును. ఇంకను మొరదువుండ్లకు బెణుకునొప్పులకు ఈజిగురు నుపయోగించవచ్చును.

చింతపండు-Tamarind:-ఇది మిగుల పుల్లగానుండును. వైద్యమునకు సంవత్సరమునాటిది చాలమంచిది. ఇది మిగుల నుపకారి. చలువజేసి తగ్గును. పశువులకు కలుగు సరకు, దొమ్మ, మలబద్ధకము మొదలగు వ్యాధులకు చక్కగా పని

చేయును. ఉంగిడి అను రోగమునకుకూడ ఈ పులుసు నుప యోగించవచ్చును.

చిత్రమూలము- Plumbago Zeylanicum:—సం: చిత్రకః, హిం: యూ: చీతా, చిత్రక్, అర: చిత్రెర. ఈ మొక్కలు అన్నిచోట్లను పెరుగును. ఇది ఎరుపు, తెలుపు, నలుపురంగుపుష్పములుగల మూడుజాతులు. వీనిలో ఎరుపు పువ్వులుగలదిమంచిది. దీని రసము నేవేని మందులతో కలిపి ఈయవలెను గాని పట్టిది యిచ్చిన అపాయము కలుగును. పశువులకు కలుగు బెణుకు నొప్పులకు మలిమికుంటునకు ఆముదముతో నూరి రాయవలెను.

చేదుబీర - Plucketiana:— ఈతీగెలు కాలువ గట్ల మీదను, డొంకలలోను పెరుగును. ఏడాదిలోనే పుష్పించి చనిపోవును. దీనిరసము వెగటుగ, చేదుగ నుండును. నరములకు సత్తువచేయును. విరేచనము గావించును. పశువులకు తిరుగుడు జాడ్యము, తిక్కతెవులు, ధనుర్వాయువు మొదలగు వ్యాధులకు పనిజేయును.

చేదుపొట్ల - Trichosanthes cucumerina:—సం: తిక్తపటోలః, హిం: యూ: కడవీచెచేడా, అర: కళనీపుడలంగాయ్. ఇవి దొడ్లలోను, డొంకలమీదనుండు చెట్లమీద పాకుతీగె. ఈ చెట్టుయొక్క ప్రతిభాగము చేదుగనుండును. దీనిఆకుపసరు పశువులకు కలుగు జ్వరము, చలిజ్వరము, చర్మవ్యాధులకు పని చేయును.

చిప్పగడ్డి - A Kind of grass:—ఈగడ్డి కారముగ, పొదుగ నుండును. వాత్రము నణచును. పశువులకు ఈగడ్డి దివ్యమైన ఆహారము. మంచి కండబట్టును. బలియున. పాడిపశువులు పాలెక్కువయిచ్చును.

చోళ్ళు - Eleusine:— స:రాగి, హిం:యూ: రాగీ,అర: కెల్ వరుగు. వీనిలో ననేకవిధములు గలవు. వీనిని మెట్టచేలలయందును తోటలలోను, నూతినీటి సాయము చేతను గూడ సాగుచేయుచున్నారు. ఇది చాలమంది బీదజనలకై ముఖ్యమైన ఆహారము. దీనిని ప్రత్తితో కలిపి చల్లుదురు. చోడిదంటు పశువునకు ముఖ్యమైన ఆహారము. ఇసుకనేలలయందు పైరగును. ఈమొక్కలు రెండడుగులయెత్తువరకు పెరుగును. కాడకు రెండువైపులనే ఆకులుండును. ఈగింజలనుండి సారాయితీయుదురు. చోడిచొప్ప వరిగడ్డికంటె సారవంతమైనది. అయినను మృదువుగనుండకపోవుటచె పశువు లంతగ తినజాలవు.

చముదుగింజలు:—చముదుగింజలలో క్రొవ్వుపదార్థమెక్కువగా నుండుటచే మాంసకృత్తు లెక్కువగా నుండును. ఈగింజలు బలకరముగాని యాహారపదార్థములతో కలిపిబెట్టబడును. ఎద్దులకు పెట్టబడు ఆహారములలో చముదుపదార్థము లంతగ నవసరములేదు. మరియు ప్రతిపదార్థములోను కొద్దిగనో గొప్పగనో చముదుపదార్థ ముండును చముదు గింజలను విశేషముగ పెట్టినయెడల యందలి చముదు పదార్థము చాలవరకు జీర్ణముకాక మలములో జేరియుండును. చముదు తీసిన పిండిని పశువులకు పెట్టుటకు మంచిది.

చంగలిగడ్డి- A kind of grass:—నేల మీాద చక్కగా పెరుగుచుండును. ఆకులు మిక్కిలి చిన్నవిగ నుండును. అంచులవద్ద మెత్తని రోమములుండును. పశువులకు ఈగడ్డి మేపిన మిగుల బలము కలుగును. పశువులుకూడా బాగుగా తినును. పాడిపశువు లెంతతినిన అంత వెన్నను కలుగ జేయును.

చేపలు-Fishes:—పశువులకు చేపలనుకూడా దాణాగా నుపయోగించుట కొన్నిచోట్ల గలదని వినుటకు చదువరుల కాశ్చర్యముగా దోపకమానదు. ఐర్లాండు ద్వీపమునందును, పెంట్లండు దీవులందును, యెండిన ఉప్పుచేపలను పశువులకును, గొఱ్ఱెలకును, గుఱ్ఱములకునుకూడ మేతగా నుపయోగింపబడు చున్నవి. కోయంబత్తూరు వ్యవసాయ క్షేత్రములలో గూడ కొన్నిపశువులకు ఈ మేతను తదితరదినుసులతో కలిపిపెట్టి పరీక్షించిరి. ఇందువలన చెరుపేమియు లేదని తెలియజేసిరి. చేపలుతినిన పశువునకు వేడిచేసి ఆర్చును.

చేకోణిత- A medicinal plant:— దీనినే సేగుర్తాకు అందురు. ఈ ఆకు పశురోగములకు అమోఘమైన మందు. ఇవి పొలములందును, దొడ్లలోను పెరుగు లతలు. దీని ఆకు కందిచెట్టు ఆకువలెనుండును. వాతరోగములకు గ్యారంటీగా పనిచేయును. సామాన్యముగా ఈ ఆకు నుపయోగించని రైతుండడని నా భావము. ఈ ఆకు వేడిచేసి ఆర్చును.

మోతాదు:—పిడికెడు లగాయతు వీసెడువరకు.

చెరుకుపాలు - Juice of sugar cane :— మనదేశమందు చెరుకు అనేక శతాబ్దములనుండి వాడుకలో నున్నది.

పంచదార చేయుటకు పనికివచ్చు రసమునిచ్చు మొక్కల లో నిది రెండవది. ఈరసము తీయగా నుండును. మిక్కిలి వేడిజేసి చలువచేయును, పశువులకు కలుగు చర్మరోగములు, చల్ది, గేదెవు మరగడమునకు ఈపాలు పనిచేయును.

మోతాదు-:తులములగాయుతు 6 తులములవరకు.

చాగనారమట్టలు - Sansevitra zeylanica:— సం: మూర్వా, హిం: యూ: మరార్, అర: మరూల. దీనిదుంప రసము చేదుగా, కారముగా నుండును. వేడిజేయును. ఈమట్ట లను కాల్చి రసము తీసి దానిలో పసుపు, మిరియాలపొడుము కలిపి కుడితిలోపోసి త్రాగించిన ఎటువంటి రోగమైనను హరిం చును. ఈమాదిరిగా నాలుగె దుప్పూటలు పెట్టవలెను. ఇంకను దీనిమట్ట నుడికించి రసము తీసి చెవిలో పోసిన నొప్పి తగ్గును.

## జ

జీలకఱ్ఱ - Cumin seed:—సం: జీరకం, హిం: యూ: జీరా, అర: శీరగరి. ఇది ఆవాలు, మెంతులు మొదలగువాటి వలె ప్రతిగృహములోను వాడుకలోనుండు వస్తువు. ఇది పైత్య హరకమగు దివ్యౌషధము. దీనిని వైద్యులు పైత్యహరకకర ములును, అజీర్ణ నాశనమును నగు మందులలో వాడుచుందురు. జీలకఱ్ఱ మన దేశములో బహుప్రాచీనకాలమునుండియు వాడు కలోనున్నది. పాంచాలప్రదేశములోను, కపిలగాంధార దేశము లని పురాణ సిద్ధినిగాంచిన ఆఫుగనిస్థానము, బెలూచిస్థానముల లోను నిది విస్తారముగా పైరగుచున్నది, హిందూదేశములోను

బరోడాసంస్థానములోను నూతనముగా పైరు చేయుచున్నారు. దీనినుండి తీసిన చమురు ఔషధముల లోనికి వాడుచున్నారు ఇది పల్లగా నా్వదుగానుండును. వేడిజేయును. పశువులకు కలుగు కడుపుబ్బు, అజీర్తి, వాతము మున్నగువానికిని, మూవితిన్న పశువునకును, పాడిపశువు పాలు చేపుటకున్ను వాడుదురు.

మోతాదు:—తులము లగాయతు 3 తులములవరకు.

జీడిగింజలు - Marking nuts:—సం: భల్లాతకః, హిం: యూ: భిలావా, అర: సేరాంకోట్టై. ఈగింజలు నల్లగనుండును. వెగటుగ, చేదుగనుండి చముదుగలిగి యుండును. ఈగింజల నుండిచమురు తీయుదురు. పశువులకు కలుగు వాతరోగములకు, గొంతు రోగములకు గింజలు పని చేయును. గాయములకు, నుసిమిరికి కూడ పని చేయును, గాని ఎక్కువగా వేసిన పెద్ద పుండగును.

మో:—తులము లగాయతు 5 తులములవరకు.

జటామాంసి- Nardostachys Datamasi:—ఇదియొక విధమైన గ్రంధిదినుసు. కొద్దిగ చేదుగ, సువాసనగనుండును. చలువజేయును. దేహమునకు బలము కలుగజేయును. రక్తమును శుభ్రపరచును. పశువులకు కలుగు వాతరోగములకు పని జేయును.

మోతాదు—:తులము లగాయతు 2 తులములవరకు.

జావ - Gruel:—రోగములతో నున్న పశువులకు దివ్య

మైన ఆహారము. చలువచేయును. పేగులకు అనుకూలముగ ఉండును. సులభముగా జీర్ణమగును.

జనుము - Sun-hemp :— సం: శణః, హిం: యూ: శణ్, అర: శణంబు జనుము. కాయధాన్య సంబంధమైన పైరు. పశువులకు ఆహారముగను, భూసారమున నధికముచేయునది గను, ఇది యత్యంతోపయోగకరమైనది. కొన్నిచోట్ల మనుజులకు ఆహారముగకూడ దీనిపంట నుపయోగపడుచున్నది. కాని మన ప్రాంతములలో నీపైరు ఎక్కువగ భూసార మభివృద్ధి చేసికొనుటకై చేయబడుచు కేవలము పశుగ్రాసముగవినియోగింపబడుచున్నది. జనుము ఓషధిగుణములను, ఆకారమును చాలవరకు ఉలవపైరును పోలియున్నది. పాడిపశువులను, గుఱ్ఱములను దీనితో సంతృప్తికరముగ మేపవచ్చును. కాని ప్రత్యేకముగ జనములను మాత్రము పెట్టరాదు. వీనికి నాలుగైదింతలు జొన్నలనుగాని తౌడునుగాని చేర్చి ప్రత్తిగింజలను, ఆముదపుగింజలను పెట్టువిధమున పెట్టవలెను. ముఖ్యముగ గుఱ్ఱములకు పశువులకు రుబ్బిపెట్టుట మంచిది. కోళ్ళకు రుబ్బకుండ పెట్టవచ్చును. పాడిపశువులకు జనుములు రుబ్బిపెట్టినచో పాలెక్కువగానిచ్చును. ఎక్కువ వెన్నసయితమగును. మనప్రాంతములలోని రయితులు జనుపవిత్తులను వరిచేలు కోయుముందు తడియుండగనే జల్లుదురు. ఈజనుపకాడ పశువులకు దివ్యమైన ఆహారము. ఈ మొక్కలనుండి నారదీయుదురు. ఈనారతో కాగితములు చేయుదురు. ఈనార గోగునారకంటె గట్టిగనుండును. పాటుపడు పశువులకు జనుపకట్టలను ముఖ్యముగా మేపవలెను కొన్ని

తాలూకాలలో ఈజనుములేనిదే పశువులు నీరుసరిగా త్రాగవు. మెట్టపయిరులులేని గ్రామములో ఈజనుము ముఖ్యావసరము. ఇదివరకుకంటె నిప్పుడు జనుపవిత్తులధర యెక్కువగా యున్నది. అందుచే చాలమంది జనుమునకు బదులు పిల్లిపెసర మినుము, పెసర మున్నగునవి జల్లుచున్నారు. పచ్చిజనుము కంటె ఎండినదే శ్రేష్ఠము. ఈకాడ వేడిజేయును. దాహమెక్కువగును. బలముకలుగజేయును. చూడిపశువుల కంతగా పనికిరాదు.

జొన్నచొప్ప - Cholum :— జొన్నచేలు చక్కగా పండినప్పుడేగాని కోయగూడదు. తొందరపడి కోసినయెడల చొప్పలో సారముండక అరుచికరముగనుండి పశువులు దినుటకు యోగ్యముగానుండదు. జొన్నచేలు పూయగనే కోసిన యెడల పశువులకు మంచి ఆహారము. ధాన్యపుజాతులలో జొన్నచే లిచ్చినంత కసవు నితరజాతులీయవు. ఇది లేతగను వచ్చిగను నున్నప్పుడు పశువులకు వేసిన పాలెక్కువగనిచ్చును. బలముకలుగును. నాముపాసనవేయుచున్న జొన్నమాత్రము పశువులకు వేయరాదు. దానిలో విషపదార్థముండును.

జొన్నలు-Holchus Sorghum:—సం: అశ్మరీఘ్నః, హిం యూ; జ్వార్, అర: చోళం. ప్రస్తుతము మన దేశమునందనేక రకముల జొన్నలు పైరగుచున్నవి. మనదేశములో వడ్లు తరువాత భోజనమునకై నుపయోగింపబడు ధాన్యములలో జొన్నలు ముఖ్యమైనపంట. ఈ గింజలు వెగటుగ నుండును. బలము నిచ్చును. జొన్నలను వండి నూనెకలిపి మడ్డికూడుగా వండి

పశువులకు కలుగు మూసర, గాళ్లకు పెట్టుదురు.

మోతాదు:—తోలెడు లగాయతు మానెడువరకు.

జిల్లేడు -Asclepias gigantea:— సం: అర్కః, హిం: యునా: మదార్, అర: ఎరుక్కర్. దీనివేరు చెక్క వెగటుగ నుండును. మిక్కిలి వేడిజేయును. నరములకు సత్తువజేయును. ఎండిన జిల్లేడువేరు పట్టయిపికాక్ అనే యింగ్లీషు మందుకు బదులుగా వాడవచ్చును. జిల్లేడు రోగములకు దివ్యౌషధము. దీనిలో తెల్లజిల్లేడు మిగుల శ్రేష్ఠమైనది. పశువులకు కలుగు వాతరోగములకు, గాయములకు, విషపురుగుల కాట్లకు జిల్లేడాకుపసరు బాగుగా పనిచేయును.

తుమ్మ-Acacia arabica:— సం: బబ్బూరః, హిం: యునా: బబూర్, అర: కరువేలం. ఇది పెద్దముల్లుగల సాధారణ తుమ్మచెట్టు ఇది మనదేశమునం దంతటను పెరుగుచున్నది. దీనికంతగా నీ రవసరములేదు. దీనికాయలు పశువులు తినిన పాలెక్కువ యిచ్చును. దీని చెక్కరసము వగరుగ వెగటుగ నుండును. ఈ చెక్కరసము పశువులకు కలుగు దొమ్మ, నోటిగాలి, పుండ్లు మొదలగువానికి పనికివచ్చును. తుమ్మచెక్క వేడినీటిలో వేసి కాచి చల్లార్చి గాయములు కడుగుటకు స్వదేశవైద్యులు వాడుదురు. ఆకుపసరు చిన్నదూడలకు కలుగు చర్మవ్యాధులకును, గాలికుంటునకు వాడవచ్చును.

తులసి-Ocimum vilosum:—సం: తులసీ, హిం: యునా: తుల్‌సీ, అర: తులసీ. దీనినే లక్ష్మీతులసి యందురు. ఈ మొక్క

లన్నిచోట్ల పెరుగును. దీని ఆకులు కాడలు నలుపురంగుగ నుండును. దీని ఆకురసము చిరిచేదుగా, సువాసనగా కారము గా నుండును. ఈ ఆకుపసరు వేడిజేయును. తులసిమొక్క లున్న చోట దోమలుండవు. పశువులకు కలుగు చర్మవ్యాధులకు పనిచేయును.

మోతాదు:—తులము లగాయతు 2 తులములవరకు.

తురకవేప - A variety of margosa tree :— సం: అర్ధ తిక్తం, హిం: యూ: విలాయతీనీమ్, అర: మలై లెంబ్రి. ఈచెట్టు పెద్దవిగానుండును. దీనివేరు, ఆకు, గింజలు కొంద రౌషధములలో వాడుదురు. దీని ఆకునకు రంపపు పండ్లుగా నుండి చిన్నవిగా నుండును. దీనిఆకు చెక్క రసము చేదుగ నుండును. వేడిజేసి ఆర్చును. ఆకురసము విషమును విరచును. మలమూత్రముల జారీచేయును. పశువులకు కలుగు వాతరోగ ములకు, చర్మరోగములకు బాగుగా పనిచేయును.

మోతాదు:— తులములగాయతు 6 తులములవరకు.

---

తుత్తుం బెండచెట్టు - Mallow tree:—దీనినే దువ్వెన చెట్టందురు. ప్రతిమాగాని గట్లమీదను మొలచు చెట్టు. దీని ఆకులు మృదువుగా నుండును. దీనిఆకులను నీటిలో వేసి కాచిన యెడల జిగురువంటి పదార్థము వచ్చును. ఈఆకు నూరి కట్టిన గాయములు, నెత్తురుగడ్డలుమానును. పశువులకు కలుగుభేదులు రక్తవిరేచనములకు ఆకుపనిచేయును.

మోతాదు:—పిడికెడులగాయతు 2 పిడికెళ్ళవరకు.

తమలపాకులు - Betel leaves:—సం: అహివల్లీ:హిం: యూ: పాన్, అర: వె_త్రిలె. ఈచెట్లు చిరకాలమునుండి మన దేశములో పలుభాగములందు పైరుచేయుచున్నారు. ఆకులలో మూడునాల్గురకము లున్నవి. ఒరిస్సా ప్రాంతములందు పొగాకువేసికొను తాంబూలములకు ప్రత్యేకముగా నొక ఆకు గలదు. ఇది జీడిగింజ ఆకారముగా నుండును. ముక్కలిదట్ట ముగను, ముదురురంగుగను, కారముగ నుండును. ఈఆకులను తీగెమొక్కలు నాటియే పెంచుదురు. ఇది ఎడతెగక నీళ్ళుండు భూములలో పైరు చేయబడు మూడుమాసముల పంటయై యున్నది. నీరుకావలసి యుండుటచేత గుంటలవద్ద పెరుగును. పైనచెప్పిన నాల్గురకములేవన కారువేరు, కల్లిజేరు, నల్లాకులు, గాలివత్రిం అనిఅందురు. ఆగస్టుమాసములో దీనికి భూమి తయారు చేయబడును. తమలపాకులలో క్యాలీశా అనుక్షార మును గంజియును, కొన్ని పులియువస్తువులు నుండును. దీని రసము కారముగనుండును, వేడిజేయును. విరేచనము గావిం చును. పశుప్రులకు కలుగు కడుపునొప్పి, రొంప, దగ్గు, వాతము మున్నగు వానికి దీని ఆకులు, వేళ్లు పనిచేయును.

తుమికిచెట్టు - Diospyros empryopteris:—సం:తిందుక, హిం: యూ: తేందూ, గుమా, అర: తుంబిక్ ఈచెట్లు మలబారు, ఒరిస్సా, ఆంధ్రదేశము, సింహళములలో నెక్కువగా పెరు గును. ఇది ప్రతి సంవత్సరము లేచెడి చిన్నమొక్క. తెలుపు రంగు పువ్వులు పూయును. దీనిఆకులు కొంచెము పొడుగు ను, బెరడు నునుపుగ నుండును. దీనిఆకు చెక్క రసముచమిరు:

చేయును. రసము చేదుగ వగరుగ నుండును. పశువులకు కలుగు వాతరోగములకు, ద్రామ్ములకు బాగుగా పనిచేయును.

తుమ్మకాయలు - The fruits of Acacia Arabica:- ఈకాయలలో జిగురువంటి పదార్థముండును. ఈపదార్థము చాలబలకరమైనది. ఈకాయలను పాడిపశువులకు పాటుపడు పశువులకు మేసిన, కండపట్టును.

తెగడతుంగ:- ఇవి గుబురుమొక్కలు. నీడ తడియున్న చోట బాగుగా పెరుగును. పువ్వులు కంకులు తెల్లగానుండును. పశువులు బాగుగా తినును. గాని సరిగా జీర్ణముకాదు. ఈతుంగలో పిప్పివంటి పదార్థ మెక్కువగా నుండును. సారముగల పదార్థము చాల తక్కువగానుండును. లవణపదార్థ ముండుటచే పశువులు తినుటకు రుచిగానుండును.

తవాక్షిరి - Bamboo manna:- సం: వంశరోచన, హిం: యూ: వంశలోచన్, అర: మూఫిల్. ఉప్పు అనగా వెదురుప్పు అందురు. ఇది నుదురు వెదురుకఱ్ఱలలో దొరకును. వెగటుగా వగరుగా నుండును. పశువులకు కలుగు గుండెజబ్బులకు, మూత్రరోగములకు, పశువు సీరుడుతో యిందిరియము కూడ కలసిపోసిన దానికి దీనిని వాడుదురు.

తుపాకిమందు - Gun powder:-ఇది నల్లగ పలుకులు పలుకులుగనుండును. పశువులకు కలుగు చర్మవ్యాధులకు గ్యారంటీగాపనిచేయును.

తాటిచాప.—తాటిపండ్ల గుజ్జుచే తయారుచేయబడును. దీనిని నీటిలోగాని, కుడితిలోగాని కలిపి పాడిపశువులకు తా

గించిన పాలెక్కువ యిచ్చును. పాలుపడు పశువులకు త్రాగించిన బలము కలుగును.

మోతాదు:-సవాసేరు లగాయతు అరవీసెడువరకు

తంగేడు - Cassia Auriculata:— సం: గోశ్రేణీ హిం: యూ: తర్‌వార్, అర: అవరై మన దేశములో తిరునల్వేలి జిల్లాలో పెరుగుతంగేడు తక్కువరకము. పచారీదుకాణదారుల దగ్గర దొరకునరుకులో ఆకుల ముక్కలు, కాడలు, తదితర చెత్త మొదలగు వస్తువులు విస్తారముగా నుండును. ఈచెట్లు విరివిగా మన దేశమందు పెరుగుచున్నవి. దీనిచెక్కరసము ఆకు రసము వెగటుగనుండును. చెక్కరసము పశువులకు కలుగు మలబద్ధకము, రక్తభేదములకు పనిచేయును. ఆకు కడుపునొప్పి, మలమూత్రబంధరోగమునకు పనిచేయును. దూడలు పాలెక్కువగా త్రాగి పారుకొనినయెడల తంగేడు చిగుళ్ళను పెరుగులో కలిపి పెట్టి తినిపించిన నెమ్మదించును.

మోతాదు:-పిడికెడులగాయతు 3 పిడికెళ్ళవరకు

తిప్పతీగ - Tinosqora Cordifolia:— సం: గుడూచీ హిం: యూ: గిలోయగులాల్‌చ్, అర: పిందిల్‌కోడి అమృదవల్లి. ఈ మొక్కలు భారత దేశమం దెక్కువగా బెరుగుచున్నవి. అన్ని ఋతువులందు పురుగును. సాధారణముగ చిటికెనవేలంత లావుగలిగి గంట్లుగంట్లుగ తీగెగలిగి ఒకటిరెండంగుళముల వెడల్పుగల పచ్చని ఆకులుగలిగి, గుత్తులుగుత్తులుగ ఎర్రని నల్లని మిశ్రమవర్ణము గల కాయలుగలిగి యుండును. తీగెపై

సన్నని పొరయుండును ఆపొరతీసివేసిన పచ్చనిరంగు కనబడును. అడుగుభాగమందలి వేళ్లు పసుపురంగుగానుండును. పచ్చని తీగెను వాడుట మంచిది. ఎండిపోయినతీగె అంత మంచిది గాదు. వేపచెట్లమీాద పాకు తీగెలు మంచివని కొందరందురు. ఈతీగెనుండి తిప్పసత్తు అను పదార్థము తీయుదురు. తీగెరసము వేడిజేయును. ఆకురసము కారముగ, వగరుగ, చేదుగనుండును. పశువులకు కలుగు గాయములకు చర్మవ్యాధులకు, నరములు తెగినప్పుడు దీని ఆకురసము నుపయోగించిన బాగుగా పని చేయును.

తెలికపిండి – Oil cake:— ఇది నువ్వులనూనె తీయుగా మిగిలినపిప్పి పాడిపశువులకు పెట్టిన పాలెక్కువ యిచ్చును. వాతరోగముగల పశువులకు పెట్టిన వాతము హరించును. జ్వరముగల పశువులకు పెట్టరాదు. ఇది వంటినీరు తీయును. రక్తముపట్టును. మనుజులుకూడ ఈపిండిని కూరగా వండుకొందురు.

మోతాదు:-సవాశేరు లగాయతు అరవీశెడువరకు

తౌడు:— వడ్లపైన ఊక పశువుల కాహారము కాకపోయినను బియ్యముపైనుండు పొర అనగా తౌడు పశువులకు మిగుల విలువయైన ఆహారము. తెలుగు జిల్లాలలో చాలచోట్ల దీనితోచేర్చి ఊకలో మృదువైనభాగము చిట్టుకూడ కలిపి పశువులకు పెట్టుచున్నారు. పాడిపశువులకు కుడితిలో తవుడు జాస్తిగాకలిపి పెట్టుదురు. మాగాని భూములున్న గ్రామముల వారు ప్రత్యేకముగా దీనినే తమపశువులకు వాడుదురు. దీని

నెక్కువ పశువులకు మేపుటచే అనేకవిధములైన వాతరోగములు ప్రబలి పశుసంతతి క్షీణించుచున్నది. తప్పకు వెన్నను కలుగజే యును. బంకిమెప్పులకు దానాదినసులలో కలిపి పెట్టుదురు. ఫ్యాక్టరీలలోని తవుడును విస్తారముగా తెచ్చి రైతులు తమ పశువులకు మేపుచున్నారు. అందుచే పశువులకు వేడియధికమై నేత్రరోగము లధికముగా కలుగుచున్నవి.

తాడికాయ- Terminalia Bellirica:—సం: విభీతక, హిం: యూ: బహేఢా, అర: తానికాయ్. ఇది బజారుకొట్లలో దొరకు వస్తువు, వగరుగనుండును. మనదేశములో ఈ మొక్క లు విస్తారముగా పెరుగుచున్నవి. ఈ కాయరసము చలువజేసి ఆర్చును పశువులకు కలుగు దొమ్మలకు. జీర్ణసంబంధమగు జాడ్యములకు బాగుగా పనిచేయును.

మోతాదు—:తులములగాయతు 3 తులములవలకు

తాళిసపత్రి- Pinus Webbiana:— సం: తాళీశపత్రం హిం, యూ: తాళిశపత్రి, పనియామలక్; అర: తాళిశపత్రి. ఈ చెట్లు కొండలమీద బాగుగా పెరుగును. తోటలలో దీనిని తరచుగా పనస పోక చెట్లతో కలిపి పెంచుదురు. విశేషవర్షము, వెంటనే తీక్ష్ణమగుయెండ, ఇట్లు నొకదానితో నొకటియున్నచో బాగుగా పెరుగును. వర్షమెక్కువగా కురిసిన సువాసన తగ్గును. దీని విత్తనములు జల్లిన అయిదు వత్సరములకు మొక్కలను దీసి దూరదూరముగా పాతుదురు. పదివత్సరములకు ఫలితము నకువచ్చును. ఈ చెట్లు వందలకొలది వత్సరములు బ్రతుకును.

దీని ఆకులను కొందరు వంటలలోని కుపయోగింతురు. కర క్కాయలతో కలిపి రంగువేయుటకుగూడా వాడుదురు. దీని రసము సువాసనగా రుచిగానుండును. వేడిజేసి అర్చును. పశువులకు కలుగు సమస్తమైన వాపులకు ఇది పనిచేయును.

మోతాదు—:అరతులము లగాయతు తులమువరకు.

తాటిబెల్లము – Jaggery made of polmyra toddy
దీనిని తాటికల్లుతో చేయుదురు. దీనియందు చలువ జేయు గుణముకలదు. ఈబెల్లము సున్నపుకల్లుతో వండుదురు. కొద్దిగతీపిగ వెగటుగ నుండును. పోతు తాటిబెల్లము శ్రేష్ఠము. దీనినుంచి సారాయికూడ తీయుదురు. పశువులకుకలుగు శాక రోగములకు, మూత్రరోగములకు తరచుగా వాడుదురు.

మోతాదు:—నవటాకులగాయతు సవాశేరువరకు.

దిరిసెన – Acacia lebbek:—సం: శిరీష, హిం: యూ: శిరిష్, లస్ఠక్, అర: చిరీదమ్. ఇవి పెద్దవృక్షములు. ఈచెట్లను ప్రతిరోడ్డుప్రక్కలను వేయుదురు. దీనిపువ్వులు గుత్తులు గుత్తులుగా నుండి సువాసనగా నుండును. దీనియాకులు పగలంతయు తెరచుకొని రాత్రులయందు ముడుచుకొని యుండును. దీని చెక్క రసము వెగటుగ నుండును. వేడిచేయును. ఈరసము పశువులకు కలుగు దొమ్మరోగములకు, నల్లతెవులునకు పనిచేయును. ఆకురసము వాతములకు చర్మవ్యాధులకు పనిచేయును.

## ద

దొండ – Mamordica monodelpha:—సం: తుండ కేరి, హిం: యూ: కుదురూ, అర: కోవైక్కాయ్. వ్రితియింటి యందుండు దొడ్లలోను, కంచెలమీదను, చెట్లమీదను పెరుగుతీగె. ఇది సులితీగెలు తిరిగియుండును. దీని ఆకు పసరు పశువులకు కలుగు వాతరోగములకు, కల్లవాపులకు నేత్రి వ్యాధులకు పనిచేయును.

దుంపపంటలు:—కొన్నిదుంపలుగూడ పశువుల కాహారముగ నుపయోగపడుచున్నవి. ఐరోపాఖండమందు గోల్డువర్జెల్ అను దుంపజాతి విశేషముగ పశువులకొరకు పెంచబడుచున్నది. బీటుదుంపగూడ పశువులకును, గాజరగెడ్డలు గుఱ్ఱములకును దాణాగా పెట్టుదురు. బంగాళాదుంపలు జర్మనీదేశములో పశువుల కాహారముగా నుపయోగింప బడుచున్నవని తెలియుచున్నది. మనదేశమున చిలగడదుంపలు పశువుల కుపయోగింపక పోయినను దానిని రొట్టిగా చేసి పశువులకు పెట్టుచున్నారు.

దాణాదినుసులు:—సామాన్య మేతకంటె నెక్కువసారముగలిగి కొంచెము కొంచెముగా పశువులకు పెట్టబడు దినుసులకు దానాదినుసు లనబడును. ఉలవలు, తెలికపిండి యిందుకు ఉదాహరణములు, ఇంకను తృణధాన్యములు, కాయధాన్యములు, పిండిజాతులు ధాన్యముల పొట్టులు మొదలగునవి. పశువులు ఆరోగ్యముగ నుండుటకును, బలిష్ఠముగ నుండుట

కును, వానికాహారము తగినంత పెట్టుటయేగాక ఆయాహార ము శరీర పోషణకు దగినదిగా నుండవలెను. పశువులకు బెట్టు ఆహారమునందు విలువైన ద్రవ్యములు, చమురు, అల్బుమినః ములు, ద్రావణీయ కర్బనోజ్జితములు, నార, బూడిద, మొద లగు పదార్థములు ఉండును. నార అజీర్ణపదార్థమైనను దీనిని గూడ పశువులుకొంతవరకు జీర్ణముచేసికొనగలుగుటచేత కొం త విలువగల దగుచున్నది. తక్కిన ద్రవ్యములుకూడ పూర్తిగ జీర్ణముకాకపోయినను చాలాభాగము జీర్ణమగును.

దేవదారు -Pincus Deodar:—సం: శక్రపాదపః. హిం: యూ: దేవదార్. అర: తూన్ మొకెలు. ఈచెట్లు శీతలప్రదేశ ములలో పెరుగును. ఇవి యెత్తుగా పెరుగును. హిమాలయ పర్వతములమీద ఆరువేల అడుగుల యెత్తుగానున్న ప్రదేశ ములలో పెరుగుచున్నవి. ఈచెట్టుయొక్క చెక్క ఆకు రస ము చేదుగ నుండును. దీనిగింజలనుండి తైలము తీయుదురు. చెక్కరసము చలువచేయును. పశువులకు కలుగు వాతరోగము లకు చెక్కరసము బాగుగా పనిచేయును.

దోసకాయ -Cucumissatives :— సం; కర్కటీ, హిం: యూ: కక్డీ, అర: వెళ్ళరిక్కాయ్ దోసకాయలలో పందిరి దోసకాయలని, నక్కదోసకాయలని రెండుముఖ్యమైనరకము లుగలవు. పందిరిదోసకాయలు వర్షాకాలములోగాని కాయవు. నక్కదోసగింజలుపాతినపిదప పదిదినములవరకు నీరుపోయుచు డవలెను. ఈకాయలు పుల్లగానుండును. దోసకాయలు రెం డడుగుల పొడుగువరకుగూడ పెరుగు విత్తనములు గలవు. వీని

పై మొట్టమొదట నల్లనిచారలుండును. పండినతరువాత తెల్లగనైనను, నారింజరంగుగనైనను మారును. దోసకాయ బహువిరేచనకారి. పశువులకు జీర్ణసంబంధమైన జాడ్యములకు అమోఘముగా పనిచేయును. పైవానిలో దేనినైన వాడవచ్చును.

దూసరి - Cocculus Villosus:—సం: పాతాళగరుడీ, హిం: యూ: చిరోటా, అర: కట్టుకొడి. ఈమొక్కలు డొంకలలో పెరుగును. ఇదితివ్వతీగెకంటె సన్నముగా నుండును. ఆకు అండాకారముగనుండి మూడుపెద్ద ఈనెలు కలిగియుండును. ఈ మొక్కయొక్క పండ్లనుండి వచ్చురసము సిరాగా నుపయోగింపవచ్చును. ఆకులు నీటిలోవేసి నలిపిన ఆకుపచ్చరంగుగా నుండును. ఆకురసము చలువచేయును. విరేచనము గావించును. పశువులకు కలుగు మూత్రరోగములకు బాగుగా పనిచేయును.

దుష్టుపుచెట్టు - Odina Wodier:—సం: అజశృంగీ, హిం: యూ: దదియార్, అర: వూతియామరం. ఇది ఒకలత. దీని ఆకులు కొంచెము పెద్దవిగానుండును. ప్రతిసంవత్సరము ప్రతి దొడ్డిలోను లేచెడిమొక్క. దీనికాడ ఆకుపచ్చ, తెలుపురంగుగ నుండును. పాలుండును. దీనిఆకురసము పశువ్యాధులకు పరమోత్కృష్టమైనమందు. పసరు గాఢవిరేచనకారి. మిగులవేడి జేయును. ఈరసమును సారాయిలోకలిపి త్రాగించిన జ్వరము, దొమ్మ మొదలగు వ్యాధులు నివర్తియగును. గాయములకు కల్లవాపులకు, చర్మరోగములకు కూడ ఈఆకుపసరు బాగుగా పని చేయును. మోతాదు:— 1గొట్టముమొదలు 3 గొట్టములవరకు.

ధనియాలు - Coriander seeds:—సం: అల్లా, హిం:

యూ: ధనియా, అర: కొత్తుమల్లి. ఈమొక్కలనే కొత్తిమీ రందురు. మనదేశమువం దంతట దీనిని పైరు చేయుచున్నారు. ఐరోపా దేశస్థులు దీనినుండి చమురుతీయుదురు. దీనిఆకులు చిన్నవి. ఈమొక్కలు సుమారు 6 అంగుళములనుండి అడుగు న్నర యెత్తువరకు పెరుగును. కృశించిన పశువులకు ధనియాలతో కొన్నిమందులు లిపి పెట్టెదరు. సోపుగింజలవలె నివియును పనిచేయును. పశువులకు కలుగు అజీర్తి, కడుపునొప్పి, విరేచన ములు, మలబద్ధకము మున్నగు వ్యాధులకు ధనియాలు బనిచే యును. మోతాదు:—4తులములు లగాయతు10తులములవరకు.

దాల్చినచెక్క - Cinnamon:— సం: త్వక్, హిం: యూ: దాల్ చినీ, అర: లవంగపట్టె. ఈ చెట్లను మనదేశము నందంతగా పెంచుటలేదు. ఇవి పడమటి కనుమలమీద ఎక్కు వగా పెరుగుచున్నవి. ఇవి ఆరేండ్లు పెరిగినతరువాత బెరడు తీయవచ్చును. ఇది సామాన్యముగా బజారులలో దొరకును ఇందులో రెండురకములు గలవు. చుట్టలోపల చిన్నచిన్నచుట్టు లుగలిగి యుండునది మంచిరకము. ఇది సువాసనగను, తియ్య గను తక్కువ సువాసనగను, ఒగరుగను ఉండును. ఇది మంచి జీర్ణకారి, పశువులకుకలుగు వాతరోగము, పారుడు, దొమ్మ, కడుపునొప్పి మున్నగువ్యాధులకుబాగుగా వనిచేయును.

మోతాదు:— తులములగాయతు 4 తులములవరకు.

నల్లజీలకఱ్ఱ - Migella sativa:— సం: కృష్ణజీరకం, హిం: యూ: కాలాజీరా, అర: కారుశిరగం. ఈమొక్కలు

విస్తారముగా పంజాబు దేశమునందు పైరగుచున్నవి. వీని ఆకులు చీలియుండును. పువ్వులు గుత్తులు గుత్తులుగా నుండును. బజారులో దొరకు వస్తువు. దీనిగింజలు నల్లగ, సువాసనగ నుండి సీమతుపాకిమందుర వ్వలవలె నుండును. ఈగింజలు పుస్తకములలో పెట్టిన విషక్రిములు జేరవు. పశువులకు కలుగు దొమ్మలకు, లివర్ రాటను వ్యాధికి, వాతములకు, కొమ్ము సంబంధమైన జాడ్యములకు, వాపులకు బాగుగా ఈ గింజలు పని చేయును. మో:—అరతులము లగాయతు ఒకటిన్నర తులములవరకు.

నల్లేరు - Vitis Huandrangularis:—సం: వజ్రివల్లీ, హిం: యూ: హడాభాంగా, అర: పెరండై. ఈతీగెలు ఇసుకనేలలపై నుండు చెట్లమీదను, పాదులమీదను బాగుగా పెరుగును. దీనికి నులితీగెలుగలవు. ప్రకాండము ఆకుపచ్చగ నుండును. దీని ఆకులు కాడలు దురదగానుండును. పశువులకు కలుగు ఈంగిడీ, నల్ల తెవులు, నల్లకవ్వు, ఎడతెగని పారుడు రోగము మున్నగువానికి దీనిని వాడిన బాగుగా పనిచేయును.

నల్లమందు - Opium :—సం: అఫేనం, హిం: యూ: అఫీమ్, అర: అబినీ. గసగసాల మొక్కలకాయలనుండి ఈ నల్లమందు తయారుచేయుదురు. దీనిపంట ఎక్కువగాహిందూస్థానమునందు గలదు. కాయలుకోసిన దినముననో లేక మరుసటి దినముననో మధ్యాహ్న వేళ కాయల నొక పనిముట్టుతో మనము ఆల్చిప్పతో మామిడికాయ గీసినట్లు గీయుదురు. ఈ గీయు పనిముట్టు నాలుగుకత్తులను మిక్కిలి దగ్గర దగ్గరగా

జేర్చినట్లుండును. ఇట్లు గీసిన చారలలో నొకవిధమైన ద్రవము కారును. ఈద్రవము నొక పాత్రలోనికి జేర్చి నిలువజేయుదురు. ఇదియే నల్లమందు; దీనిలో మఱియొకరసము కలిపిగాని, కాయల పొప్పరవేసిగాని దగాచేయుచుందురు. ఈనల్లమందు చీనా దేశమునకు ఎగుమతియగుచున్నది. ఇది చేదుగనుండును. మత్తును మలబద్ధకమును గలిగించును. పశువులకు కలుగు అతిసారము, రక్తాతిసారము, కడుపునొప్పి మొదలగు జీర్ణసంబంధమగు జాడ్యముల కుపయోగించవలెను. ఎండువాతముగల పశువునకు అర్ధశేరుఆవుపాలలో ఒకఅరతులముగాని, పావుతులముగాని నల్లమందు కలిపి త్రాగించవలెను.

మో:—పావుతులము లగాయతు తులమువరకు

నెయ్యి – Ghee:--ఇది బలముకలుగజేయు వస్తువు. చలువజేయును. జిడ్డుగానుండు నేయి చాలమంచిది. పశువులకుకలుగు రక్తవిరేచనములు, రక్తమూత్రము, కడుపునొప్పి, వాతనొప్పులు, మున్నగు రోగములకు తదితర వస్తువులలో కలిపి యివ్వవలెను.

మో:—6 తులములు లగాయతు 9 తు. వరకు

నాము:—పశువులకు కలుగు విషపురుగుల కాట్లకుదీనిని నీటితో కలిపి రాచిన వెంటనే తగ్గును.

నువ్వులనూనె – Oil:—నువ్వులనూనె ఔషధములో నుపయోగించెదరు. ఈచమురుతో దీపముపెట్టినయెడల మంచి కాంతిగల వెలుతురు వచ్చునుగాని చమురునిలిచికాలదు. పట్టు

మొదలగువానికి రంగువేయునప్పుడుకూడ ఈనూనె నుపయో గించెదరు. ఈనువ్వులపప్పు అనేక ఫలాహారవస్తువులు చేయుట కుపయోగించుదురు. యూరపు దేశములో ఈనూనెను సబ్బు బిళ్ళలుచేయు నిమిత్తము ఎక్కువగా నుపయోగించెదరు. కొబ్బరినూనెకంటె ఈనూనెను ఎక్కువగా దీపములుపెట్టుట కుప యోగించుచున్నారు. నువ్వులపప్పు గానుగలో వేసి, ఆడి, చమురు తీయునపుడు తుమ్మజిగురు బెల్లమువేసి కలుపుదురు తుమ్మజిగు రు నూనెకు రంగువచ్చుటకును, చిక్కగానుండుటకును వేయు దురు. రుచికరముగ నుండుటకు బెల్లము వేయుదురు. పశు వులకు కలుగు సమస్తమైన చర్మవ్యాధులకు, తదితరవ్యాధులకు ఈనూనెను తరచుగా వాడుదురు. ఈనూనె నంటెసీరును దీయును. దేహపుష్టికలుగును. విరేచనబద్ధకముచేయును. నువ్వులు సోలె డు తెచ్చి అర్ధసేరు నీటిలో కలిపి పిసికి అవస్నియు మావి వేయని పశువునకు త్రాగించిన వెంటనే మావిపడును.

నేలఉసిరిక – Phyllanthus Niruri:– సం: భూమ్యామ లకీ, హిం: యూ: జురామ్లా, అర: కీజ్జానెల్లి. ఈ నేలఉసిరికలో "ఫైలాంతిక్" అను చేదుగల పదార్థముండును. దీనిని ఔష ధములం దుపయోగించుదురు. తెల్లఉసిరికవలెనే యుండును. దీనియాకుపువ్వులలో కొన్నిగొడ్డుపువ్వులేగాని కాయలుగాయ వు. దీనియాకులపొడి వెగటుగ నుండును. మేహశాంతి చేయును. దేహములోని మలమును వెడలించును. దీనిఆకుపసరు పశువు లకు కలుగు సమస్తవ్యాధులకు పనిచేయును.

నల్లపురుగుడు – Phyllanthus Multi florus:– దీనినే

నల్లపులుగుడు అందురు. దీని ఆకు, వేరు, చూర్ణము చలువ జేయును. దేహములోని దుష్టపదార్థముల కరగించును. పశువులకు కలుగు రక్తవిరేచనములకు పారుడురోగములకు బాగుగా పని చేయును.

నరమూత్రము - Human urine:—ఉప్పు, చేదు, వగరుగలిగి యుండును. పైత్యము జేయును. తాత్కాలికమగు సమస్తగాయములకు చీము మొదలగునవి పట్టనీయక పని చేయును. కాలినపుండ్లకు బూడిదలో కలిపి వేసిన శీఘ్రముగ మానును. పశువులకు కలుగు దొమ్మలకు అమోఘముగా పని చేయును.

నేలతాటిగడ్డ - Curculigo orchioides:— సం: తాళమూలికా, హిం: యూ: ముసలీకంద్, అర: నిలపనంకిళంగు. దీనిదుంపలు చేదుగనుండును. వేడిజేసి ఆర్చును. విరేచనము గాపించును. మలబద్ధకము, పాలు చేపనందుకు, కడుపునొప్పి మొదలగు వ్యాధులకు బాగుగా పని చేయును.

మో:—తులములగాయతు 3 తులములవరకు.

నీరుల్లిపాయలు - Onions:—సం: పలాండు. హిం: యూ: ప్యాజ్, అర: వెంగాయం,ఎరుల్లి. మనదేశమునందు మిక్కిలి పురాతనము నుండియు పైరుచేయబడుచున్నవి. ఆఫ్గనిస్థానము, బెలూచిస్థానము, పాలెస్టైను మొదలగు దేశములందు నీరుల్లి యిప్పటికి పైరుచేయబడుచున్నది. మనరాజధానియందు నూతులుగల రైతులందరు ఉల్లిని లాభకారిగ్గా

నదిగా నెంచి పైరుచేయుదురు. విస్తారము తేలికగా నుండు నల్ల భూములీపైరునకు ముఖ్యమైనవి. శీతాకాలపు పైరులలో నొకటి. దీనిలో రెండుజాతులుగలవు. ఒకజాతిపాయ తెల్లగా నుండును. మరియొకటి ఎఱ్ఱగానుండును. ఎఱుపుద ఎక్కువ సువాసనగా నుండును. కాని తెల్లపాయలే వైద్యమునకు శ్రేష్ఠమైనవి. ఇవి వెల్లుల్లికంటె కొంచెము తక్కువ పనిచేయును. రక్తశుద్ధి చేయుటకును, నరములకు సత్తువనిచ్చుటకును, నీరుల్లిపాయలు చాల మంచిపని చేయును. దీనిరసము వెగటుగ, కారముగ నుండును. వేడిజేసి ఆర్చును. వాతరోగములకు, నాసికారోగములకు, శ్వాసరోగములకు, నేత్రవ్యాధులకు బాగుగా పనిజేయును.

మో:—15 తులములు లగాయతు 30 తు. వరకు.

నేరేడు - Eugenia Jambolana:—సం: జంబూః, హిం: యూ: జామూన్, అర: నాగప్పజం నావల్. ఈచెట్లు నదీతీరములం దెక్కువగా పెరుగును. బౌద్ధులకీ చెట్లు మిగుల పవిత్రములైనవి. దీనియాకులను ఒకవిధమైన పట్టు పురుగులు తినును. దీనిపండ్లను పులియబెట్టి ఒకవిధమైన సారాయి తీయుదురు. దీని చెక్కరసము వెగటుగ వగరుగ నుండును. ఈ రసము రక్తమూత్రము, విరేచనములు, పారుడురోగము, కార్జమునకు ఒకవిధమైన పురుగువల్ల కలుగు వ్యాధికి పని చేయును.

మో:-రసము తులము లగాయతు 6 తులముల వరకు.

నేపాళము - Croton tiglium:—సం; దంతీ, హిం; యూ; జమాల్, అర; నేర్వాళకట్టామణై. ఈమొక్కలు పెక్కుచోట్ల పెరుగుచున్నవి. దీనిగింజలనుండి తీయు చమురు వెగటుగా చేదుగా నుండును. ఈచమురు చర్మవ్యాధులకు పనికివచ్చును. చెట్టుఆకులను పట్టుపురుగులకు ఆహారముగా బెట్టుదురు. బజారులలో దొరకువిత్తులు కొంచెము నిలువయుండును. అందుచే అవి చెడిపోవు చుండును. కావలసినపుడు మంచివి తెచ్చుకొనుట శ్రేష్ఠము. ఈగింజలు గుండ్రముగను, కొన్ని కోలగను, కొన్ని నాలుగుపలకలుగనుండి పైభాగమందు పొప్పరగట్టియుండును. ఆహార లోపల కొంచెము పసుపు వర్ణముగల పప్పుండును. రుచికి మొదట స్వాదువుగ నుండును గాని వగరు కారముగనుండును. ఈగింజలు బహువిరేచనకారి. విషవస్తువు. విరేచనము గావించుటకు తగిన మోతాదీయవలెను. వాత నొప్పులకు దీనిపాలు పనిచేయును.

నేలవేము - Cherayta:—మిరప మొక్కలవలె ఈమొక్కలు గుబురుగా పెరుగును. ఈ మొక్కయొక్క ప్రతిభాగము చేదుగ నుండును. ఇది అన్నభేదివలె పనిచేయును. నీరసము పోగొట్టును. పురుగుకాటునకు దీనిపసరు చాల మంచిది. క్రిములనుసంహరించును. గాలికుంట్లు, రక్తమూత్రము, వాతరోగములు, విరేచనములు, కడుపుబ్బు మొదలగువాటికి దీనిఆకు పసరు పనిచేయును.

ము:—అంతులము లగాయతు 10 తులముల వరకు.

నీలిమందు - Indigo:-సం; నీలినీ, హిం; యూ; నీల్, అర; నీలి ఆవురి. ఇది కార్వోటినగరమందు పైరుచేయబడు ఒకముఖ్యమైన మెట్టపైరు. దీనికి నీరుకట్టుట అవసరము. దీనికి రొంపవేయుటకు ఎరువువేయరు. ముఖ్యమైన రంగులలో నీలిమందొకటి. దీనిని చిరకాలమునుండి మనదేశమునందు వాడుచున్నారు. కాని యిప్పుడు చాకరంగులు చేయనేర్చుటచే దీని పైరు తగ్గినది. ఈచెట్లఆకులనుండి మందు తయారుచేయుదురు. పశువులకు కలుగు చర్మవ్యాధులకు, పుండ్లకు, వెండ్రుకలూడిపోయిన మచ్చలకు ఈమందును నూనెలో కలిపి రాచిన నివర్తించును.

నిమ్మ - Lime:-సం; జంబీరః, హిం; యూ; నింబూ, అర; ఎలుమిచ్చం. ఈచెట్లు చాలచోట్ల పెరుగుచున్నవి. నిమ్మకాయలో పులుపేగాక సువాసనగూడ యున్నది. నేత్రవ్యాధులకు, చర్మవ్యాధులకు, కర్ణరోగములకు పులుసు బాగుగా పనిచేయును.

## ప

పసుపు - Turmeric:- సం; హారిద్రా, హిం; యూ; హాల్దీ, అర; మంజళ్. ఇది మనదేశములో విస్తారముగా పండుచున్నది. ఈమొక్కలను ఎక్కువగా కంద, వంగ మొదలగు తదితర పైరులతోగాని, ప్రత్యేకముగ కాని వేయుదురు. ఇది చెన్నపట్టణము, బొంబాయి, కలకత్తానుండి జర్మనీ, ఇంగ్లండు, అరేబియా, పెర్షియా మొదలగు ఇతర దేశములకు ఎగుమతియగుచున్నది. ఇది వెగటుగ వేడుగ నుండును. ఉద్రేకకా

యు, బలకారియునగు వస్తువు. వేడిజేసి ఆర్పును. జీర్ణశక్తిని గలిగించును. నేత్రవ్యాధులకు, మూత్రవ్యాధులకు, చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును.

మో:—తులములగాయతు 2 తులముల వరకు.

పంచదార - Sugar:–సం; శర్కరా, హిం; యూ శక్కర్, అర; సక్కరయి. దీనినే చీనాపంచదార, తెల్లపంచదార, చెక్కరపంచదార అందురు. ఇది నేత్రవ్యాధులకు బాగుగాపనిచేయును.

పల్లేరు - Pedilium Murux:–సం; గోక్షురః, హిం; యూ; గోఖరూ, అర; నెరుండిజిల్ ఈమొక్కలు గడ్డిపెరుగు ప్రతిచోటను పెరుగగలవు. వీటివేళ్ళు, ఆకులు, కాయలు స్వాదుగనుండును. ఈమొక్కల వేళ్ళరసము పశువులకు కలుగు జీర్ణసంబంధమగు జాడ్యములకు బాగుగా పనిచేయును.

పర్పాటకము - Mollugo cerviana:– సం; పర్పటకః, హిం; యూ; పిత్తపావడా తాప్‌జాడ్, అర: పర్పాటక. వీటిలో తెలుపు, ఎరుపు అను రెండుజాతులుగలవు. దీనిరసము చేదుగనుండును. దీనివ్రేళ్ళు నూనెలో వేసి కాచి తైలముతీయుదురు. ఇది వాతనొప్పులకు పనిచేయును. రసము వేడిజేయును, వాతరోగములకు, చర్మవ్యాధులకు రసము పనిచేయును.

ప్రత్తి - Indian cotton plant:—సం: కార్పాసీ, హిం: యూ: కపాస్, అర: పరిత్తిమరం. ఈమొక్కలను పెంచుటయు, నూలుదీసి బట్టలునేయుటయు మన దేశములో

జిరకాలమునుండియు గలదు. వీనిలో ననేకజాతులు గలవు. ఇవి నల్లరేగడి నేలలందు బాగుగా పైరగును. ప్రత్తిచెట్టునకు మొదట నీరు నిలువరాదు. ప్రత్తిగింజలనుండి ఒకవిధమైన నూనెను తీయుదురు. కొన్ని దేశముల వారీనూనెను వంటల యందు కూడ నుపయోగింతురు. గింజలను పాడిపశువులకు పెట్టిన బాగుగా పాలిచ్చును. నూనెతీసిన పిప్పికూడ పశువులకు పెట్టుదురు. అందుచే మంచి బలముకలుగును. లేత చిగుళ్ళను, కాయలను మందులలో నుపయోగించెదరు. దీనియాకు దూడలు మన్నుతినినచో వేడిమజ్జిగలో కలిపి పెట్టుదురు. గింజలను నూరి కాళ్ళవాతనొప్పులకు వాడుదురు. గింజలతో యింక కొన్ని వస్తువులు చేర్చి పశువు యొక్క దృష్టిదోషము తీయుదురు.

మో:—సోలెడు లేక మూనెడు గింజలవరకు.

పందిచమురు - Fat of Hog:—రుచిగా నుండును. బలముజేయును విరిగిన అవయవములను అతుకుకొనజేయును. వాతరోగములకు, అర్శవాపులకు బాగుగాపనిచేయును. మర్దన వలన నరములకు సత్తువకలుగజేయును.

పందివంటలు:—అతివేడిజేయును. నీటిలోకలిపి త్రాగించిన దొమ్మ కడుపుబ్బు మొదలగు వ్యాధులకు పనిచేయును.

పెన్నేరు - Physalis Flexuosa:—సం: అశ్వగంధికా, హిం: యూ: అజ్ గంద్ బహ్మనేసుపేద్, అర: అచుపగంధి. ఇదియొక చిన్న గుబురుమొక్క. పువ్వులు చిన్నవి. ఇది

మెరక నేలలయందు బెరుగును. సాధారణముగా 5, 6 అడుగుల ఎత్తున బెరుగునట్టి చెట్టు. దీనిని త్రివ్వి చూచిన యెడల భూమిలోపల వచ్చునట్టి దుంప ఎక్కువ వైద్యమున నుపయోగించుచున్నది. దీని దుంపరసము లేక చూర్ణము వెగటుగ నుండును. ఇది దేహములోని మలమును వెడలించును. దగ్గు, వాతము, రొంప, చర్మవ్యాధులకును, దూడలకు కలుగు అజీర్తి, పాలదోమ్మ మున్నగువాటికిని ఈదుంపరసము బాగుగా పనిచేయును. దీని ఆకురసము వ్రణములకు, గూటిగడ్డలకు పనికి వచ్చును.

మో.—దుంపరసము తులము లగాయతు 3 తు॥ వరకు.

పొగాకు - Tobacco:—సం: ధూమ్రపత్రికా, హిం: యూ: తంబాకు, అర: వుఫైయొలై. ఈచెట్లలో పలురకము లున్నవి. అడుగున గులకరాయికలిగి పైన బంకమట్టి పొరలు గల చలువభూమి పొగాకుపంటకు మిగుల ప్రశస్తమైనది. దీని ఆకు చేదుగా వెగటుగా నుండును. దీనిలో "నికోటిన్" అను విషపదార్థమున్నది. పొగాకుతోటలోనికి సామాన్యముగా పాము వెళ్ళదు. ఇది విషపదార్థము. ఎండిన ఆకుపొడి చుట్టలకు, కొన్నిరకముల పొడరకు, నేత్రవ్యాధులకు, చర్మవ్యాధులకు, గాయములు, వ్రణములు మొదలగువానికి పనిచేయును.

మో:—తులములగాయతు 2 తులములవరకు.

పిల్లిపెసర - Phasedus Tribolus:—సం: ముద్గపర్ణీ, హిం: యూ: ముగదర్, అర: చిరుపయరు కహెసరు. ఇవిమెట్ట

నేలలయందును, జనుమునకు బదులుగా మాగాని పొలము లందును పైరు వేయుదురు. పశువులకు మంచి యాహారమే గాని దీనిని విస్తారముగా మేపుటవలన అప్పుడప్పుడు వాతరోగ ములు, నేత్రరోగములు పుట్టుచుండును. కాన పిల్లిపెసర మేపు నపుడు తెలికపిండికూడ పెట్టుట మంచిది. వేసవికాలములో నిది మిగుల శ్రేష్ఠమైన ఆహారము.

ఫిరంగి సాంబ్రాణి-Boswella glabra:—సం: కొండకన ఘూపం, హిం:యూ:లోబ్ వాన్. ఈ చెట్టు కొండలమీద పెరు గును. దీనినుండి జిగురువచ్చును. సువాననగ, చేదుగనుండును. చలువజేయును. పారుడురోగమునకు, అజీర్తికి, చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును.

పెసలు - Green Gram:—సం: ముద్గః, హిం:యూ: హారీమూంగ్, అర: పచ్చపయరు ఇవి సాధారణముగా మెట్ట భూములలో సజ్జతోను, జొన్నతోను విత్తబడును. ఇంకను వరి చేలు కోసినతరువాత పెసరచేలు పంటకువచ్చును. పెసలుజనులు తినుట కుపయోగించెదరు. పెసలు చలువజేయును. వీని లోనల్లపెసలు చాల శ్రేష్ఠమైనవి. రక్తమూత్రము, పారుడు రోగము, రక్తవిరేచనములు మున్నగువ్యాధులకు పెసరపిండి, పేరిన నెయ్యి కలిపిపెట్టిన చక్కగా నెమ్మదించును.

మో:—సోలెడు లగాయతు తవ్వెడు వరకు.

పిప్పలి మోడి - Root of long pepper plant:—సం మూలసర్వగ్రంధి, హిం: మూల్. కారముగ నుండును, కాక: జే

యును. దీనికి పిప్పళ్ళ గుణము కలిగియుండ్నను గాని కొంచెము తక్కువ పనిజేయును. విరేచనకారి. వాతములకు, అజీర్తికి, శ్వాసరోగములకు పనిచేయును.

ఫిరంగిచెక్క - China root:— సం: మధుస్నుహీ, హిం: యూ: చోబ్‌చీనీషుక్‌చీనా, అర: పరూయిగామ్. ఈ చెట్టు చైనా, జపాను దేశములలో పెరుగును. హిందూదేశము లోలేదు. ఇదియొక చెట్టుదుంప రక్తమును శుభ్రపరచును. వేడి జేయును. వాపులకు, క్రిమిరోగములకు, పారుడురోగములకు పనిచేయును.

పిప్పళ్ళు - Long pepper:—సం: పిప్పలీ, హిం: యూ: పిప్‌లీ, అర: అరిశితిప్పలి. పిప్పలితీగెలు మనదేశములో పలు భాగములందు పెరుగును. దీనియాకులు పెద్దవి. ఇవి పెరుగుటకు సారవంతమైనట్టి, ఎత్తుగానుండునట్టి, మెరకనేలలుగా నుండునట్టి చోట్లు కావలయును. ఇది భూమిలో గొంతదూరముపాకి యచ్చట పైకివచ్చి కొమ్మలుగలియుండును. వీనిని దీసి పాతి పైరుచేయుదురు. వేరులను, ఎండపెట్టిన కాయలను ఔషధము లలో వాడుదురు. ఇవి చమురుగలిగి కారముద్గనుండును. పిప్పళ్ళుగూడ మిరియములంతపని చేయును గాని అంత ఎక్కువ పనిచేయవు. పిప్పళ్ళు చమురుగలిగి కారముగనుండును. కాకజేయును, దగ్గు, ఒగర్పు, నేత్రవ్యాధులకు, వాతరోగములకు బాగుగా పనిచేయును.

మో:—తులము లగాయతు 3 తు. వరకు.

పిల్లిపీచరగడ్డ- Asparageas Racemosus:— సం: శతావరీ, హిం: యూ: సపేద్ ము సలీసతావర్, అర: వనియానకు ఈమొక్కలు నరకుచెట్టు కొమ్మలవలె నుండును. ఈమొక్క అడుగున 100 వరకు తేగలవలె ఒకవిధమైన గుంపలుండును. ఈదుంపలు తీయగానుండుటచే తేళ్లు, చీమలు వానిని పట్టియుండును. ఇది వెగటుగా, చేదుగానుండును. కాక జేయును. శ్వాసరోగములకు, మొగబంతి యను జాడ్యమునకు ఈదుంపను ఎండబెట్టి చూర్ణము చేసి పళవుముక్కలలో వశ్యము చే యించిన మొగబంతిమొదలగు వ్యాధులు తగ్గును.

మో:—తులము లగాయతు 3 తులముల వరకు

పొన్నగంటికూర - Achyranthes triandia:— సం: మత్స్యాక్షీ, హిం: యూ: మఛేచీ, అర: పొన్నాంగణి. పొన్నగంటికూర ఆకులొకొక్కచో రెండు రెండున్నవి. దీనిని కూరగవండుకొందురు. ఆకులను ఎండబెట్టి ఒరుగు చేసి నిలువకూడ చేసికొందురు. ఈఆకులు కొంచెము వగరు, చేదు గలిగి స్వాదుగనుండును. చలువజేయును. దీని ఆకువసరు నేత్రవ్యాధులకు చర్మరోగములకు పనిచేయును.

పొగడ - Mimusops elengi:—సం: వకుళః, హిం:యూ: మూల్ సర్, అర: వకులం. ఈచెట్లను తోటలలో పెంచుదురు. దీనబెరడు గరకుగానుండును. లేతకొమ్మలపై మెత్తనివెండిగలదు. దీనిపుష్పములు చాల మంచివి. దీని చెక్క చూర్ణము గొడ్డుమోతుగేదెలకు, ఆవులకు పెట్టిన చూలు నిలుచును. ఈ

చెట్టుగింజలు నేత్రరోగములకు పనిచేయును.

పోకచెట్టు - Betul nut:—సం: అక్షోటః, హిం: యూ: సుపారీ, అర: పాక్. ఈచెట్లు చిరకాలమునుండియు మనదేశములో పెంచుచున్నారు. పోకచెక్కలో ఆల్కాలాయిడ్ ఎరీకలైన్ అను ఒకవిధమగు చమురు నూటికిఒకవంతు యుండును. నూటికి 14 వంతులు టానికుయుండును. గాలిక ఆసిడ్ కూడ నుండును. కానతాంబూలము వేయుటవలన ఎఱ్ఱనిరంగువచ్చును. దీనిచూర్ణము వగరుగనుండును. వేడిజేయును. విరేచనములకు, కడుపులోని వాతపునీరు దీసివేయుటకుపనిచేయును. దూడలు పారుకొనిన వీటిని బెట్టవచ్చును.

మో:—తులము లగాయతు 2 తు. వరకు.

పాలు - Milk:— రుచిగనుండును. బలముచేయును. కాకజేయును. విరేచనము గానించును. పశువులకు వాతలు వేసినతరువాతను, బుడ్డకొట్టిన తరువాతను తదితర వాతరోగముల కుపయోగింపవచ్చును.

పాలతుత్తము - White Vitriol:—సం: ఖర్పరి, హిం: యూ: సపేదుతూతియా, అర: పాలతుతం. వెగటుగ కారముగ నుండును. చర్మరోగములకు, వాతరోగములకుపనిచేయును.

పాలచెట్టు - Holostemma Rheedei:—సం: జీవంతి, హిం: యూ: జీవాశాకు. దీనినే పాలకూరచెట్టందురు, సన్నముగ పొడవుగ నుండు ఆకులును పాలునుగలిగి తీగెబ్రాకెడు

చెట్టు. దీనివేరు, చెక్క లేక ఆకు రసము వెగటుగ నుండును. చలువచేయును. వాతరోగములకు నేత్రరోగములకు, పని చేయును.

బ

బొమ్మజెముడు – Euphorbia:— సం: వజ్రికా, వజ్రకంటకః, హిం: యూ: థూహార్, అర: షద్రెశ్కిల్లిచత్తూర్. ఇది సాధారణముగా కంచెలమీద పెరుగును. ఇది 2 3, 4 పలకల తోగాని, గుండ్రముగాగాని బొమ్మలవలె చెట్టులేచును. పలకల అంచులను, లేక చుట్టును ముండ్లుండును. దీనిపాలు పశువులకు కలుగు వాతరోగములకు, నేత్రరోగములకు, చర్మవ్యాధులకు పనిచేయును. దీనిపాలు ఒకగుడ్డకు దట్టముగా పట్టించి ఎండబెట్టి కాల్చి మసిజేసి ఆముదముతో కలిపి పశువులకు కలుగు తోక నుసిమిరి, నుసిమిరి మొదలగు చర్మవ్యాధుల కుపయోగించవచ్చును కఱవుకాలములో దీనిమట్టలను పశువులకు బెట్టుదురు. మట్టల ముండ్లు నూగు తీసిపెట్టవలెను లేనిచో పేగులలో వ్యాధులు పుట్టును. ఇంకను పాలు మంచినూనెలోకలిపి పశువులకు సంభవించు పెద్దరోగ మను వ్యాధికి టీకాలు వేయుదురు.

బ్రహ్మదండి – Argemone Mexicana:—సం: అజదండీ, హిం: యూ: ఘమోయా, అర: బ్రమదుండూ. దీనినే బలురక్కసియందురు. ఇది పసుపుపచ్చని పువ్వులు పూసెడుచెట్టు. ఈమొక్కలు అన్నిచోట్లను పెరుగును. దీనిగింజలనుండి చమురు తీయుదురు. ఈచమురు తలుపులకును, బల్లలకును రాచిన

కాంతిగలుగును. చిత్రపటములు వ్రాయుటకుగూడ నుపయోగించుదురు. దీని ఆకురసము వేడిజేయును. పశువులకు కలుగు చర్మవ్యాధులకు, విషపురుగుల కాట్లకు బాగుగా పనిచేయును. ఇంకను చెరుమాదయిన పశువునకు ఈకొమ్మలనుండి వచ్చు సొనను మాదవాపుపైన రాచిన తగ్గును.

బిళ్లుడు - ఈచెట్లు రాతినేలలయందు పెరుగును. ఆకులు పత్రవైఖరి. చిట్టియాకులు ఇరువది జతలవరకుండును. దీని కలప చాల బాగుగానుండును. ఈచెట్టుచెక్క కాల్చి మసిజేసి వెన్నపూసతో కలిపి అగ్రివాపులకు, తదితర వాపులకు రాచి మర్దనచేసిన బాగుగా పనిచేయును.

బొక్కెన - Nodiflora:— సం: జలపిప్పలీకంచటా, హిం: యూ: కాంచర, అర: పాదుతలై ఇది నీటివారలను లేనెడుచెట్టు నేలమీద పాకును. దీనిఆకులు చిన్నవిగనుండి గంట్లుగంట్లుగ నుండును. దీని ఆకురసము కాకచేయును. కర్ణరోగములకు, చర్మవ్యాధులకు, జీర్ణసంబంధమగు జాడ్యములకు ఈ ఆకురసము పనిచేయును.

బొగ్గు - Charcoal:—ఇది నిర్గంధకారియు, పొగవాయువులను పీల్చుకొనుశక్తియుగలది. దీనిని మెత్తగా పొడిజేసి గాయములకు పట్టించిన మానును. ఇది నీటిలోని మురికిని, కుళ్ళిపోయిన మాంసము మొదలగువాని దుర్గంధము తీసివేయును. ఈ పొడి వరి గోధుమపిండి నీటితో కలిపి ఉడికించి పశువులకు కలుగు వాపులకు గడ్డలకు కట్టుదురు. పశువులకు కలుగు మశూచివ్యాధికి కూడ నుపయోగించవచ్చును.

మో:—3 తులములు లగాయతు 6 తులములవరకు.

బెల్లము -Jaggery:—సం: గుడః, హిం: యూ: గుడ్, అర: బెల్లం: ఇది రుచికి తీయగా నుండును. ఆకలి మందముగా నుండు నపుడు ఆహారవస్తువులతో జేర్చి యిచ్చిన రోగికి హితవుగా నుండును. శరీరమునగల నీరుదీయును. పాతబెల్లము శ్రేష్ఠము. మలవిసర్జనము గావించును.

మో:—3 తులములు లగాయతు 6 తులములవరకు.

బంక:—ఇది వెలగ తుమ్మ మొదలగు వృక్షజాతులవల్ల ఉత్పత్తియగును. మితముతప్పి భేదియిచ్చుటవల్లను, విషవస్తువులు తినుటచేతను కలిగెడు విరేచనముల సిలుకుపుటకు బంక నీళ్ళను త్రాగించెదరు. ఇంకను పొడితో మాత్రలు చేసినపుడు దీనిని వాడుదురు. మో:—తులములగాయతు 2 తులములవరకు.

బాడిద - Erythrina Indica:— సం: పారిభద్రః, హిం: యూ: ఫరాహాద్, అర: మూరుక్కూమరం. ఈ చెట్లు పెద్దవిగనే పెరుగును. మాన్నుకు, కొమ్మలకు చిన్న ముండ్లుండును. ఆకులకు తమ్మెలుండును. దీని పై బెరడు నునుపుగాను, తేలికగాను నుండుట. వీనిలో ఎరుపు తెలుపు బూసెడు పువ్వులుగల చెట్లు గలవు. తెలుపు పువ్వులుగల చెట్లు శ్రేష్ఠము. దీని చెక్క ఆకురసము వెగటుగ కారముగ నుండును. రసము వేడిజేయును.

మో:—పసరు గొట్టమువరకు పోయవచ్చును.

బాలింతబోలు - Balsamodendron Myrrh:—సం: బోలః, హిం: యూ: బోల్, అర: వెళ్లెయిపూపోలం: ఈ చెట్లు

మన దేశములో అంతగ లేవు. ఈచెట్లనుండి జిగురువంటి పదార్థము వచ్చును. ఇది సువాసనగ వెగటుగ చేదుగ నుండును. శిరోజాడ్యములకు, కవుకు దెబ్బలకు నుపయోగపడును.

బావంచాలు- Psoralea corylifolia:—సం: వాగుజీ, హిం; యూ॰ వాయచీ, అర; కర్వ్యాకరిషి. వీనినే కారుగెచ్చ యందురు. ఈగింజలు సువాసనగ చేదుగ నుండును. దేహములోని మలమును వెడలించును. ఇంక చర్మవ్యాధులకు క్రిమిరోగములకు బాగుగా పనిచేయును.

బొబ్బరలు:—ఈ మొక్కలు. మంచి నేలలయందు ఎత్తుగా పెరిగి తీగలవలె నల్లుకొనును. నీలివర్ణపురంగుగల పువ్వులు పూయును. ఈగింజలను మాగానిచేలగట్లమీద వేసి కాడపెంచి పశువులకు మేపుదురు. కాని పశువులకు ఈకాడ అంతగా లాభము లేదు. దీనిలో పసరుమాత్రి మెక్కువగా నుండును. ఈపసరువలన పశువు నీరు డధికముగా పోయును. విరేచనముగావించును. ఇది అన్నివిషయములలోను పెసర పంటను పోలియుండును.

బండిగురివింద-Adenanthera pavonia:—సం: వాసంతీ; హిం: యూ: మాధవి, అర: పెరుగుండుమణి. దీని చెక్కరసము చేదుగ నుండును. విషపదార్థమువంటిది. దీని ఆకును పారుడురోగ మెక్కువై నీరసముగా నున్న పశువునకు పెట్టినె నెమ్మదియగును. దొమ్మలకు అరుగ్రివాపులకు పనిచేయును.

బరివెంక చెట్టు - Streblus aspera:—సం: అజక్షీర

వాశః, హిం; యూ; మాజరియూ౯, అర; పిరాయ్. దీని ఆకులు గరకుగ నుండును. గాయములకు, చర్మవ్యాధులకు ఈ చెక్క చూర్ణము పనిచేయును.

బూడిదగుమ్మడి - Ash coloured ground:— సం: భస్మకూష్మాండః, హిం: యూ: పేఠా, అర: కల్యాణపూసిని కాయ్. ఆకులకు పొడుగగు అయిదు తమ్మెలుగలవు ఈకాయలు చలువజేసి నీరుపెట్టును. చూడిపశువులకు విస్తారముగా ఈ కాయలు వాడుదురు.

బూరుగబంక - Gum of silk cotton tree:— ఇది బూరుగచెట్టుబంక ఇది వగరుగ తియ్యగ నుండును. ఇదిచాల వగరువస్తువు దీనిలో ఎక్కువభాగము టానిక్ యాసిడ్, గాలిక్ యాసిడ్ నుండును. ఈబంకను వాతరోగముల కుపయోగపడును.

బ్రాంది - Brandy:—శాకజేయును. అకస్మాత్తుగా దెబ్బతగిలి మూర్ఛిల్లిన పశువునకు త్రాగించిన వెంటనే నొప్పులుతీయును. నరములకు సత్తువ నిచ్చును. తాపము నణచును.

మ

మఱ్ఱి - Banian tree:—సం: వటః, హిం: యూ: బర్గద్, అర: అలమరం. దీని లేతయాకులను కొమ్మలను పశువులు ఏనుగులుకూడ తినును. ఈచెట్లనుండి రెండవరకము రబ్బరు వచ్చును గాని అంతమంచిదిగాదు దీని ఆకులు లక్కపురుగులు తిని బ్రిదకును. దీనియూడలను శరీరమందే భాగము

విరిగినను, తొంటినొప్పి కడుపునొప్పి మున్నగు వ్యాధులకును బాగుగా పనిచేయును. దీనిపాలు వాతనొప్పులకు పనిచేయును.

మణిశిల - Realgar:—సం: మనోహ్వా: హిం: యూ: జహేర్ మొహరా: అర: మనోశిల ఇదియొకవిధమైన వంట పదార్థము. శ్యామవర్ణముగను, మిక్కిలి ఎఱ్ఱగను, బాగివలె తళతళ లాడుచుండును. ఇది చేదుగా వెగటుగా నుండును. లోనికిచ్చిన వేడిచేయును. చర్మవ్యాధులకు, మలిమిడికుంటు నకు, కణతులకు బాగుగాపనిచేయును. మో:—అరతులంవరకు.

మహిసాక్షి - Agallocha:—సం: భూమిజగుగ్గులుః హిం: యూ: గూగుల్ కోకిల్: అర: కుక్కుల్ మహిసాక్షి. ఈ చెట్లు హిందూస్థానమునం దెక్కువగా బెరుగుచున్నవి. శీతాకాలమునందు వానిమీద గంట్లు పెట్టినయెడల జిగురువంటి పదార్థము వచ్చును. ఇది పరిశుభ్రముగా నుండినయెడల కొంచెము పచ్చగానుండును. ఇది చేదుగ వెగటుగ నుండును. కాక జేయును. దీనిని లోపలికిచ్చినయెడల తదితర మందులతో కలిపి ఇవ్వవలెను. వ్రణములు, గడ్డలు, కణతులు మొదలగు వానికి పనిచేయును.

మో:—అరతులము లగాయతు ఒకతులమువరకు.

మంజిష్ట - Rubia Cordifolia—సం: మంజిష్ఠా హిం: యూ: మజీట్ మజీల్, అర: మందిట్టా. ఈలతలు చాలా పెద్దవి. ఇవి చెట్లమీద పాకుచుండును. మాను లావుగనే యుండును. ఒకజత ఆకులు పెద్దవి. ఒకజత ఆకులు చిన్నవి.

తీని వేరునుండి కూడ ఎఱ్ఱని రంగువచ్చును. మంజిష్ఠ కాకజే యును. నేత్రరోగములకు, కర్ణరోగములకు బాగుగా పని జేయును.

ముర్దారుసింగు - Plumbi oxibum:—సం: కంకుష్ఠం: హిం: యూ: ముర్ తక్: అర: మురదారుకింగు: మిగుల వేడి జేయును. చర్మవ్యాధులకు బెణుకునొప్పులకు మలిమిడి కుంటు నకు బాగుగా పనిచేయును. మోతాదు లోపలికిచ్చునపుడు జాగ్రత్తగా నియ్యవలయును.

మజ్జిగ - Butter milk:—చలువచేయును. తేలికగ నుండును. వగరు పులుపు గలిగియుండును రక్తములోని వేడిని తీసివేయును. కాకరోగములకు, తదితరమందులతో మజ్జిగ కలిపి ఈయవలెను.

మొక్కజొన్నలు - Zi-maize:—సం: యావనాలః, హిం: యూ: మక్యీ, అర: మక్కచోళం. ఇది పశువులకు ముఖ్యమైన ఆహారముగానున్నది. నల్లభూములమీదను, గరప నేలలయందును మొక్కజొన్న పైరగుచున్నది. దీనిని ఇతర దేశస్థులు ఉపయోగములోనికి దెచ్చి బజారులో "కార్న్ ఫ్లోర్" అని పిలువబడు పిండిని చేసి అమ్ముచున్నారు. లేత మొక్కజొన్నలు రుచిగ పుష్టికరముగ నుండును ముదిరిన కొలది వాతముజేయును. ఎండుచొప్ప, పచ్చిచొప్పకూడ పశు వులకు దివ్యమైన ఆహారము.

మోదుగ - Butea Frondosa:—సం: పలాశః, హిం: యూ: పలాస్, అర: పొరాసుమ్: ఈ మొక్కలు కొండ ప్రదే

శములలో పెరుగును. దీని యాకులమీదను, కొమ్మలమీదను తెలుపురంగుగల మెత్తని పదార్థముండును. దీనిపువ్వులు చిక్కుడుపువ్వులవలె నుండి ఎఱ్ఱగను, పెద్దగనుండును. వీటి మీద వెండివలె మెరయుచుండు రోమము లుండును. దీని చెక్క రసము వెగటుగనుండును. వాతరోగములకు, జీర్ణసంబంధమగు జాడ్యములకు పనిచేయును. ఈచెట్టు బంకలో మూచికాయ వంటి ఒగరుపదార్థము గలదు. మోదుగపువ్వు వెగటుగ, చేదుగ నుండును. కాకజేసి విరేచనము గావించును. సరకు దొమ్మ మొదలగు వ్యాధులకు బాగుగా పనిచేయును.

పువ్వు మోతాదు:— తులములగాయతు 3 తులములవరకు.

మిరియాలు - Black pepper—సం: మరీచం, హిం: యూ: కాలీమిర్చి, అర: మిళగు. ఈచెట్లు మలబారు దేశమునం దెక్కువగా పెరుగుచున్నవి. వీటికి విస్తారము నీరవసరము లేదు. మొక్క వేసిన మూడువత్సరములకే కాయలు కాయ నారంభించును. వీనిలో రెండుమూడు రకములు గలవు. కొన్ని, కొన్ని నొక్కులుగా నుండును. మిరియాలను నీటిలో నాన బెట్టి తీసిన తెల్లమిరియాలందురు. కాకజేసి ఆర్చును. నల్లమిరి యాలు వాతములకు, శ్వాసరోగములకు ఒగర్పు నేత్రరోగ ములకు పనిచేయును.

మో:=తులములగాయతు 3 తులములవరకు.

మిరెప - Capsicum Annum:—సం: బృహన్మరీచం, అరుణాత్మికా, హిం; యూ; లాల్ మిర్చి అర; మిళగాయ్

ఈచెట్లలో ననేకజాతులు గలవు. ప్రస్తుతము మనరాజధానిలో పైరుచేయబడుచున్న రకములన్నియు కారమునకుపనికివచ్చును. ఇవిగాక బెంగుళూరులోనున్న కొందరు గింజలవర్తకులు కొన్ని క్రొత్తరకముల మిరెపకాయలను తెప్పించుచున్నారు. మన దేశపు కాయలవలె అంతగా కారముండదు. చూచుటకు మాత్రము ఆశ్చర్యకరముగా నుండును. వీనిలో ముఖ్యమైనవి ఏనుగు తొండపు మిరుపకాయలనియు, చీనా దేశపు రాక్షస మిరెపకాయ లనియు, ఎద్దుముక్కు మిరెపకాయ లనియు, వజ్రపురాజనియు పిలువబడుచున్నది. ఈరకములలో విస్తారముగ గింజలుండవు. ఇవి పొలములలో వేయుట కంత శ్రేష్ఠమైనవి గావు. మనదేశములో రెండురకములు గలవు కొన్ని పొట్టివిగను, మరికొన్ని పొడుగుగ నుండును. వీటిని మనదేశమునకు పోర్చుగీసువారు తీసికొని వచ్చిరట. ఎండువి ఔషధములలో నుపయోగించవలెను. కాక జేయును. సరకు దొమ్మ కడుపుబ్బు కడుపునొప్పి సమస్తమైన నొప్పులకు పనిచేయును. కారపుపాలు సామాన్యముగ పశువులకు కలుగు ప్రతివ్యాధికి మనరైతులు వాడెదరు. ఇది చాలపొరబాటు. తగిన వ్యాధులకే ఉపయోగించవలెను.

మో:- ఒకగొట్టము మొదలు 4 గొట్టములవరకు.

మెంతులు -Fenu greek seeds:—సం: మేథిః, హిం; యూ: మేథీ, అర: వెందియ్యం. ఈమొక్కలు సీటిప్రదేశములయం దెక్కువగా పెరుగును. నల్లభూములును, ఒండుభూములును ఈపెరునకు శ్రేష్ఠము. ఇసుకభూములు పనికిరావు

కాయలు కాయగనే చెట్టు ఎండిపోవును. ఇవి వేడిజేసి ఆర్పును. మలబద్ధకము గలిగించును. అజీర్తి కడుపునొప్పి కడుపుబ్బు విరేచనములకు పనిచేయును.

మో:—తులము లగాయతు 3 తులములవరకు

మునగ - Moringa—సం: శిగ్రుః, హిం: యూ: సాజినా; అర: మురుంగాయ్. ఈమొక్కలు చాలచోట్ల బెరుగును. దీనినుండి జిగురువచ్చును. ఈజిగురు తెల్లగానుండి క్రమముగా నెఱ్ఱబడును. గింజలనుండి పరిశుభ్రమైన నూనెవచ్చును. ఈనూనెను యంత్రములకు రాయుట కుపయోగించును. దీని చెక్కరసము వేడిజేయును. నాలిదొమ్మకు, చర్మవ్యాధులకు పనిచేయును.

మాచికాయలు - Oak galls—సం; మాయాఫలం; హిం: యూ: మాఫల్, అర; మాశికాయ్. ఇవి బజారు కొట్లలో దొరకును. దీనిరసము వెగటుగ నుండును. నరకు జీర్ణ సంబంధమగు రోగములకు పనిచేయును.

మో:—తులము లగాయతు 3 తులములవరకు.

ముష్టి - Nuxvomica —సం: విషముష్టిః, హిం: యూ: కోచిలా, అర: ఎట్టికొట్టయి. ఈమొక్కలనే ముసిడి, ముషిణి అందురు. ఈకుటుంబపు పెద్దచెట్లు గుబురుమొక్కలు గూడగలవు. ఆకులు అండాకారముగనుండి ఆకుపచ్చరంగుగను, తెలుపురంగుగను ఉండును. ఈచెట్లు చిట్టడవులలో ఎక్కు

వగా నుండును. ఈచెట్లకాయలు నిమ్మకాయ ఆకారముగా నుండును. ఈగింజలనుండి చమురుతీయుదురు. ఈచమురు కాక జేయును. చెట్టుయొక్క ప్రతిభాగము చేదుగనుండును, కాని దీనిలో పశువులను చంపగల బలమైన విషముగలదు. విత్తుల పొడి రక్తమూత్రము, మలబద్ధకము, పక్షవాతము మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును.

మో:—అరతులము లగాయతు 1 తు. వరకు.

మూరొ్కండ - Acalypha Indica:—సం: రూప గంధా, హిం: యూ: పాచీ, అర: కుపామణి. మూరొ్కండ అన్నిచోట్ల బెరుగును. దానిపువ్వులగుత్తు లందముగా నుండుటచే తోటలలో పెంచుదురు. ఈచెట్టు కుప్పింటచెట్టుజాతిలోనిది. కుప్పింటచెట్టు గుణములే దీనికికూడ గలవు. ఆకురసము కర్ణరోగములకు చర్మరోగములకు బాగుగా పనిచేయును.

మెలవగడ్డి :—ఈగడ్డి సారవంతములగు జిగురుగానుండు ప్రదేశములలో మొలచును. ఈగడ్డి పశువులు తినిన బాగుగా బలియును. పాడిపశువులు లెస్సగా పాలిచ్చును.

మేకపాలు -Milk of goat:—అన్నిపాలకంటెను మేక పాలు శ్రేష్ఠమైనవి. కాకజేయును. శరీరమునకు బలముకలుగ జేయును. కురమ, బుస, వాతము, పక్షవాతము మొదలగు వ్యాధులకు పనిచేయును.

మంగ -Randia dumetorum:—సం; మదనః: హిం: యూ: మైనఫల్ కర్ హార్, అర: మరుకకరయా. ఇదియొక

గుబురు మొక్క. చాలా చోట్ల పెరుగుచున్నది. దీని కాయరసము కారముగ, వెగటుగ, చేదుగ నుండును. వాతరోగములకు, చర్మవ్యాధులకు నోటిపూతకు పనిచేయును.

మినుములు - Black gram:—సం: మాషః, యూ హిం: ఉడద్, అర: ఉళుందు. వరికోసినతరువాత సాధారణముగా మినుములు చల్లుదురు. కొన్నిసమయములలో జొన్నతోను, ఆముదముతోను మెట్టనేలలో పండును. ఇవి పెసర వేయుచేల కంటె కొంచెము బిరుసువారిన భూములలో వేయవలెను. మినుములు జిగురు చమురు కలిగియుండును. బలముకలుగజే యును. ఎముకలు విరుగుట, పాలు చేపకుండుట మొదలగు వానికి వాడుదురు. పాడిపశువులకు మినపపిండిని పెట్టిన పాలెక్కువ యిచ్చును.

ముళ్లతోటకూర - Amaranthus spinosus :— సం: తండులీయకః, హిం: యూ: టండులియాచౌలాయియాఅల్పమర్ సా, అర: ములుకుక్కీరై. ఈ మొక్కలు వర్షాకాలములో విశేషముగా పెరుగును. దీని ఆకులవద్ద ముండ్లుండును. రెండడుగుల ఎత్తువరకు బెరుగును. దీనివేరురసము వెగటుగనుండును. ఈ చెట్లలో ఎరుపు, తెలుపు అను రెండుజాతులుకలవు. ఎరుపుజాతికంటె తెలుపుజాతిది మంచి దందురు. ఈఆకు పాడి పశువులు తిని బాగుగాపాలిచ్చును. కాళ్లజాడ్యములకు మెత్త గాళ్లకు, చర్మవ్యాధులకు ఆకు బాగుగాపనిచేయును.

మో:—ఒకపిడికెడు లగాయతు 3 పి. వరకు.

మైనము - Wax:— ఇది జుంటీగలవల్ల ఉత్పత్తియయ్యెడి పదార్థము. పసుపువర్ణముగను, మెత్తగను జిగటగనుండును. దీనిని ముఖ్యముగా శాళాస్త్రిర్లలో వాడుదురు. ఇది విరిగిన అవయవములను అతుకుకొనజేయును. నరములకు సత్తువజేయును. ఇంకను దీనిని తైలములలో కలిపి గాయములకు వ్రణములకు రాయుదురు.

మేకవదరు:— మేకలను కసాయివాడు కోసినవెంటనే లోపలనుండు వెచ్చనివదరు తీసికొనివచ్చి పశువులకు కలుగు నుసిమిరి మొదలగు చర్మవ్యాధులకు వాడినచో బాగుగా పని చేయును.

మ్రానుపసుపు - Berberis Asiatiea:—సం: దారు హారిద్రా, హిం: యూ: దహారూహాల్దీ, అర: మరమంజిల్. ఇది పెద్దతీగె. దీనియాకులు హృదయాకారము: దానిమీద 5-7 ఈనెలుండును. కొమ్మలను చిన్నచిన్న ముక్కలుగజేసి నీటిలో నానవేసి వానిని తినిపించి మిగిలిననీరు త్రాగించిన జీర్ణసంబంధమగు జాడ్యములు తగ్గును. రసము చేదుగ నుండును. వాతరోగములకు, చర్మ, నేత్రవ్యాధులకు పనిచేయును.

మొగలి - Pandanus Odoralissimus:— ఈచెట్లు విస్తారముగ సముద్రము నగ్గరగానుండు ప్రాంతములయందు మొలచును. దీనిపువ్వులు సువాసనగనుండును. దీని చెక్కరసము మూత్రరోగములకు పనిచేయును.

## ర

రాగులు - Ragi:—ఇది నాలుగు మాసములలో

పండునట్టి పైరు. ఇది రుచికరమైన పదార్థము. ఇందు పెద్ద రాగులు, చిన్న రాగులు, నల్లరాగులు, తెల్లరాగులని నాలుగు విధములు. మే నెల మొదలు జూలై వరకు కురియు వర్షముల లోనో, లేక అక్టోబరు లగాయతు డిశెంబరు నెలవరకు కురియు వర్షములలోనో, విత్తబడును. పశువులకు జొన్నకుడితిపోయు రైతులందరు రాగికుడితిగూడ బోయుదురు. ఈగడ్డి చాల శ్రేష్ఠమైన ఆహారము. పాడిపశువులు తినిన లెస్సగా పాలి చ్చును.

రక్కెన:—దీనిని పశువులకాహారముగా నుపయోగిం పవచ్చునని నిశ్చయింపబడెను. ముండ్లు కాల్చివేసి దీనిని ప్రత్తి గింజలతో కలిపి పశువులకు మేపిన చెరుపులేదని ఈమధ్య పుసహాలో జరిగిన ప్రయోగమువలన దెలియుచున్నది. ముండ్లు కాల్చుటకు ప్రత్యేకపు దీపములు లమర్చబడి యున్నవి. నూరు పౌనుల రక్కెన మట్టలతో 6 పౌనుల ప్రత్తిగింజలు కలిపి మేపుట మంచిదని నిర్ణయింపబడెను.

రెల్లుగడ్డి - Red grass;— సం: శరం, హి: యూ: కాన్‌రా, అర: నానెల్. ఈగడ్డి కాలువగట్లమీదను, తేముగా నుండు స్థలములందును పెరుగును. ఇవి సాధారణముగా 5, 10, 15 అడుగుల యెత్తువరకు బెరుగును. వేరు లోతుగా వ్యాపించి యుండును. ఆకులు సన్నముగా పొడుగుగానుండును. వాని అంచులను, ఆకులను మెలివేసి త్రాళ్లువేయుదురు. తడ కలు అల్లుదురు. లేతమొక్కలు గేదెలుమాత్రము తినును. పశువులకు ఇదిఅంత శ్రేష్ఠమైనదికాదు.

రక్షలు :— చిన్నదూడలకు సంభవించు దొమ్మలకు, వాపులకు, తదితర ఆకస్మికపు వ్యాధులకు రక్షలు వేయవచ్చు ను. అనుభవపశు వైద్యులచే మాత్రము వేయించవలెను. కాని అతివిశేషముగా మాత్రము కాల్చరాదు. తగు జాగ్రత్తవహించి రోగము ముదిరినచో రక్షలు వేయుట మంచిది.

రేవల్చిన్ని-Rhubarb—సం: రావణాద్; హిం: యూ: రేచంద్,చీనీ; అర: రేవల్‌శిన్ని. ఈమొక్కలు హిమాలయ పర్వత ప్రాంతముల పదునొకండువేల యడుగుల యెత్తున బెరుగుచున్నవి. ఈమొక్క వేరును కోసి పైచర్మము వలచి ఎండబెట్టి అంగళ్ళయందు అమ్ముచున్నారు. దీనినే రేవల్చిన్ని యందురు. ఇది చీనా, టిబెట్టు దేశము లనుండియు లండను పట్ట ణము నుండియు గూడవచ్చుచున్నది. రసము పైత్యము జేయును. మూత్రము గానించును. శరీరమునగల నీరుదీయును. విరేచనము 7గావించును.మలబద్ధకమునకుమాత్రమెక్కువగదీనినివాడుదురు.

రుద్రజెడ - Sweet Basil —సం: జటావల్లీ; హిం: యూ: రేహాన; అర: పచ్చపుష్పం. ఈమొక్కలు ప్రతిదొడ్డిలోను సాధారణముగా నుండును. ఆకులు మంచి వాసనవేయుటచే దానిని తోటలలో వేసి పెంచుచున్నారు. దీని ఆకురసము అజీర్తి పేడపెంటికలుగా వేయుట నీరుచురుకు మున్నగు వ్యాధులకు పనిచేయును.

రేగుచెట్టు - Jujube tree—మనదేశమునం దంతటను ఈచెట్లు బెరుగుచున్నవి. దీనియాకులకు మూడు పెద్ద ఈనెలు

గలవు. అండాశయమున రెండుగదులుమాత్రి మున్నవి. ఈ చెట్లలో రెండుమూడు రకములు గలవు. కొన్నిటిపండ్లు పెద్దవి గను కొన్నిటివి చిన్నవిగను కొన్నిటివి కోలగను ఉండును. ఈ చెట్టు బెరడును చర్మములు బాగుచేయుటకును నీలిమందు చేయుటకును వాడుదురు. పండ్లను ఔషధములలో నుపయోగింతురు. పెద్ద చెట్లకలప పెట్టెలు మొదలగునవి చేయుదురు. దీని చెక్కరసము వగరుగనుండును. కాక జేయును, వాతరోగములకు అతిసారము మున్నగు వ్యాధులకు బాగుగా పని చేయును.

## ల

లవంగాలు - Cloves—సం: లవంగ, హిం: యూ: లోంగ్, అర: కిరాంబు. ఈచెట్లను పెంచుటకు మళ్ళలో నడుగడుగు దూరమున కాయలు పాతెదరు. కాయ లెంతయెండకుండిన నంతమంచిది. ఎండినచో వానిశక్తి తగ్గిపోవును. పాతిన వారముదినముల్లకవి మొలకలెత్తును. ఈచెట్లు రేగడినేలలయందును, ఇసుకనేలలయందుగాని పెరుగవు. బురదనేలయందు మొలవనే మొలవవు. కొంచెము ఇసుకతోనుండిన నేలలు మంచివి. వీనికి నీటియాధారము బాగుగా నుండవలయును. మొక్క వేసిన ఆరుసంవత్సరములకు కాయలుకాయ నారంభించును.

లక్క - Coccus Lacca:—సం: లక్షా, హిం: యూ: లాఖ్, అర: అరక్కు. దీనిచూర్ణము వెగటుగ నుండును. వేడి జేయును. కొన్ని మందులలోకలిపి దీనిని వాడుదురు.

# వ

వస - Acoveus Calamus:— సం: వచా, హిం:యూ: బచ్, అర: వమంబు. ఈమొక్కలు హిమాలయపర్వతముల మీదనే పెరుగుచున్నవి. దీనిలో రెండుమూడు రకములున్నవి. దీనియాకులనుండి తైలముదీయుదురు. ఇది ఎరుపు, తెలుపు, బూడిదవర్ణము కలదిగనుండును ఇదియొకచెట్టువేరు. ఈవేరు సువాసనగ, చేదుగ, కారముగ నుండును. దీనిరసము కాక జేయును. పశువులకుకలుగు వాతములకు, ధనుర్వాయువు, శిరోసంబంధమగు వ్యాధులకు, విషపురుగుల కాట్లకు, చర్మ వ్యాధులకు పనిచేయును.

మో:—అరతులము లగాయతు 2 తులముల వరకు.

వాము - Omum Seeds:— సం: అజమోదా, హిం: యూ: అజ్ వాయిజ్, అర: అల్మీదాహం, బంగాళా రాజధానిలో దీనిసాగు విశేషముగా జరుగుచున్నది. ఈజిప్టు, పర్షియా, ఆఫ్గనిస్థానము మొదలగు దేశములలోగూడ గొంతవరకిది పైరగుచున్నది. ఐరోపాఖండమునం దిటీవల ప్రవేశపెట్టబడి కొన్నిచోట్ల సాగులోనున్నది. వాముమొక్క మిగుల సన్నముగ జీలినయాకులు గలిగియుండును. అరగజ మెత్తువరకు పెరుగును. మనరాజధానిలో వాముసాగు అరుదు. గోదావరి జిల్లాలోను, మరికొన్ని యితర తాలూకాలలోను దీనిని నీరుకట్టి పైరుచేయు పొగతోటలలోను, ఉల్లినారుమళ్ళలోను జల్లుదురు. వాము బట్టిపెట్టి తీసివేసిన పిప్పి పశువులకు తినిపించిన ఆరోగ్య

కరముగ నుండును. కాయలను బట్టీపెట్టి చమురుతీయుదురు. చమురుపైన తెల్లగఉప్పువంటి పదార్థమొకటి వచ్చును. దీనినే వాముపువ్వు అందురు. వాము జీర్ణకారియగుటచే దీనిని అతిసారము, కడుపునొప్పి, కడుపుబ్బు, శూలనొప్పి మొదలగు జాడ్యములకు వాడుదురు.

మో:—తులము లగాయతు 4 తులములవరకు.

వాయువిడంగములు - Embelia Robusta:— సం: విడంగం, హిం: యూ: బాయవిడంగ, అర: వాయువెలంగం. వీటిలో ఎంబ్లిక్‌యాసిడ్ అను ముఖ్యమైన పదార్థము గలదు. వీటిచూర్ణము, నీటితోనూరితీసినరసము కొద్దిచేదుగనువాసనగ నుండును. చలువచేయును. వాతరోగములకు, దగ్గు, రొంప, మొదలగువానికి పనిచేయును.

మో:—అరతులం లగాయతు తులమువరకు.

వావింట - Cleome Pentaphylla :— సం: బర్బరా, హిం: యూ: హిల్‌వర్, అర: వేళై. ఈమొక్కలు మూరెడు గుల ఎత్తువరకు పెరుగును. లేతకొమ్మలకు పైనుండు రోమములు జిగటగ నుండును. తొడిమపైన చిన్నచిన్న ముళ్ళ వంటి కాడ లుండును. పువ్వులుచిన్నవి. దీనిఆకులను గింజలను మందులలో వాడుదురు. దీనిఆకుపసరు వేడిజేయును. చర్మ వ్యాధులకు, శిరోవ్యాధులకు, కర్ణవ్యాధులకు ఆకుపసరు బాగుగా పనిచేయును.

వావిలి - Vitex Negundo:— సం: నిర్గుండీ, హిం:

యూ: సమ్హాలూ, అర: చిందూవారము. ఇవి పెద్ద గుబురు మొక్కలుగా బెరుగును. దీనిఆకులు చీలియుండును. చిన్న యాకులు మూడో, అయిదో యుండును. దీనికి ఘాటయిన వాసన గలదు' పుష్పాలు నీలముగ, ఊదారంగుగ నుండును. దీనిపసరు వేడిజేయును. ఈపసరులో పశువు కడుపులోనుండు నులిపురుగులనుచంపు శక్తి గలదు. పసరు కాకజేయును. వాతములకు జీర్ణసంబంధములగు జాడ్యములకు, కసిమిరి, తుమ్ముల రోగము, ఉంగిడి, కల్లవాపులు మున్నగువ్యాధులకు దీనిపసరు బాగుగా పనిచేయును.

పసరు మో:—అరసోలెడు లగాయతు సోలెడువరకు.

వాకుడు - Solanum Jacquini:—సం: కంటకారీ,హిం: యూ: భట్ కట్టైయా, అర: కందనకట్టారి. ఈ మొక్కలు అన్ని చోట్లను బెరుగును. దీనిఆకుపసరు వెగటుగ కారముగ నుండును. రసము కాకజేయును. నాసికారోగములకు, కొమ్ముడొల్లలకు పసరు పనిచేయును. కొందరు వైద్యులు పశువునకు కలుగు పుండులో పురుగులు పడినయెడల ఈచెట్లలో ఒకదానిని తీసి వేయుదురు.

వాతలు:—పశువులకు కలుగు దొమ్మ, గురక, వాతము మొదలగు రోగములకును, కాళ్ళకు సంభవించు వాపులకును ఈవాతలు బాగుగా పనిచేయును. కాని నెమ్మదియగు రోగ మునకుగూడ అనవసరముగా వాతలు వేయుదురు. ఇట్లు వేయుట చాలా పొరబాటు. ఎన్నిమందులువాడినను పనిచేయనపుడు

మాత్రము వాతలు వేయవలెనుగాని, ఆరంభములోనే వేయుట అంతభావ్యముగాదు.

వేప – Margosa tree:—సం: నింబః హిం: యూ: నీమ్ అర: వేప్పమరం. ఈవృక్షములు మన దేశమునందు విస్తారముగా గలవుగాని వీని యుపయోగమునుగూర్చి అందరికి తెలియదు. దీనిసమూలమందలి యేభాగము నమలిచూచినను మిక్కిలి చేదుగానుండును. దీని వేరు, చెక్క, ఆకు, కాయ, పువ్వు మున్నగునవి వైద్యమున నుపయోగపడుచున్నవి. దీని జిగురు కూడ కొన్ని వ్యాధులకు పనిచేయును. ఈచెట్టునందు గాలిని శుభ్రపరచు మంచిగుణము కలదు. దొమ్మలకు కడుపునొప్పి వాతము దృష్టిదోషము గాయములు కాలినబొబ్బలు చర్మవ్యాధులకు దీం చెక్క ఆకు రసములు బాగుగాపనిచేయును. పాముకాటునకు వేపచిగుళ్ల పసరు ముక్కురంధ్రములలో పిండినచో తుమ్ములు వచ్చును. రోగి బ్రతుకును. లేనిచో జీవించుట దుర్లభము.

మో:—పసరు పావుశేరు లగాయతు అర్ధశేరువరకు.

వెల్లుల్లి – Garlic:—సం: లశునం, హిం: యూ: లసూన్, అర: వెళ్లుల్లి. ఈమొక్కలు అన్నిచోట్లను పెరుగును. ఈపంట మన దేశములో ఎక్కువగా ఫలించుచున్నది. వెల్లుల్లి వాసన ఘాటుగానుండును. ఇది నీరుల్లివలెనే పనిచేయును. దీనిరసము కాకజేయును. ఈరసము చర్మముపైన ఎక్కువగా పూయరాదు. అట్లుపూసిన ఎఱ్ఱగా కందును. ఈరసము పేగులలోని పురుగులను నశింపజేయును. దీనియందు కుళ్ళకుండజేయు స్వభావము కలదు. వాతరోగములకు అజీర్తికి వాపులకు

చర్మవ్యాధులకు నేత్ర కర్ణరోగములకు నిది మిగుల నుపకారి
మో:—అరతులము లగాయతు 3 తులములవరకు

వెదురు - Bamboo :—సం: వంశః, హిం: యూ: బాస్, అర: మూంగిల్. ఈచెట్లు కొండలమీదను, అడవుల లోను విరివిగా పెరుగును. మొక్కలు గుబురుగా నుండును. వెదురు గింజలు చెట్టునుండి క్రిందపడగానే మొక్కలు మొలవ నారంభించును. లేతమొక్క ఆరంగుళముల పొడవుగా నున్న పుడే క్రిందబడి నాటుకొని వేళ్లుబారును. దీనియాకులో కోత కోయు స్వభావము గలదు రసము కారముగా చేదుగ నుం డును. చలువజేయును. కసిమిరి, నల్లకప్పు, విరేచనము మున్న గు వ్యాధులకు పనిచేయును. లేతయాకులలో కొద్దిగ మిరి యాలు ఉప్పును చేర్చి తినిపించిన పశువులకు కలుగు విరేచన ములకు బాగుగా పనిచేయును.

వెన్న - Butter:— వేడిజేసి చలువజేయును. పశువు లకు కలుగు పారుడురోగమునకు మూడుపూటలు మూడునిమ్మ కాయ లంతపరిమాణము వెన్నతీసికొని తినిపించిన వెంటనే శాంతించును. ఇంకను చర్మవ్యాధులకు తదితరమందులు వెన్న లో కలిపి మర్దనచేయుదురు. ఆవువెన్న పశువుకంటిలో పెట్టి చన్నీళ్లు మూడుదినములు కొట్టిన రేచీకటికి పనిచేయును.

వేడికాపడము - Fomentation with hot water:— నీరు మిక్కిలి వేడిగ మరుగకాచి దానిలో గొంగళిగుడ్డను గానీ, ముతకగుడ్డనుగాని ముంచి గట్టిగా నీరు పిండి ఆగుడ్డతో వాపులకు వాతనొప్పులకు కాచిన నొప్పులు హరించును.

వేపనూనె - Margosa Oil:— వేపగింజలనుండి నూనె తీయుదురు. చేదుగనుండును. కాకజేయును. రసికారుపొక్కులు, గోమారులు, మిన్నల్లులకు నూనె బాగుగా పనిచేయును. దీని లో వ్రణముల క్రిమ్యనాశ్శ శక్తి గలదు.

వెలగ - Wood apple tree: — సం: కపిత్థః, హిం: యూ: కైథా, అర: విలాంపజ్జం, వెలకపిత్తం. వెలగకాయలో టానిక్ యాసిడ్ అను పదార్థముగలదు. అందుచేత నిది పారుడు రోగమును కట్టించును. ఆకురసములో కూడ విరేచనముల కట్టించు గుణము కలదు.

వెంపలి - Galega Purpurea— సం: శాణపుంఖీ, హిం: యూ: సర్ఫోంకా, అర: కొల్లుకాయవెల్లై. ఈ మొక్కలు గరపనేలలందును, దొడ్లలోను మొలచును. దీనిఆకు పసరును కసిమిరి, తుమ్మలరోగము, మొదలగువానికి వాడుదురు.

మో:—పసరు అరగొట్టములగాయుతు గొట్టమువరకు.

వినఖొద్ది - Sida Acuta:— సం: పాఠా, హిం: యూ: కలియారీ, నిముకా అర: వట్టతిరుప్పి. ఇది ఒక చెట్టుదుంప. దీనిఆకులు కారముగ చేదుగనుండును ఈ మొక్కలెక్కువగా అడవులలో నుండును. దీని దుంపరసము చేదుగ, వగరుగ నుండును. చర్మవ్యాధులకు నుసిమిరికి దీనిదుంపరసము బాగుగా పనిచేయును.

వేరుశనగ - Ground nut:—సం: భూచణకః, హిం:

యూ. మూంగ్ ఫలీ, అర: నిలక్కడలై. ఇది అమెరికా నుండి 60 సంవత్సరములకు పూర్వము చైనావారివలన మన దేశమునకు తీసికొని రాబడినది. అందుచేతనే వీనికి చైనాబాదము కాయలని నామము వచ్చినది దీనిని గరపనేలల సాగుచేయుదురు. దీనిగింజలు చమురుతీయుటకుపయోగింతురు. మొక్కలు వేసిన ఆరుమాసములకు ఫలితమునకు వచ్చును. దీనికాయలు గుత్తులు గుత్తులుగ నుండును. వేరుశనగ పశువులకు మంచి ఆహారము. పాడిపశువు లీయాకులు తినిన యెక్కువ పాలిచ్చును. ఈగింజల నుండి చమురు తీయుదురు. దీనిని పిండివంటలు చేయుటకు నుపయోగించెదరు. కాని నువ్వులనూనెయంత శ్రేష్టమైనది కాదు. నువ్వులనూనెలో ఈనూనెకలిపి వర్తకులు అమ్మెదరు గానుగాడినతరువాత వచ్చుపిండి పశువులకు పెట్టుదురుగాని ప్రత్యేకముగా ఈపిండియే పెట్టుటవలన రోగములు వచ్చును. ఈపిండి ఉప్పులోకలిపి పెట్టినయెడల విశేషమైనబలము కలుగజేయును. ఈపిండిని పశువుల కెక్కువగా పెట్టి వాసిమలమూత్రములు జాగ్రతచేసి పొలములలో వేయుచున్నారు.

వెఱ్ఱిపుచ్చ- Citrullus colocynthus :— దీనిఆకుపసరు వాతనొప్పులకు పైనపూయుదురు. పసరు కాకజేయును. దీని వేరును పశువులకు కలుగు వాతములకు, నేత్రరోగములకు వాడుదురు.

విషకంటకాలు —Cuminum cyminum:- సం; అరణ్యకణా: హిం; యూ; కమూనీ, అర; కట్టుజీరగం. వీనినే అడవిజీలకఱ్ఱఅందురు. ఇది జీలకఱ్ఱవలె కోలగనుండును. మిక్కిలి

చేదుగనుండును. అజీర్తి, కడుపునొప్పి, కడుపుబ్బు మొదలగు వానికి పనిచేయును.

మో:—అరతులము లగాయతు తులమువరకు.

విభూతి-Sacred white ashes :— శరీరపీడ తీర్చును. పశువులకు కలుగు వాతములకు, పొడలకు, చర్మవ్యాధులకు పనిచేయును.

శ

శతపుష్పి — Ruta graveoleus:— సం: శాలేయః, హిం: యూ: సదాబ్, అర: అర్వదా: ఈమొక్కలు చాలా చోట్ల పెరుగుచున్నవి. కాయలను నీళ్లలో గలపి బట్టి పట్టి చమురు తీయుదురు ఆచమురును ఔషధములలోనికి సబ్బులు చేయుటకు నుపయోగించెదరు. దీని ఆకులు సువాసనముగా నుండుటచేత కూరలలో వాడుదురు. దీని ఆకురసము కారముగ చేదుగ వెగటుగనుండును. వాతసంబంధమైన వ్యాధులకు చర్మవ్యాధులకు గాయములకు దీనిగింజలు వాడుదురు.

మో :— తులము లగాయితు 2 తులములవరకు

శిలాజిత్తు – Bitumen :— సం: అశ్మజతు: హిం: యూ: శిలాజిత్, దీనినే కర్పూర శిలాజిత్తందురు. ఇదియొక జాతిరాయి కఠినములైన పర్వతములు తీక్షణమైన ఎండచే వగిలి దాని నుండి జిగురువంటి పదార్థము స్రవించును. ఇది ఓడకీలువలె కాంతి గలిగి మైనమువలె కొంచెము మెత్తగానుండును. ఇది హీ రానీ యిస్తబునాడ్ మొదలగు పర్వతములలో బయలుదేరెడి

రాతి మదము. ఇది నేత్ర రోగములకు బాగుగా పని చేయును.

శనగలు - Bengal gram:—సం: చణకః, హిం:యూ చనా, నొఖూద్, అర: కడలై. నల్లభూములలో శనగలుచక్క గఫలించును. శీతాకాలము సమీపించు సమయములో గింజ లను భూమిలో వేయుదురు. శనగలకు మంచు యెక్కువ యుపయోగము. వీనిని విత్తుటకు సెప్టెంబరు నెలసరియైనకాల ము. దీనినిగూడ ఉలవలవలెనే పండించుదురు. వీనిని వంగాలు దేశములోను, చెన్నపట్నము మొదలైన దేశములలోను గుఱ్ఱ ములకు నీటిలో నానవేసి దాణావేయుట కుపయోగించుచు న్నారు. ఇది పిండివంటలకు ముఖ్యమైన కాయధాన్యము. శనగ పప్పున దీసినపొట్టు ఎద్దులకును, ఆవులకును ముఖ్యమైన ఆహా రము. శనగలను నీటిలో నానవేసి రుబ్బి పాడిపశువులకు పెట్టిన బాగుగా పాలు, వెన్న కలుగును.

## స

సజ్జలు - Bulrush millet:—ఇదియును బీదజనులు తిను నట్టి నాలుగుమాసముల పైరు. ఇదియెప్పుడును మెట్టపొలము లలోనే పైరుచేయబడును. ఇది మే, జూన్ నెలలలోను, నైరు తీవర్షాకాలములలోను, విత్తబడి ఈశాన్యవర్షాకాల ప్రారంభిం చుటకుమునుపు కోతకువచ్చును. కందులు, అనుములు, నీలి, నువ్వులు మొదలగువానితో సజ్జలుకూడకలిపి చల్లుదురు. సజ్జ లలో చలువజేయుగుణము కలదు వాతరోగముచేతను, నేత్ర

రోగముచేతను బాధపడుచున్న పశువులకు ఈసజ్జపిండిని పెట్టిన యెక్కువ పనిచేయును.

సోయాబీనుపిండి - Soyabeen flour:—ఇది మన దేశము లో డార్జిలింగు ప్రాంతములందు మాత్రమే విశేషముగ పైరు చేయబడుచున్నది. కాని ఈమధ్యకాలములో తదితరప్రదేశ ములందుకూడ వేసిరి. సోయబీనుగింజలనుండి నూనెతీయబడిన తరువాత దీనిని సోయబీనుపిండి యనుచున్నారు. ఈపిండి సో యబీను తూర్పుదేశములందు విశేషముగా పండింపబడి ఆహా రపదార్థముగ నుపయోగింపబడుచున్నది. ఇది మనదేశమునకు 1908 సం॥లో వచ్చెను. ఇంతవరకు వీనిగింజలే పశువులకాహా రముగ పెట్టబడుచున్నవి. నూనెతీసివేయబడిన పిండిలో యింక ను కొంత చమురుండును. ఈపిండి ప్రత్తిపిండివలె నుండును. దీనిని గూడ పశువుల కితరాహారములతో కలిపిపెట్టవలెను.

సన్నరాష్ట్రము - Galangal lesser:— సం: రాస్నా, హిం: యూ: కులింజక్, అర: సిత్తరత్రయ్. దీనిని తమలపాకు దుంపయని కొందరందురు. దుంపరాష్ట్రమునకుండే గుణములు దీనికిగూడ గలవు. ఇది వెగటుగ, కారముగ, చేదుగ నుండును. కాక జేయును. వాతరోగములకు బాగుగా పనిచేయును.

సీకాయ - Acacia concinna:— సం: సప్తలా. హిం: యూ: కోచి, అర: సీవక్కాయ్. ఈచెట్టు ముండ్లపొదవలె నుం డును. లేతయాకులు పుల్లగానుండును. చింతచిగురువలెనే ప చ్చళ్ళు చేసికొందురు. సీకాయలను కుంకుడుకాయలవలెనే రుద్దు కొనవలెను. దీనికాయలరసము జీర్ణసంబంధమగు వ్యాధులకు

అనగా కడుపునొప్పి, కడుపుబ్బు మున్నగు వ్యాధుల కుప యోగించును.

సీసము - Lead:—సం: సీసం, హిం: యూ. సీసక్, అర: ఇయ్యం. ఇదియొకవిధమైన లోహము కాక జేయును. నేత్రరోగములకు, కంతులకు, చర్మవ్యాధులకు బాగుగా పనిచేయును.

సీతాఫలము - Castered apple:— సం: అగ్నిమూఖ్యం. హిం: యూ: శరీఫా. అర: సీతాపజ్జం. ఈచెట్లు మనదేశమునందంతటను బెరుగుచున్నవి. ఈకుటుంబములో పెద్దచెట్లు, గుబురుమొక్కలుగూడ గలవు కొన్నితీగెలవలె అల్లుకొనును. ఈ మొక్కలు శీతలదేశములందంతగలేవు. సీతాఫలపాకు రసము మిగుల శ్రేష్ఠమైనది. రసము కాకజేయును. పురుగులుపడిన పుండ్లకు ఈయాకుపసరు బాగుగా పనిచేయును. ఆకులుకూడ పుండ్లకు మంచిపనిచేయును.

సాలామిశ్రి-Salep Orchid:—సం:అమృతోత్తా,హిం: యూ: సాలామిశ్రీ, అర: షాలామిశ్రీ. ఇదిఒకవిధమైన జిగురుగలదుంప. బలము కలిగించును. దీనిజిగురును ఉప్పునీటిలో వేసి కలిపిన మంచినీరగును. నేత్రరోగములకు ఎక్కువగా సాలామిశ్రిని వాడుదురు.

సారాయి - Wine:— ఇది వెగటుగ చేదుగ నుండును. సారాయి ఉద్రేకకరమగు వస్తువు. కాకజేయును విరేచనము గావించును. విరిగినయెముకలను అతుకుగొనజేయును. ఏకారణము చేతనైన పశువు జబ్బుగొననేని వెంటనే ఆలస్యము

చేయక త్రాగించవలెను. ఇట్లు చేయుటవలన రాబోవు జాడ్య మాగును.

పశువువయస్సునుబట్టి అర్ధసిసాలగాయుతు సీసావరకు.

సొంటి - Zingiber:—సం: శొంఠీ, హిం: యూ: సోంఠ్ జంజబీల్. ఈశొంఠిని చేయుటకు 6 అడుగులపొడుగు 6 అడుగుల వెడల్పు, 6 అడుగులు లోతుగల గచ్చు తొట్లులలో ముందుగా అల్లమును వేయవలెను. తరువాత వానిలో నీరుపోసి బలమైన మనుష్యులతో జతుకత్రొక్కించెదరు. దీనివలన అల్లపు పొట్టం తయు రాలిపోవును. మరియు మట్టియేమైన యున్న యెడల నీటిలో కరిగిపోవును. మురికినీటిని తీసివేసి మంచినీటినిపోయుచు పొట్టం తయు పోవునరకు అల్లమును త్రొక్కి పైపొట్టును తొలగించి లోని కొమ్ములను మరియొక తొట్టిలో వైచి యుంచి దానిని కొన్నిగంటలు తిరుగవేయుచు సున్నపునీటిలో నానవిత్తురు. అంతట వానిసితీసి గంధకపు పొగ వేసి ఆరబెట్టుదురు. శొంఠివేడి జేయును. జీర్ణకారి శొంఠిపొడి కారముగనుండును. మలబద్ధకము, వాతరోగములకు బాగుగా పనిచేయును.

మో:—తులము లగాయుతు 3 తులములవరకు.

సున్నము - Rock lime:—సం: చూర్ణం: హిం: యూ: చూనా, అర: చున్నాబ్. ఇది కారముగలది యగుటచేత గాయములనుండి కారెడు రసిని వారించును. ఆమ్లవైరి యగుటచేత ఆహారకోశములలోను, ప్రేగులలోను నుండు పులుసు

విరుచుటకు దీని నుపయోగింతురు. దీనిని పశువులకొట్టములలో జల్లుటచేతను, గోడలకుపూతపూయుటచేతను అంటుజాడ్యము లుపోకవు. పశువులకు సంభవించు జీర్ణసంబంధమగు జాడ్యములకు, దొమ్మలకు, సరకులకు, కాలినబొబ్బలకు, సన్నము మిగుల నుపయోగకారి.

సునాముఖి - Senna:— సం: స్వర్ణముఖి, హిం: యూ: సనా, అర: సూరత్ ఆవార్రై. దీనినే సీమనేలతంగే డందురు. సునాముఖిఆకు దక్షిణఇండియాయందు ముఖ్యముగా తిరునల్వేలి జిల్లాయందు దొరకును. ఈఆకులు పూర్ణమైనవిగను, శుభ్రమైనవిగను, పెళుసుగలవిగను, కొంచెము ఆకుపచ్చవర్ణముగాని, పసుపువర్ణముగాని గలగను, బలమైన వాసనగలవిగను ఉండును. ఈ ఆకురసము విరేచనము గావించును. కాని పశువులకంతగా వాడరు. మలబద్ధకమునకు, పారుడురోగమునకు ఈ ఆకు బాగుగాపనిచేయును.

హంసపాది - Vitis pedata:—సం: హంసపాదీ, హిం: యూ: కాక్ వద్, అర: పెరుష్వాడ్డె. దీని ఆకురసము చేదుగ స్వాదుగ నుండును. ఈ ఆకుపసరు చర్మవ్యాధులకు పనిచేయుయును.

హారిదళము - Yellow orpiment :— ఇది పశువులకు కలుగు కల్లవాపులకు, కాళ్లడెక్కలకు బాగుగాపనిచేయును.

---

# ఆంగ్లేయ పశువైద్య వస్తుగుణదీపిక

## అ

అయొడీన్ - Iodine :— ఇదియొక విషపదార్థము. ఇది నలుపురంగుగ నుండును. లోహసంబంధమైనది కాదు. తళతళ మెరయుచు పొరలుపొరలుగాను, పలుకు పలుకులుగాను నుండును. ఈపలుకులు గట్టిగానుండును. ఇంక నిది బలముగలది గను, రేగుదలను జేయునదిగనుండు విషపదార్థమై యున్నది. ఇది కృశ్య జేయుటకు ప్రసిద్ధమైనమందు. పశువులకు కలుగు వాపులకు, కురుపులకు వాడుదురు వాపుదల నొందియున్న స్థలములపై దినిని రాచినయెడల చీముపట్టకుండ జేసి కురుపులు తేలకుండునట్లు జేయును. వాపుగల స్థలమునందు మాత్రము మర్దన చేయవలెను.

అనీసి - Anisi :— అనీసనగా సోపుగింజలు. ఇవి పెద్ద జీలకర్రవలె నుండును. సోపు యొక్కకు ఈజిప్టు ఆసియా మైనరు దేశములు స్వస్థానములు. ఇప్పుడిది స్పెయిన్, మాల్టా గ్రీసు, రష్యాయొక్క దక్షిణభాగము మొదలగు ప్రదేశము లందు విశేషముగ పైరుచేయబడుచున్నది. ఇది యుత్తరహిందూస్థానమునకు పరిషియానుండి తేబడెనని నిర్ణయింపబడెను. మహమ్మదీయుల కిదిహితవు. మొక్క రెండడుగులయెత్తు బెరుగును. కొంచెము పసుపువర్ణముతో గూడిన తెలుపురంగుగల పూవులు బూయును. దీనిని వంటలలో నుపయోగించుదురు. ఈగింజలనుండి చమురు దీయుదురు. ఇవి రుచికి యింపైనవి. కడుపులో శీతలమును చేరనివ్వదు. కాక జేయును. ఇది మిగుల

జీర్ణకారి, కడుపుబ్బు కడుపునొప్పి, అజీర్తి, భేదులు మున్నగు వానికీ ఈగింజలు పనిచేయును.

రెండున్నర తులముల లగాయతు 5 తులములవరకు.

అమ్మోనియంక్లోరిడ్ - Ammonium Chloride :— దీనినే నవాసాగరమందురు. ఇది బజారులో అమ్మబడువస్తువు. తెల్లని పలుకులుగా నుండును. ఈపలుకులు ముక్కోణాకృతిగ నుండును. ఇది సారాయిలోను, వేడినీటిలోను కరగును. దీనినే ఒంటెలద్దితో కాల్చిన లవణమందురు. ఇది వెగటుగనుండును. ఇది కాలేయసంబంధమగు జాడ్యములకు అనుకూలమైనది. సాధారణముగా దీనిని సూరేకారము, నేలవేముతో చేర్చి వాడుదురు. పశువుపేడ బాగుగా వేయనిచో కొన్నిమందులు చేర్చియిచ్చెదరు. ఇంకను రొంప, అజీర్తి, కామాల, లివర్ రాట్ మొదలగు రోగములకు వాడుదురు.

తులము లగాయతు 8 తులములవరకు.

అంగ్వెంటం అయొడిన్ - Unguentum Iodine :— కొన్నివస్తువులవల్ల తయారుకాబడిన బూడిదరంగుగల ఆయింటుమెంటయి యున్నది. ఇది పశువులకు కలుగు కణతులకు వాపుదల భాగములకు పనిచేయును.

అంగ్వెంటంహైడ్రాజిరీ - Unguentum Hydrargyri :—దీనినే బ్లూ ఆయింటిమెంటందురు. ఇది పాదరసముతో తయారుకాబడినది. దీనిని లోపలికీయరాదు. కురుపులకు పొక్కులకు మాత్రమే రాయవలెను.

అంగ్వెంటం హైడ్రార్జిరీ అయోడైడ్ - Unguentum Hydrargyri Iodide :— దీనిలోకూడ పాదరసము కలి యును. వాపులకుమాత్రమే ఉపయోగించవలెను.

అయొడోఫారం - Iodoform:— ఇది పసుపు తెలుపు రంగుగలిగి పలుకులు పలుకులుగానుండి మెరయుచుండును. ఈమందుకూడ కుళ్ళకుండజేయును. దీనిని లోపలి కుపయో గించరు. దీనికి బలమగు క్రిమిసంహారశక్తిగలదు. చీముపట్టి నప్పుడు, కుళ్ళినప్పుడు దీనిని చల్లిన చక్కగా పనిచేయును. ఇంకను చర్మవ్యాధులకు; కాలిన బొబ్బలకు పనిచేయును. దీనిని బోరిక్ ఆసిడ్ లో కలిపి వాడవలెనుగాని దీనిని ప్రత్యేక ముగ వాడరాదు.

అమ్మోనియా లిక్కర్ స్ట్రాంగు - Ammonia Liquor Strong:—దీనినే అఘ్రాణద్రావకము లేక శృంగద్రావకమం దురు. కడుపులోనికి యిచ్చుటచేత ఉద్రేకకారియు, ఆమ్లవైరి యునైయుండును. చర్మలేపనము చేయుటచేత దురదయు, మంటయు గలుగును. కడుపుబ్బునకు దీనిని వాడుదురు. ఈ ద్రావకమును కడుపులోని కివ్వవలసినపుడు చాలినన్ని నీళ్లు పోసి ఘాటును తగ్గించి త్రాగించవలెను. ఇంకను దీనిని ఆవాల పాలాస్త్రితో చేర్చి వాడుదురు,

అరతులం లగాయతు తులమువరకు.

అమ్మోనియా కార్బనేట్-Ammonia Carbonate:— ఇది ముక్కలుగానుండి తెల్లపురంగుగానుండును. ఘాటగు

వాసన వేయుచుండును. విరేచనము గావించును. కీటకముల కాట్లకు దీని నుపయోగించిన బాధ యుండదు. దగ్గునకు, రొంపకు పనిచేయును.



ఆలోజ్ - Aloes :— ఇది కలబందరసముతో తయారగును కలబందమట్టలను అడ్డముగా నరికినపుడు వచ్చురసమును యెండబెట్టినయెడల పలుకులుగానగును. మట్టలపై కూడుకొని యుండు జిగురును తీసి పళ్లెములో వేసి యెండబెట్టినను లేక సెగపైనకాచినను గట్టిపడును. లేక వెడల్పుగా మూతిగల గ్లాసులో గాని, పింగాణిపళ్లెములోగాని రసముపోసి యెండలోనుంచిన గట్టిపడును. ఈగట్టిపడిన పదార్థమునే ముసాంబ్ర మందురు. ఇది విదేశములనుండి మనదేశమునకు విస్తారము ఎగుమతియగు చున్నది. ఇది చేదుగ వెగటుగనుండును. మిగులవిరేచనకారి. విరేచనమగునప్పుడు స్వల్పముగా నొప్పిబుట్టించును గనుక ఆ నొప్పిని హరించుటకు ఒకడ్రాము శొంఠితో చేర్చి ఇయ్యవచ్చును. దీనిని గుఱ్ఱములకెక్కువగా వాడుదురు. నల్లతెగులు, ఊర్ధ్వశ్వాస మొదలగు వ్యాధులకు బాగుగాపనిచేయును.

మో:— అరతులము లగాయతు తులమువరకు.

ఆర్సెనియస్ ఆసిడ్ - Arsenious Acid:- దీనినే పాషాణమందురు. ఇది మిగులవిషవస్తువు. దీనిరంగు తెలుపుగాగాని, ఎరుపుగాగాని యుండును. బజారులలో దొరకుపాషాణము సాధారణముగ యిసుక సీమసున్నము మొదలగువస్తువులతో కలిసి యుండును. ఎక్కువగా పశువులకు ఎరుపురంగుగల పాషాణమునే

పెట్టిచంపుదురు. ఇది విషవస్తువగుటచే బహుజాగ్రతగా వాడ వలెను. దీనిని పశువులకు కలుగు చర్మరోగములకు వాడు దురు. దీనిని చర్మముపైన రాచినపుడు చర్మముద్వారా రక్త ములో ప్రవేశించి తన వికారచేష్టలను గలిగించును. కాబట్టి తగినంత మోతాదు నీయవలెను.

ఆసిడ్ సాలిసైలిక్ - Acid Salicyile:- ఇది తెలుపు రంగుగానుండును. ఇంకను సూదులు సూదులుగ సన్నని కాంతి గల ముక్కలుగ నుండును. రుచికి తియ్యగనుండును. ఇది నీటిలో కలియవలెనన్న దీనికితోడు వెలిగారము కావలయును. షరబతు మొదలగునవి చేయువారు అవి చెడిపోకుండ నిలవ యుండుటకు దీనిని గలుపుదురు. దీనిని ఒకపాలు, 8, 9 పాళ్ళ వ్యాసులైనులో కలిపి చర్మవ్యాధులకు లేపనముచేయుదురు.

ఆసిడ్ సల్ఫ్యూరిక్ - Acid sulphuric :—దీనినే గంధక ధృతియందురు. ఇది స్వాదుగా, పుల్లగానుండును. దీనిలో పౌష్టికగుణముగలదు. విషవస్తువగుటచే లోపలి కంతగా దీనిని వాడరు.

ఆసిడ్ నైట్రిక్ - Acid Nitric —దీనినే తెలుగులో మహాద్రావకమందురు. ఇది బరువుగాను, ఘాటుగాను ఉండును. దీనిలో గుడ్డముంచిన ఆగుడ్డ కాలిపోవును. లోపలికిమాత్రము వాడగూడదు. చర్మవ్యాధులకు తదితరమందులతో కలిపి రాయవలెను.

ఆలం - Alum:—దీనినే పటిక యందురు. ఇది సామా న్యముగా బజారుకొట్లలో దొరకును. ఇది ఒగరుగ, తీపుగ, పులు

వుగ నుండువదార్థము. దీనిని లోపలికిచ్చినను, పైన ఉపయో గించినను స్నాయువులను ముడుచుకొననట్లుచేయు గుణము కల దు. దీనిని బురదనీటిలోవేసి కలిపిన బురద విరిగిపోవును. అతి సారము, నేత్రరోగములు, కాలినవుండ్లు మున్నగు వ్యాధులకు వాడుదురు.

మో:— పావుతులం లగాయతు తులమువరకు.

ఆసిటిక్ ఆసిడ్ గ్లేసియేల్ - Acetic acid glaciale:— ఇది ద్రవపదార్థము. దీనిని సామాన్యముగ పశువులోపలి కీయరు. పులుసువాసనగను, మిక్కిలి ఘాటుగ నుండును. దీనిలో పొక్కుగుణముకలదు. వాపుగలచోట దీనిలో సున్నము కలిపి రాయుదురు. పశువుల శరీరముపైన లేచు కణతులకు, పంపర, -గూటిగడ్డలకు పైన దీనిని మర్దించిన బాగుగా పనిచేయును.

ఇపికాక్ - Ipecac:— ఇది ఇపికాక్వానా అను చెట్టుయొ క్క వ్రేళ్ళతో చేయబడును. దీనివేరును చక్కగా యెండబెట్టి పొడిచేసి యుంచుదురు. అజీర్తి, పారుడురోగము, రక్తాతిసార ము మున్నగువ్యాధులకు బాగుగా పనిచేయును.

మో:—పావుతులము లగాయతు ముప్పాతిక తులమువరకు

ఎప్సన్‌సాల్టు - Epson Salt:—దీనినేభేదిఉప్పు లేక విరే చనలవణమని అందురు. రంధ్రములుగల తొట్లలోనుండి దిగిన నీటిని గుంటలలో పట్టియుంచుదురు. ఇది చాల వెగటుగ చేదుగ నుండును. వర్షాకాలములో ఉప్పుచేయు పళ్ళెరములు పనిచేయ బడనపుడు దీనిని అందులో కాచి చల్లార్చుదురు. ఇందుండి కలి గిన లవణక్షారమును ఎప్సన్‌సాల్టను పేరుతో ఇంగ్లీషు ఆస్ప

తుర్రిలలో విరేచనకారిగ వాడుచున్నారు. ఈమందును పెట్టెల లోను బీరువాలలోను చెదపురుగులు చిమ్మటలు బొద్దింకలు మున్నగు క్రిములు చేరకుండుటకు చల్లుదురు ఈలవణమును సాధారణముగా పశువులకు భేదిమందుగా నుపయోగించెదరు. అజీర్తి, కడుపునొప్పి, రక్తమూత్రము, పాలసేర్లు, కడుపు నొప్పి, కడుపుబ్బు మున్నగు వ్యాధులకు ఈలవణము పనిచేయును.

మో:—10 తులములు లగాయతు 20 తులములవరకు.

## క

కార్బాలిక్ ఆసిడ్ - Carbolic Acid:— దీనినే కార్బా లిక్కామ్లమందురు. ఇది స్వచ్ఛమైనదిగ నిర్వర్ణము గలదిగ నుండును. ఇంకను స్ఫటికమువలె నుండి క్రమముగా నెరుపు రంగుగాగాని, బూడిదరంగుగాగాని తేలును. ఇది విషవస్తువు. దీనిని విశేషించి ఎక్కువ మోతాదుల నీయరాదు. ఇది వగ రుగ సోకుడు పరిహారముగ నుండును. దీనియందు కుళ్లకుండ జేయుశక్తి గలదు. ఇది చేతిమీదపడినయెడల కాలి పుండగును. చాలానీటిలో దీనిని కలిపి సూక్ష్మజీవులను చంపవచ్చును. దీనిని శస్త్రవైద్యులు ఆయుధములను శుభ్రముగ చేయుట కుపయోగింతురు. నూరుచుక్కల నీటిలో ఒకచుక్క ఆసిడ్ వేసి దొమ్మరోగము తగిలిన పశువునకు త్రాగించినయెడల సూక్ష్మజీవులు చచ్చిపోవును. ఈకార్బాలిక్ లోషనలో క్రిమి సంహారశక్తి గలదు. ఇంక నిది నరముల బండబారునట్లు చేయును. ఇది చర్మమునకు గాని, శరీరములోని పొరలకుగాని తగిలి నపుడు వానిని ముడుచుకొనునట్లు జేయును. మునర, జబ్బ

వాపు, కురము, గురక, గాలికుంట్లు, కాళ్లసంబంధమైన జాడ్యములు, గాయములు, చర్మరోగములు మున్నగు వ్యాధులకు ఈమందు మిగుల నుపయోగకారి.

మో:—60 చుక్కలు మొదలు 120 చుక్కలవరకు.

కాంఫర్ - Camphor:—దీనినే హారతికర్పూర మందురు. ప్రపంచమున కంతకును జపాను దేశమునుంచి కర్పూరము సప్లయిచేయబడుచున్నది. కర్పూరపుమొక్కలు ఫార్మోసా, జావా, ద్వీపములందు విశేషముగ పెంచబడుచున్నవి. వసంత ఋతువులో కర్పూరవిత్తులు నాటుదురు. పెంటగట్టినభూమిని చక్కగ దున్ని విత్తనములను వెదజల్లుదురు. విత్తనములు జల్లుటకు విశేషముగ నీరక్కర లేదు. మొక్కలు మొలచినతరువాత వానిని విడివిడిగ నాటుదురు. కర్పూరములో మంచిరకము తెల్లగానుండి మెరయుచుండును. సువాసనగ కారముగ నుండును. దీనిలోకూడ క్రిమ్మికుండజేయు గుణము కలదు దీనిని నువ్వులనూనెలో కలిపి పుండ్లకు పట్టించినయెడల అందులోని పురుగులు చచ్చిపోవును. మశూచి, రొంప, పీనస, వాతము, దొమ్మ, చర్మవ్యాధులు మున్నగు వ్యాధులకన్నిటికిని బాగుగా పనిచేయును.

మో:—అరతులము లగాయతు 2 తులములవరకు.

క్యారన్ఆయిల్ - Carron oil:—5 తులముల నీటిలో 5 తులముల కొబ్బరినూనెను తెచ్చి తరువాత ఒకదానితో నొకటి కొంచెముకొంచెముగ కల్వములోపోసి నూరుటవలన ద్రవమైన తెల్లటిపదార్థ మేర్పడును. దీనినే క్యారన్ ఆయిల్

అందురు. దీనినే తెలుగులో నవనీత మందురు. కొబ్బరినూనెకు బదులుగా ఆలివ్ ఆయిల్ గాని, లిన్‌సీడ్ ఆయిల్ గాని యుపయోగించవచ్చును. కాలినస్థలమందు దీనిని వెంటనే యుపయోగించినయెడల చల్లగనుండి మంచి గుణము నిచ్చును.

క్యాస్టర్ ఆయిల్ - Castor oil:— ఇది ఆముదపుగింజల నుండి తీయుదురు. ఇది సాధువిరేచనకారి. జిగురుగనుండి దాదాపు వాసన, రంగు లేకుండ నుండును. ఆముదను వెగటుగ నుండును దీనిని పశువులకిచ్చిన పేడను మెత్తగిల జేయును. ప్రేగులలో పేరుకొనియుండు మలినపదార్థములను పోగొట్టును. మలబద్ధకము, పాండురోగము, ఉంగిడీ, కడుపుబ్బు మొదలగు సంకటములన్నిటికి ప్రయోజనకారి.

మో:—పావు శేరులగాయతు అర్థశేరువరకు.

క్యాజిపుట్ ఆయిల్ - Cajuput Oil:—దీనినే ఏలకుల అరఖందురు. కాని అంబాయినా మొదలగు ద్వీపములలో నుండు ఒకజాతి ఆకులతో తయారుచేయబడును. అతివేడి జేయును. ఘాటుగల వాసనయుండును. దీనిని, కొబ్బరినూనెలోగాని, మంచినూనెలోగాని సమభాగములు కలిపి మర్దనచేసిన వాతపు నొప్పులు, కల్లవాపులు, నరములనొప్పులు మొదలగునవి హరించును.

కాస్టిక్ పొటాష్ - Caustic Potash :—ఇది తెలుపువర్ణముగానుండి గట్టిపుల్లలవలె నుండును. ఇది యెక్కువ స్థలమునకు వ్యాపించు గుణముకలదు. కాబట్టి దీనిని వేయుదలచు కొన్న స్థానమునకు చుట్టును. పలాస్త్రిని దేనినైనను కలిపి

నుపయోగించవలెను. అనారోగ్యకరమగు నానుడు కురుపుల కుపయోగించిన గుణమీయగలదు. దీనిని పశువులోపలికిమాత్రి మీయరాదు. ఈమందు గిత్తదూడల కొమ్ములకు రాచినయెడల కోరునట్లుగా రాగలవు.

కాపర్ సల్ఫేటు - Copper sulphate:—దీనినే మైలతుత్తమందురు. ఇది తామ్రగనులలో పుట్టును. దీనిలో తామ్రముండును. ఇదిగడ్డలుగడ్డలుగానుండి నీలవర్ణముగ నుండును. ఇది అన్నభేదితో సమానముగ పనిచేయును. నేత్రరోగములు, చర్మరోగములు, అతిసారము, రక్తాతిసారము, నురుగుదబ్బల రోగము, గాలికుంట్లు మున్నగు వ్యాధులకు బాగుగా పనిచేయును.

మో:—పావుతులము లగాయతు తులమువరకు.

కాలోమెల్ - Calomel:—ఇది తెలుపురంగుగానుండి బరువుగానుండును. ఇది విరేచనకారి. దీనిని పశువుల కంతగా వాడుటలేదు. దీనిని బహుజాగ్రత్తతో వాడవలెను. దీనినే రసభస్మము, రసకర్పూరమందురు. దీనిని వాడవలసినప్పుడు యితరమందులతో చేర్చి యీయవలెను. పశువులకు కలుగు కాలేజసంబంధమైన జాడ్యములకున్ను, రక్తాతిసారమునకు దీనిని వాడుదురు. ఇంకను చర్మరోగములకు పనిచేయును.

1/8 తులములగాయతు తులం వరకు

కాల్సియం - Calcium:—ఇది సున్నముతో సంబంధించి యుండు పదార్థము. రక్తవిరేచనములకు, విరేచనములకు ఈ పొడిని నీటిలో వేసి త్రాగించవలెను.

కాల్చికంటించర్ - Colchicum:—ఇది తెలుపురంగు కలిగి పొడిగ నుండును. వాతములకు నీరుచురుకు మున్నగు వ్యాధులకు దీనిని వాడుదురు.

మో:- అరతులములగాయితు ఒకటిన్నర తులమువరకు

క్లోరోఫారం - Chloroform :— ఇది స్వచ్ఛమైన ద్రవ పదార్థము. - శస్త్రముచేయునపుడు నొప్పితెలియకుండ నుండుటకు వాసన జూపుదురు. దీనిని వాసన జూచుటవలన స్మారకము తప్పి పోవును.

క్రియోసోట్ - Creosote:— ఇది కొంచెము పసుపురంగు గలిగి యుండును. ఒకవిధమైన వాసనగలిగియుండును. ఇది కార్బాలిక్ ఆసిడ్ వలెనే పనిచేయునుగాని దీనియందంత విషపదార్థములేదు. ఇది దుర్వాసన పోగొట్టును. కుళ్ళకుండ జేయును.

క్రియోసోట్ ఆయింటుమెంటు - Creosote Ointment:— క్రియోసోట్‌ను వ్యాసులైనులో కలిపి కరగబెట్టి చల్లారువరకు కలియబెట్టగా ఒకవిధమైన ఆయింటుమెంటగును. దీనిని చర్మవ్యాధులకు కురుపులకు వాడెదరు.

కెంతారిడీస్ - Cantharidis :— ఈమందులో పొక్కు స్వభావముగలదు. పశువుశరీరములోని కిచ్చినదొమెడల బలము కలుగజేయును. ఇది పైనరాచిన గూటిగడ్డలు కణతలు మొదలగునవి మెత్తగిలును.

క్లోరల్ హైడ్రస్ - Chloral Hydras:— ఇది నిర్వర్ణమైన స్ఫటికములుగ నుండును. దీనిలో మత్తును కలుగజేయు

గుణము కలదు. నల్లమందువలె పనిచేయును. దీనిని గంజిలో వేసి పశువులకు కలుగు కడుపునొప్పి, శూలనొప్పి మున్నగు వ్యాధుల కియ్యవచ్చును.

మో:-అరతులములగాయతు ఒకటిన్నరతులమువరకు.

కినోసోల్ - Chinosol:— పశువులకు చిన్నచిన్న గాయములు తగిలినపుడు దీనిని గుడ్డలోముంచి పైనవేయుదురు.

కెరోసినాయల్ -Kerosine oil:—ఇది కొండలలోనుండి ఊరునట్టినూనె. దీనినే శిషాలాతైలమనియు మట్టితైలమనియు నందురు. హిమాలయ పర్వతములయొక్క తూర్పు పశ్చిమ భాగములందు ఈనూనె నిచ్చుగనులు గలవు. ఇంకనుతూర్పున అస్సాము, బర్మా, సుమిత్రా, బార్నియో, జావా మొదలగు దేశములలో కూడ గలవు. కాని ఈనూనె అంత శ్రేష్టమైనది కాదు. ఈనూనెను నువ్వులనూనెతోగాని, ఆముదముతోగాని సమభాగములుగా కలిపి రాచిన చర్మరోగములుకాని నోటి పుండ్లు మొదలగువానికిగాని పనిచేయును.

క్లోవ్సుఆయిల్ - Oil of cloves:— దీనినే లవంగాల అరకందురు. దీనిలో యూజెనిక్ ద్రావకముండును. ఈద్రావకము కార్బాలిక్ ఆసిడ్ కంటె కొన్నిరెట్లు గొప్పది. కారముగ నుండును. బలముకలుగజేయును. అజీర్తికి కడుపునొప్పికి బాగుగా పనిచేయును.

## గ

గ్లిసరీన్ - Glycerine:— ఈచముురు తెలుపుగా నుం

డును. ఇది తియ్యని ద్రవపదార్థము. దీనిని ఎక్కువగా వాడిన విరేచనకారిగ పనిచేయును. దీనిలోకూడ క్రిములచంపుట జేయు పదార్థముగలదు. చర్మవ్యాధులకు, కర్ణరోగములకు కాలిన స్థలములకు నుపయోగించును. ఒకపాలు కార్బాలిక్ ఆసిడ్‌లో 12 పాళ్ళగ్లిసరిన్ కలిపి పశువులకు చర్మయందలి వాపులకు రాచిన నెమ్మదించును.

ఛాక్-Chalk:—దీనినే సీమసున్నమందురు. ఇది వగరుగ నుండును. విరేచనబద్ధకము కలుగును, దీనిని తరచుగ మందు దినుసులతో కలిపి వాడుదురు. సరకు, అజీర్తి, భేదులు, రక్తాతిసారము, గాయములు మున్నగువాని కుపయోగించును.

తులము లగాయతు 6 తులములు వరకు.

## జ

జెన్షియన్ - Gentian:— దీనిని ఒకవిధమైన చెట్టు నుండి తయారుచేయుదురు. ఇది చేదుగ, వగరుగ, రుచిగ నుండును, జీర్ణశక్తి గలుగుటకు దీనిని వాడుదురు.

మో:—తులములగాయతు రెండున్నర తులములవరకు.

జాబరాపిండి - Jabarandi :— జాబరాండి అనబడు చెట్టుఆకులతో నీమందును తయారు చేయుదురు. దీనిని పశువులకు వాడిన ఎక్కువగా పాలిచ్చును.

మో:—తులము లగాయతు రెండున్నర తులములవరకు.

జింక్ ఆక్సైడ్ - Zinc Oxide:—ఇది మెత్తగనుండి తెలుపురంగుగ నుండును. నీటిలో చక్కగ కలియును. దీనినే

యుశదామ్లజనిత మందురు. ఈపొడిని తరచుగా లోపలికీయురు. చర్మవ్యాధులకు, రసికారు కురుపులకు పనిచేయును.

జింక్ ఆక్సైడ్ ఆయింటుమెంటు – Zinc oxide ointment:– జింక్ ఆక్సైడ్ వెన్నతోగాని, క్రొవ్వుతోగాని కలిపి కలియనూరిన ఆయింటుమెం టగును. ఇది చర్మవ్యాధులకు, కవుకుదెబ్బలకు పనిచేయును.

జింక్ క్లోరేడ్ – Zinc chloride:– ఇదియొక లవణపదార్థము. ఇది కుళ్ళుదనమును పోగొట్టునదిగ వర్తించును.

## ట

టర్పెంటైను – Oil of Turpentine:—దీనిని హారతికర్పూరమునుండి తయారుచేయుదురు. ఇది స్వచ్ఛముగ నిర్వర్ణముగ నుండును. ఇది ఆవిరిరూపముగ తయారుజేయుదురు. దీనినే కర్పూరతైలమందురు. బజారులలో దొరకు దానిలో కెరిసినాయిల్ కలుపుదురు కాబట్టి శ్రేష్ఠమైనది ఇంగ్లీషుషాపులలో దొరకును. ఇది ఉద్రేకకారియు, పురుగులను చంపునదియు నైయున్నది. దీనిని ఆవాలపిండితోచేర్చి పలాస్త్రి చేయుదురు. పేగులు, గుండెకాయలు వాచియుండునపుడు యీపలాస్తరిని వాడుదురు. ఇదికావులకు మంచిమందు. దీనిని లోపలకుమాత్రము జాగ్రత్తగా నీయవలెను. ఆముదముతో కలిపి యిచ్చిన ఏలికపాములు, నులిపురుగులు మున్నగునవి నశించును. పేగులందుండు వాయువును వెడలించును. కడుపునొప్పి, దొమ్మ, న్యూమోనియా, కడుపుబ్బు, రొంప, శేరుమాద, బెణుకునొప్పులు, గాయములు మున్నగు వ్యాధులకు

బాగుగా ఈ కర్పూర తైలము పనిచేయును.

టింక్చర్ బెంజాయిన్కో - Tincture Benjoinco:- దీనినే సాంబ్రాణినుండి తయారుచేయబడిన అరకందురు. సువాసనగానుండును. దీనిలో తురుష్కమనుమందు కలుపుదురు. దగ్గు, కఫము, రొంప, మొగబంతి మున్నగువ్యాధులకును, తెగిన గాయములకును అది పనిచేయును.

టింక్చర్ అయోడిన్ - Tincture Iodine:— ఇది ఎరుపువర్ణముగనుండును. దీనిలో మిక్కిలి తీవ్రమైన శక్తిగలదు. నిమిషములో సూక్ష్మజీవులను చంపును. శస్త్రముచేయుటకు పూర్వము దీనిని వాడుదురు. ఇంకను శస్త్రవైద్యులు చేతులు కడుగుకొనుటకుగూడ దీని నుపయోగింతురు. దీనిని పురుపుల వల్లవచ్చెడు వాపులకు గడ్డలకు పైన రాయవలెను. ఇది పుండునకు తగిలిన చాల మంటకలుగును. దీనిని లోనికి యెంతమాత్రము వాడరాదు. ఇది విషవస్తువు. ఇదిఅన్నిరకముల వాపులకు, గూటిగడ్డలు, పంపర మున్నగు వ్యాధులకు బాగుగా పని చేయును.

టింక్చర్ ఆకొనైట్ - Tincture Aconite:— ఇది వసచే తయారుకాబడిన ద్రవ్యపదార్థము. దీనిని పెద్దమోతాదు లిచ్చిన పశువుశరీరమంతయు తిమ్మిరిగలుగును.

టింక్చర్ ఓపియం - Tincture opii:— దీనికే లాడనమ్అను పేరు గలదు. ఇది ఎరుపు, నలుపు, బూడిదవర్ణము కలిసినరంగు గలిగి ద్రవరూపముగా నుండును. దీనిని నల్లమందుచే తయారుచేయుదురు. భేదులు, రక్తాతిసారము, శరీరములోపల

నుండు తదితరనొప్పులకు బాగుగా పనిచేయును.

టింక్చర్ కాంఫర్ కో - Tincture Camphorco:— దీనిని కర్పూరముతో తయారుచేయుదురు. వానిలో కొద్దిపాలు నల్లమందు కలియును. ఇది ఎరుపురంగుగల ద్రవపదార్థము. వాపులకు, చర్మవ్యాధులకు, దగ్గులకు, చురుకుదనము పుట్టించుటకు వాడుదురు.

టించర్ జింజిబ్రిస్ -Tincture Zingiberis:— దీనిని శొంఠితో తయారుచేయుదురు. ఇది జీర్ణకారియగు పదార్థము. ఏలకుల అరఖువలెనే నిదియును పనిచేయును.

టించర్ కాచు - Tincture Catechu:— ఇదికవిరితో చేయబడిన పదార్థము. కాఫీరంగువలె నుండును. జీర్ణసంబంధములైన వ్యాధులకు పనిచేయును.

టించర్ బెల్డోనా:—Tincture Belladonum:— ఇది యొక చెట్టు ఆకులతో తయారుచేయబడిన అరఖు. కఫరోగములకు, మూత్రములకు పనిచేయును.

టార్ - Tar:— దీనినే ఓడకీ లందురు, ఇది రెండువిధములు. ఒకవిధమైనది కఱ్ఱలనుండి తయారుచేయుదురు. మరియొకటి బొగ్గులనుండి చేయుదురు. కఱ్ఱలనుండి తీయబడిన కీలు చాల శ్రేష్ఠమైనది. ఇది చర్మరోగములకు, కాళ్ళజాడ్యములకు, కొమ్ములు విరిగినపుడు, గాయములకు పనికివచ్చును. ఇంకను ఈగలు మొదలగు విషజంతువులు పుండ్లమీద ముసరకుండుటకు యీచమురును రాయుదురు. బొగ్గులనుండి తీయబడినది దుర్వాసనలకు అంటువ్యాధులకు పనిచేయును.

## ప

పొటాసియం పర్మాంగనేట్ - Potassium Permanganate:—దీనినే పొటాసియం పర్మాంగనిత మందురు. దీనికి అధికమగు క్రిమిసంహారశక్తి గలదు. ఇవి ఊదారంగుగల పలుకులుగా నుండును. దీనిని నీటిలో కలిపినప్పుడు చంద్రకాంత పూవువంటి ఎరుపురంగుగల ద్రవ మేర్పడును. ఈద్రావకము కుళ్లుచుండు పదార్థములతో చేరినపుడు ప్రాణవాయువు వెలువడి అది ఆపదార్థములతో కూడి వానిని శుద్ధిచేయును. దీనిలో దుర్వాసన పోగొట్టు గుణము కలదు. ఇంకను దీనితో రాయబడిన లోషన్నుతో చీముపట్టిన పుండ్లను కడుగుటకును, సరకు, గురక, చర్మవ్యాధులు మున్నగువానిని బాగుచేయుటకును పనికివచ్చును.

పొటాసియం అయొడైడ్ - Potassium Iodide:—ఇది నిర్వర్ణమై స్ఫటికమువలె నుండును. ఈలవణము రక్తములో త్వరితముగా కలియుగుణము కలదు. దీనికి ఎక్కువగా పశువుశరీరములో చెడునీరు లాగు సుస్వభావము కలదు. ఉదరరోగము, పొదుగువాపు, కసిమిరి మున్నగు వ్యాధులకు పనిచేయును.

మో:—1/16 తులము లగాయతు 1/8 తు॥ వరకు.

పొటాస్ క్లోరసు - Potass Chloras:— ఇది నిర్వర్ణముగ పలుకులు పలుకులుగ నుండును. పటికవలెనే యిదియును పనిచేయును. జలములో చక్కగ కలియును. నేత్రవ్యాధులకు

నోటిపుండ్లకు, రొంపకు దగ్గునకు యీమందు బాగుగా పని చేయును.

పొటాసునైట్రసు-Potass Niatras:—దీనినే నైటర్, సాల్టుపీటరు, సూరేకార మని చెప్పుదురు. ఇది పొడుగగు ముక్కలుగానుండి స్ఫటికమువలె మెరయుచుండును. మంచి చురుకైన పదార్థము. ఇది మనదేశములో దొరకును. రుచికి కారముగ చిరిచేదుగ నుండును. బజారులలో దొరకు సూరేకారములలో కొంచెము ఉప్పు మొదలైనవి కలిసియుండును. దీనిని వేడి జేసిన అందలినీరు హరించును. ఇది సామాన్యముగా తత్వమును చక్కబరచును. జ్వరముగనున్న పశువునకు సురక్షితముగా దీని నియ్యదగును. దీనిని నీళ్ళలోగాని, గంజిలోగాని కరగించి దాహముగొనియుండు పశువుయొద్ద బెట్టినయెడల ఆనీటిని మిగుల ప్రేమతో త్రాగును. ఇది మూత్రమును వృద్ధి చేయును. నీరు చురుకు, రొంప, శేరుమాద, నంజు మొదలగు వ్యాధులకును, దొమ్మవ్యాధియందు కలుగు వాపులకును పని చేయును.

మో:—అరతులము లగాయతు ఒకటింపాతిక తు॥ వరకు.

పిక్రిక్ ఆసిడ్ -Pecric acid: = ఇది యొకవిధమైన ఘన పదార్థము. ఇది కాంతిగలిగి పసుపుపచ్చగానుండును. వేడినీటితో కలిపి తయారుజేసిన లోషనుతో కాలినపుండ్లను కడగవచ్చును. ఈపుండ్లకిది ముఖ్యమైనమందు. దీనిని లోపల కీయరాదు.

ఫెనైల్ - Phenyle:— ఇది తారునుండి తయారు చేయబడును. ఇది నలుపువర్ణముగల ద్రవపదార్థము. దీనిని నీటిలోకలిపిన తెలుపురంగుగనుండును. దీనిని పెద్దరోగములకు వాడుదురు. ఇది అతివేడిజేయును. దొమ్మ, గురక, గాళ్ళు, జోరీగలు, గోమారులు, పేలు మున్నగు వానికి వాడవచ్చును.

మో:—అరతులము లగాయతు 2 తులములవరకు.

పిచ్ఛి - Pitch:—దీనితో ఒకవిధమైన పలాస్త్రి చేయుదురు. ఆపలాస్త్రి బెణుకునొప్పులకు, విరిగిన భాగములకు వాడుదురు.

పెప్పర్ మెంటు ఆయిల్ - Oil of Peppermint :— ఇది మంచి సువాసనగ నుండును. చర్మమునకు తగిలిన చల్లగానుండును. ఇదియొక చెట్టునుండి తయారు కాబడిన చమురు. దీనియందుగూడ క్రిమిసంహారక శక్తిగలదు. అజీర్తి, కడుపునొప్పి మొదలగు జీర్ణసంబంధమైన వ్యాధులకు బాగుగా పని చేయును.

పొటాసియంబ్రోమైడ్ - Potassium Bromide:— ఇది తెల్లని పలుకులుగా నుండును. నరములకు మాంద్యమును కలుగజేసి రోగికి మగతను కలిగించి తాత్కాలిక ఫలితము నిచ్చును.

పొటాస్ బైకార్బనస్ - Potass Bicarbonas:— ఇది తెలుపురంగుగల లవణము. ఇది నీటిలో కలియును. పొటాషియం సంబంధమగు ఔషధముల కన్నిటి కుండెడు గుణములు ఈలవణమునం దొక్కదానికే గలవు. ఇది వాపులకు, కుళ్ళిన

స్థలములకు, జీర్ణసంబంధమైన జాడ్యములకు బాగుగా పని చేయును.

బ

బిస్మత్ కార్బనస్ - Bismuth Carbonas:— ఈ పొడి తెల్లగా నుండును. ఇది నీటిలో వేసిన కలియును. ఈమందు దూడలకు సంభవించు పాగుడురోగము, రక్తవిరేచనములు మున్నగు వ్యాధులకు పనిచేయును.

మో:— పావుతులము లగాయతు అరతులమువరకు.

బిస్మత్ సబ్ నైట్రిస్ - Bismuth Subnitras:— ఇది యొకవిధమైన లవణపదార్థము. ఇది నీటిలో కలియదు గావున తుమ్మజిగురుతో కలిపినయెడల నీటిలో కలియును. ఇది బరువైన తెల్లని పొడిగ నుండును. భేదులకు అజీర్ణికి పనిచేయును.

బెంజాయిన్ - Benzoine:— అనగా సాంబ్రాణి. ఇది యొక చెట్టుజిగురు. ధూపద్రవ్యము. వెగటుగ సువాసనగ నుండును. దేహమందున్న చెడునీరును తీయును. దుర్గంధముల పోగొట్టును. ముగబంతి, దగ్గు, పీనసరోగము మొదలగు వ్యాధుల కిది పనిచేయును.

బోరాక్సు - Borax:— అనగా వెలిగారము. ఇది మన దేశమందు నేపాళము, టిబెట్టు, పర్షా దేశములనుంచి వచ్చుచున్నది. ఇది నిర్వర్ణముగ నుండి మెరయుచుండును. రుచికి చల్లగను ఉప్పగనుండును. నోటిపూతకు దీనిని తేనెలోకలిపి రాయవచ్చును. ఇంకను పాలచన్నులు పగిలిన నేతితోకలిపి రాయవచ్చును.

బెలడోనా - Belladonna:—ఇదియొకవిధమైన చెట్టు ఆకులనుండి తయారుచేయబడును. దీనిలో నరములను బండబారచేయు గుణముకలదు. ఈచెట్లు హిమాలయప్రాంతములందు పెరుగుచున్నవి. కడుపుకుట్టు తదితరనొప్పులకు పనిచేయును. ఇంకను చీముపట్టియుండు గడ్డలకు, వాపులకు, కురుపులకు, దద్దుర్లకు దీనిని కొబ్బరినూనెలో కలిపి రాయవలెను.

బోరిక్ ఆసిడ్ - Boric acid:—దీనినే బోరికామ్లమందురు. దీనిలో వెలిగారము కలియును. తెలుపురంగుగా నుండును. చీముపట్టు స్థలమునందు రాచిన కుళ్ళకుండ జేయును. ఇది మంటలేనిమందు. ఈమందుపశువునకులోపలికిచ్చిన మూత్రవ్యాధులు నశించును. ఎక్కువగా గాయముల కుపయోగించుదురు. దీనిని స్పిరిట్‌లో కలిపి చెవిలోపోసిన చీము, పోటుమున్నగు బాధలు నివారణమగును. దీనిని శస్త్రవైద్యులెక్కువగా వాడుదురు. ఇదిసూక్ష్మ జీవులను వెంటనే చంపలేదుగాని వానివృద్ధి నాపివేయును.

బోరిక్ ఆయుంటిమెంటు - Boric ointment:—ఇది కురుపులకు, పగుళ్ళకు, కాలినబొబ్బలకు పనికివచ్చును. పాడిపశువుల చన్నులుపగిలినయెడల దీనిని వాడవచ్చును. ఇంక నోటిపూత, నోటిపుండ్లు, చర్మవ్యాధులకు వాడుదురు. దీనిని 4 తులముల వ్యాసులైనులో కలిపి రాయుదురు.

## యు

యూకలిప్టస్ ఆయిల్ - Eucalyptus oil:— ఇది యూకలిప్టస్ గ్యాబ్యులస్ అనబడెడు చెట్టుయొక్క ఆకులనుండి తీయు

బడిన ద్రవమై యున్నది. ఇది బజారులలో ప్రతిచోటను దొర కును. ఘాటువాసన గలిగియుండును. ఈవాసనకు సూక్ష్మ జీవులు నశించును. దీనిని న్యూమోనియా, కసిమిరి, దగ్గు, రొంప మొదలగువాని కుపయోగించుదురు.

మో:— 10 చుక్కలు మొదలు 50 చుక్కలవరకు.

యూకలిప్టస్ఆయంటుమెంటు-Eucalyptus ointment:- యూకలిప్టస్ ఆయిల్ ఒకభాగముతీసికొని 9 భాగముల వ్యాసు లైనులోగాని, క్రొవ్వులోగాని కలిపి తయారుచేసిన ఆయం టుమెంటు చర్మవ్యాధులకు, తదితర వాపులకు రాచిన చీము పట్టనీయదు.

యెర్గోటా - Ergota:—ఇది కుక్కగొడుగునకు సంబం ధించిన ఔషధమైయున్నది. దీనిని ఎక్కువగ చూడిపశువులకు వాడుదురు. పశువుగర్భాశయముయొక్క స్నాయువులు మిగుల బలముతో ముడుచుకొని మాయ వేయనప్పుడు దీనిని లోపలి కిచ్చిన మాయ వేయును. మాయ వేసినచో దీనిని పశువున కియరాదు.

మో:—పావుతులము లగాయతు తులమువరకు.

యోహింబీన్ - Yohimbine·—ఇది పశ్చిమ ఆఫ్రికా లోనుండెడి మిర్యాన్ చెట్టుయొక్క బెరడునుండి తయారుచే యబడినది. బలహీనతవలన నపుంసకత్వమువలన చిక్కియుండు పశువులకు దీని నిచ్చిన సత్తువ కలుగును.

మో:— 1/8 తులము లగాయతు 1/4 తులమువరకు

## ర

రాక్ సాల్టు - Rock salt:— దీనినే సైంధవలవణ మనియు, ఇందుప్పనియు నందురు. ఇది చప్పగానుండును. ఇది సింధునదియొడ్డుననుండు గనులలో దొరకుచున్నది. విదేశములలో ఉత్తరఅమెరికా ప్రాంతములందును, మెక్సికో, స్పెయిన్, ఫ్రాంసు, జర్మనీ, హంగేరి, హాలెండు, ఆఫ్రికా మొదలగు దేశములందును ఈగనులు విస్తారముగానున్నవి. దగ్గు, చర్మ వ్యాధులు, కర్ణరోగములు మొదలగు వ్యాధులకును పాలు చేపని పశువులకును వాడుదురు.

రెజిన్ - Resin:—ఫిడేళ్ళతీగెలకు రజ నని రాయునట్టి ముక్క ఈకోజనమే. దీనినే గుగ్గిలమందురు. ఇదియొక చెట్టు జిగురు. ఈచెట్లు హిమాలయ పర్వతప్రాంతములందును, రాజమహాల్ కొండలమీదను, ఒరిస్సా, మధ్యపరగణాలలోను ఎక్కువగా పెరుగుచున్నవి. ముదురుచెట్లు 3, 4 అడుగులయెత్తు పెరుగును. దీనిబెరడు తీసెదరు. ఆబెరడు తీసిన అరలలో అరటి పూసవంటి పదార్థము పేరుకొనును. ఆరంభములో ఆపదార్థము తెల్లగనుండి తరువాత రంగు మారిపోవును. దీనిని క్రొవ్వునకు బదులుగా పలాస్త్రీలో వాడుదురు. ఇది సువాసనగ, జిగటగ, మృదువుగ, చేదుగ నుండును. వాతము, కసిమిరి, సీరుచురుకు, వగర్పుకు, గాయములకు వాడుదురు.

## ల

లన్నర్ కాస్టిక్ - Lunnar casutic:—దీనినే కారపు కడ్డీయందురు ఇది కారముగలద్ది యగుటచేత శీఘ్రముగా మా

నని గాయములకు వాడుదురు. ఇది చిన్నకంతులను సహితము పోగొట్టును.

లెడ్ అసిటేట్ - Lead acitate :—దీనినే సీసాశితమందురు. సీసపుముక్కలను కాడీపులుసులోవేసి కొంతకాలమట్లే యుంచినయెడల ఆసీస మందులో జీర్ణమై ఒక విధమైన తెల్లని ఉప్పు పేరుకొనును. ఆ ఉప్పునే షుగర్ ఆఫ్ లెడ్ లేక లెడ్ అసిటేట్ అని యందురు. ఇది వగరుగా నుండును. దీనిని నీటిలో కరగించి గాయములకు నేత్రరోగములకు వాడుదురు.

## వ

వ్యాసులైన్ - Vaseline:— ఇది తెలుపురంగుగా గాని, పసుపురంగుగాగాని యుండును. ఇది మెత్తగానుండి అర్ధ ద్రవ పదార్థముగా నుండును. నిలువయుంచిన దుర్వాసన వేయును. కొద్దివేడిమికి మాత్రమే కరగును. దీనిలో కుళ్ళకుండ మెత్త బరచు గుణమున్నది. దీనిని అన్ని పౌడర్లలోను వాడుదురు.

వినిగర్ - Vinegar:—దీనినే సిరకా లేక కాడిపులుసందురు. దీనిని బెణికిన ప్రదేశములమీద పూయుటచే ఆ భాగపు నొప్పి తగ్గును.

శాంటొనైన్ - Santonine:— ఇది సర్వర్ణమై చిన్న పలుకులుగ నుండును. వెలుతురు తగిలినచో పసుపు రంగుగ మారును. ప్రేగులలోనుండు నులిపురుగులను చంపుట కిది మంచి మందు.

## స

సల్ఫర్-Smlphur:—ఇది గనులయందుత్పన్నమగును. దీనినే గంధక మందురు. ఇది ఎరుపు, తెలుపు, పసుపు, నలుపు, అని నాలుగువిధములుగ నుండును. పసుపు రంగుగలది అమర శిల గంధకము. ఇది పలుకులు పలుకులుగ నుండును. దీనిలో క్రిమ్ళకుండ జేయుశక్తిగలదు. ఇది తత్వమును చక్కబరచును. వగరుగ నుండును వాతరోగములకు చర్మరోగములకు పని చేయును.

మో:—పావుతులము లగాయతు తులమువరకు.

సల్ఫేటుఆఫ్ఐరన్ - Sulphate of Iron :—దీనినే అన్నభే దంమరు. ఇది కొంచె మెచ్చుతక్కువగ స్వచ్ఛమైనది గను, బజారులలో దొరకునదిగ నుండును. కొద్దిగ పొగవర్ణము గలిగి బరువుగ నుండును. ఇది ఉప్పగ, పులుపుగ, వగరుగనుం డును. దీనిలో పలకలు పలకలుగా నుండి పెద్దముక్కలుగా నుండునదియును, చిన్నపలుకులుగ నుండునదియును మిగుల శ్రేష్టము. ఇది బలకారియగుటచేత జ్వరకాలమందును, నిస్త్రాణ యందును, నంజు నంకట మందును, రక్తమూత్రము, పిత్త వాతములందును వాడుదురు. ఇంకను దీనిని రసికారు కురుపులు కడుగుటకు వాడుదురు. పశువులకు విషముపెట్టినపుడు దీనిని విరుగుడుగా పెట్టవచ్చును.

మో:—తులము లగాయతు 2 తులములవరకు.

సింకోనా - Cinchona :—సింకోనావృక్షమునుండియే క్విన్" అనబడెడు మందు తయారుచేయబడుచున్నది. ఈ

చెట్లు మన దేశమునందు నీలగిరి పర్వతములమీదను, ఉత్తర మున డార్జిలింగు పట్టణప్రాంతములందును, సింహళ, జావా, జమైకా మొదలగు ద్వీపములలోను పెరుగుచున్నవి. ఇది దేహ పటుత్వకారి. జ్వరములకు మంచిమందు. ఏకారణముచేతనైన పశువు దుర్బల పడినయెడల దీనిని వాడవచ్చును.

మో:—అరతులము లగాయతు తులమువరకు.

సల్ఫేటుఆఫ్‌జింక్ - Sulphate of Zinc:—దీనినే తుత్తు నాగము, వెలితుత్తమందురు. ఇది నిర్వర్ణమైన పలుకులుగా నుండును. ఇది గనులలోపుట్టును. దీనిని నీటిలోకరగించి ఆనీ టిని కురుపులు వ్రణములు కడుగుట కుపయోగించుదురు.

స్పిరిట్ - Spirit:—ఇది తెలుపువర్ణముగా నుండును. దీనిని తదితరమందులతో కలిపి మర్దనచేయుదురు.

స్పిరిట్స్ అమ్మోనియా ఆరోమాటికసు-Spirits Ammonia Aromaticus:—ఇది యొకవిధమైనఅరకు. దీనిని కడుపునొప్పి, అజీర్తి, దగ్గు మొదలగు వ్యాధులకు తదితరమందు లతో కలిపి పోయవచ్చును.

స్పిరిట్స్ ఈథర్ నైట్రొసు-Spirits Aether Nitros:—

ఇది మూత్రవృద్ధిచేయును. చురుకుదనము పుట్టించును. దీనిని జ్వరములందు వాడవచ్చును.

సాలోల్ - Salol :— ఇది పలుకులు పలుకులుగా నుండును. నిర్వర్ణముగానుండి నీటిలో కలియును. కీళ్ళవాతనొప్పు కు, మొత్తలకు కలుగు నొప్పులకు పనిజేయును.

సోడియం బైకార్బనేట్ - Soda bicorbonate :—ఇది తెలుపురంగుగనుండి మెత్తగనుండును. ఉప్పగ, చిరిచేదుగ, నుండును. ఇది నీటిలోచక్కగా కలియును. జీర్ణకోశములను చక్కబరచును. కడుపునొప్పి, అజీర్తి, కడుపుబ్బు మొదలగు వ్యాధులకు పనిచేయును.

మో:—తులము లగాయతు 2 తులములవరకు.

సోడాసాలిసైలసు - Soda salicylas :—ఈపొడి తెల్లగానుండి మెఱయుచుండును. కీళ్ళనొప్పులకు, విరేచనములకు, వాతములకు, అతిమూత్రమునకు దీనిని నీటిలోకలిపి త్రాగించవలెను.

సోపు - Soap:—ఇది ఆమ్లవైరిగను, మూత్రవృద్ధిజేయునదిగ నుండును. దీనిలోపుల్లని విషవస్తువులను విరచుగుణము కలదు. మలబద్ధక మెక్కువగా నున్నపుడు దీనిని వేడినీటిలోకలిపిఆసనమూలముగ లోపలికెక్కించినయెడల మలము బయటకువచ్చును. ప్రతిడాక్టరునకు ఈసబ్బు ముఖ్యావసరము.

హ

హైడ్రార్జరం - Hydrargyrum:—దీనినే మెర్క్యురీ లేక పాదరసము అని అందురు. ఇది ఆయుర్వేదమునం దగ్రస్థానము వహించినది. దీని నెరుగనివారును ఉపయోగించనివైద్యులును లేరు. ఇది రససిందూరమువలె ఎఱ్ఱగానుండును. దీనిని ప్రత్యేకముగగాని, మరియొకమందుతో చేర్చిగానివాడవచ్చును. పొక్కటీగల మందుతోచేర్చి నిని పశువులకు కలుగువాపులకు ముఖ్యముగా వాడుదురు.

హైడ్రార్జిరీ పెర్ క్లోరిడ్ -Hydrargyri Perchloride:- ఇది నిర్వర్ణమై ముద్దలుగాగాని, తెల్లపొడిగాగాని యుండును. ఇది విషవస్తువు. దీనిని వ్యాసులైనులో కలిపి గూటిగడ్డలు, కణతులకు వాడుదురు.

హైడ్రోజెన్ పెరాక్సైడ్ -Hydrogen Peroxide:— దీనియందు పురుగులనుచంపు గుణముకలదు. చీముతో గూడిన పుండ్లమీద:నీమందు రాచిన బుసబుసమనిపొంగి పుండుపరిశుభ్రమగును. ఇది నీటివలెనే యుండును. దీనిని లోపలికీయరు. దీనిని సీసా తెరచియుంచినచో గుణము హరించిపోవును.

హానీ - Honey:—దీనిలో కొన్ని ప్రత్యేకపు విటమినులున్నవి. దీనికే తేనెయందురు. పశువుల గుండెలకు బలము చేయును. దీనిలో ఫాస్ఫారిక్ ఆసిడ్ అను విషము బహుస్వల్పముగ నుండును. ఇది అనేకవిధములుగా నుపయోగపడుచున్నది. దేహములోని చెడువస్తువులను తీసివేయును. అన్ని పౌడర్లలోను కలుపుదురు. ఇది మలినముగా నున్నయెడల వేడినీటిలో పెట్టి కరగించి పోయవలెను.

మో:—తులము లగాయతు రెండున్నర తులములవరకు

---

# అనుక్రమణిక



ఈదిగువ వ్యాధుల పేర్లక్రింద నుదహరింపబడిన మందులు ఆయావ్యాధుల కుపయోగింపనగును. ఆయామందులు అనుభవమునుబట్టి జాగ్రత్తగా విచారించి మరియు వాడుక చేయ నగును. విషపదార్థములయందు మోతాదులకు బహు మెలకువతో గమనించవలయును. మందులగుణములను గ్రహించుట అత్యంతావసరము.

పెద్దరోగము - Rinderpest:—నాగజెముడు, తాడికాయలు, కరక్కాయలు, సొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, ఉసిరికపప్పు, ఆవాలు, మనుష్యునిమూత్రము, దిరిసెనవేళ్లు ఎలుగుబంటి నెత్తురు, చేదుబీరాకు, గుంటకరాకు, వెదురాకు, మోదుగపువ్వు, తెల్లతుమ్మచెక్క, నల్లేరు, అడ్డసరము, గురువిందవేళ్లు, తెల్లజిల్లేడు, దేవదారు, సారాయి, నువ్వులనూనె, పాతచింతపండు, కలినీరు, ఉప్పు, పొటాసియం పర్మాంగనేట్, సీమఅవిసెనూనె, కార్బాలిక్ ఆసిడ్, వరిగంజి, పటిక, ఫినైల్, సీమసున్నము, కవిరి, మాచికాయలు, నల్లమందు, గంజాయి, కర్పూరము, పచ్చిపందివంటలు, నీరు, బోరిక్ ఆయింటుమెంటు, పశుప్రాణహారి మలాము.

దొమ్మలు - Anthrax:—వెల్లుల్లిపాయలు, మిరపకాయలు, ఆవాలు, వేడినీరు, వస, ఓమము, దుష్టపాకు, వామింటాకు, తుమ్మిఆకు, బాడిసప్లాకు, నల్లజీలకర్ర, మిరియాలు,

పసుపు, వేపాకు, కుప్పింటాకు, కరక్కాయలు, తాడికాయలు ఉసరికపప్పు, సొంటి, పిప్పళ్లు, మిరియాలు, ఎలుగుబంటి నెత్తురు, కరిధూపము, నల్లమేకపంచితము, మోదుగపువ్వు, కలినీరు, సున్నము, కుంకుడుకాయలరసము, సారాయి, కల్లు బెల్లము, ఉలవలు, నరమూత్రము, సున్నపుతేట, కొర్రపిండి, దిరిసెనచెక్క, ఆవుపాలు, రెప్పాలఇగుళ్లు, కుక్కపాలాకు, గాడిదగడపాకు, జటామాంసి, తెల్లగడ్డలు, సూరేకారం, పొగాకు, కర్పూరము, ఆవుపంచితము, గలిజేరాకు, పెన్నేరు, వాతలు, కర్పూలతైలము, వరిగంజి, కార్బాలిక ఆసిడ్ ఫినైల్.

జబ్బవాపు - Black Quarter:—కార్బాలిక్ ఆసిడ్; కర్పూరతైలము; జిల్లేడాకు; దుష్టుపాకు; పుట్టమన్ను; వావిలాకు; ఉమ్మెత్తాకు; మేకపాలు; వసువు; ఆముదము; గాడిద ఎముక; సారాయి; పొటాషియం పర్మాంగనెట్.

గురక - Haemerrhagic acepticaemia:—వాతలు; కార్బాలిక్ ఆసిడ్; వరిగంజి; పొటాసియం పర్మాంగనేట్; ఫినైల్; సారాయి; సొంటి; నల్లమిరియాలు.

గాళ్లు - Foot and Mouth diseases:—పెట్లుప్పు; ఉప్పు; నేలవేము; మంచిబెల్లము; పటిక; వెలిగారము; మైలతుత్తము; జొన్నలు; మంచినూనె; సీతాఫలపాకు పసరు; రావిచెక్క, తుమ్మచెక్క; ఫినైల్; తారు; నూకలగంజి; వేడినీరు; ఆవుమజ్జిగ; మంచినూనె; కర్పూరతైలము; గాడిదగడపాకు;

నీలిమందు; వేపనూనె; సైంధవలవణము, కొత్తిమీరనున్నము; ఆముదము; ఆకాశధూళి; హారతికర్పూరము; బాడితాకు.

జ్వరము-Sympathetic Fever:—దుష్టుపాకు; సారాయి; చేదుపొట్ల; చింతాకు; మేకపాలు; రెప్పాలయిగుళ్ళు; ఏనుగ పల్లేరు, బెల్లము.

మశూచి - Varida Sheep:—ఎప్సమ్‌సాల్టు; సొంటి; నీరు; కర్పూరము; కొబ్బరినూనె; వెలిగారము; బొగ్గు; మైల తుత్తము; బోరిక్ ఆయింటుమెంటు; పశువ్రణహారిమలాము.

రక్తమూత్రము - Red Water:—టిప్రాక్‌బ్లా; ఎప్సమ్ సాల్టు; సొంటి; ఆముదము; అన్నభేది; మునిదివిత్తులు; నేలవేము; జావ; సీమఅవిసెగింజలు; బార్లిగింజలు; నేరేడుచెక్కఊట; మోదుగపువ్వు; పెసరగుగ్గిళ్ళు, పేరినెయ్యి; కలిసీరు; సారాయి; అల్లము, నల్లమిరియాలు; వేపచెక్క; లవంగపట్ట; కావిరాయి.

క్షయ - Tuberculosis:—టూబర్క్యులిన్; తగిన సంరక్షణ.

పొదుగువాపు Garget:—ఆముదము; సొంటి; నీరు; నాటుసారాయి; నల్లమిరియాలపొడి; అయోడిన్ తైలము; ఉమ్మెత్తాకులు; బోరిక్ ఆయింటుమెంటు; సూరేకారము; మిరియాలు ఉప్పు; వెల్లుల్లి; ఉత్తరేణియాకు; దృష్టిదోషము; నెయ్యి; వేపాకు; నరమూత్రము; పశువ్రణహారిమలాము.

నోటిపూత:—పొటాసియంక్లోరేట్, కోడిగుడ్లు, తేనె, బోరిక్ ఆసిడ్, వెలిగారము.

నెమరుపొట్ట అజీర్ణాహారముతో దట్టమెయుండుట - Impaction of the ruman:—కర్పూరతైలము; సొంటి; ఎప్సన్ సాల్టు; సీమఅవిసెనూనె; నవాసాగరము; మునిడివిత్తులపొడి; నల్లమిరియాలు; నాటుసారాయి; పెట్లుప్పు, నేలవేము; వాము: బొగ్గుపొడి; మిరెపకాయలు, సున్నపుతేట; ఆముదము: ఉప్పు; చీకిరేనిచెక్క; మిరియాలు; ఖురాసానివాము; మైసాక్షి; వావిలిచిగుళ్లు; పచ్చిగడ్డి.

కడుపుబ్బు - Tympanitis:—కర్పూరతైలము, మునిడివిత్తులపొడి; అవిసెనూనె, భేదిఉప్పు, మిరపకాయలపొడి, సొంటి, సారాయి, పెట్లుప్పు, వాము, బొగ్గు, సున్నపుతేట, జొన్నదంటు, ఉప్పు, కొబ్బరినూనె, మిరియాలు, సోపు, జీలకర్ర, ఇంగువ, మెంతులు.

అజీర్తి - Indigestion:— మెగ్నీషియం సల్ఫేటు, సొంటి, సోడాఉప్పు, అన్నభేది, నేలవేము, వాము, పెట్లుప్పు, నవాసాగరము, రెప్పాలయిగుళ్లు, పుల్లఆముదపుయిగుళ్లు, విషకంటకాలు, ఆవుపంచితము, మిరియాలు, మెంతులు, ధనియాలు, వాము, సీమసున్నము, కవిరి, గంజి, సున్నపుతేట, కొబ్బరినూనె, పచ్చికొబ్బరి, మజ్జిగ, ఉప్పు, ఆవపిండి, ఉర్లగడ్డలు.

కడుపునొప్పి - Colic :— సీమఅవిసెనూనె; కర్పూరతైలము; మిరపకాయలు; సారాయి; చేదుబీరాకు; విషకంటకాలు; ఊడగచెక్క; సూరేకారము; జిల్లేడుపువ్వులు; వావిలాకు; దిరిసెనాకు; తంగేడాకు; వేపాకు; ఆముదము; నెయ్యి; నూనె; పొగాకు; యింగువ; తమలపాకులు; మిరియాలు

వెల్లుల్లిపాయలు; వాము; దుష్టుపాకుపసరు; వులికలినీరు; పెండలపువేళ్ళరసము.

విరేచనములు - Diarrhoea.— కవిరి; నూకలజావ; వాము; మెంతుత్తము; నల్లమందు; యింగువ; మాచికాయలు; సీమసున్నము; హారతికర్పూరము; సారాయి; తుత్తురాకు; తీండ్రికొనలు; పైడితంగేడుకొనలు; కరక్కాయ; బెల్లము; మెంతులు; కర్పూరము; మామిడిపండ్లపొడి; దానిమ్మకాయల తొక్కలు; సోపు; సొంటి; పిప్పళ్ళు; మిరియాలు; మజ్జిగ; పైడిపత్తిఆకు.

రక్తవిరేచనములు - Dysentery:— తుత్తురాకు; తంగేడుచెక్క; నల్లవులుగుడుచిగుళ్ళు; కందులు; మోదుగ పువ్వు; పేరినెయ్యి; పెసరగుగ్గిళ్ళు; నల్లమందు; వులిసేరాకు; సీమసున్నము; కవిరి; మాచికాయలు; గంజి; వుడకబెట్టిన నీరుల్లిపాయలు; అవిసెవిత్తులు; బియ్యము; ఉప్పు.

లివర్ రాట్ - Liver rot :— అన్నభేది; సొంటి; నేలవేము; నవాసాగరము; వాము; అత్తిచెక్క; యిప్పచెక్క; నేరేడుచెక్క, నల్లజీలకర్ర; వస; తాటిబెల్లము; బెల్లపుపానకము; సున్నపుతేట.

మలబద్ధకము - Constipation :— ఉప్పు; తంగేడుచెక్క; వరిగంజి; ఆముదము; గంధకము; చింతపండువులుసు; సారాయి.

కామాల- Jaundice :— నవాసాగరము; ఊడగపట్టవేరురసము; మజ్జిగ; పిప్పలి; మిరియాలు; గుంటగలిజేరాకు.

రొంప - Catarrah:—పొటాసియంక్లోరేట్, కర్పూరము, మంచిబెల్లము, ఛెదిఉప్పు, సూరేకారము, నవాసాగరము; నల్లమందు, కర్పూరము, కర్పూరతైలము, బెల్లము, అల్లము.

దగ్గు - Cough:—రావిచెక్క, పచ్చిపాలు, మిరియాలు, దిరిసెనచెక్కరసము, సొంటి, నల్లమందు, వాయువిడంగములు, బాడిదచెక్క, బాడిదఆకు, సైంధవలవణము, సొంటి, కుంకుమపువ్వు, తేనె, ఆవాలు, వెల్లుల్లిపాయలు, జిల్లేడుపువ్వు, నేలవాకుడు, కటకరోహిణి, మిరియాలు, అల్లము, తమలపాకులు, జీలకర్ర, నీరుల్లిపాయలు, పెన్నేరుదుంప, పులిచల్ల.

కసిమిరి - Asthma:—పాషాణసంబంధమైన అరకు; పొటాసియంఅయొడయిడ్; ముసిడివిత్తులపొడి యూకలిప్టసు ఆయిల్; వెదురాకు; వెంపలియాకు; కలిసీరు; మోదుగాకు పసరు; సొంటి; నల్లమందు; మంచిబెల్లము; అల్లము; గంటెలు; నబ్బు; గుగ్గిలము; తాటిబెల్లము; మిరియాలు.

న్యూమోనియా - Pnemonia:— కర్పూరతైలము, యూకలిప్టసు; బార్లిగంజి; తేనె.

ముక్కుబంతి - Catarrh:—పిల్లిపిసరగడ్డ, నీరుల్లిపాయలు; కుందేలువెంటికలు, సాంబ్రాణిపొగ.

వాతము - Rheumatism:—రావిచెక్క, దిరిశనచెక్క, వాము, వస, పుట్టమన్ను, ఆవాలు, నీరుల్లిపాయలు, టాకలాకు, ఆకుజెముడు, పుల్లజెముడు, కప్పరెల్లిఆకు, పసుపు, మగలింగపట్టు.

అడ్డసరపాకులు, పెండలపువేళ్ళరసము, సున్నపుతేట, కలిసీరు, ఏరుపెసరాకు, సేగుర్తాకు, వెల్లులిపాయలు, జీలకర్ర, చేదుజీలకర్ర, దాల్చినచెక్క, మిరియాలు, సొంటి, ఇంగువ, ధనియాలు, వావిలాకు, బాడిదాకు, దిరిశెనాకు, తంగేడాకు, వేపాకు, ఆముదము, సొంటి, పిప్పళ్లు, నెయ్యి, నూనె, కుప్పింటాకు, కసివిందాకు, నేలవేము, కోష్టు, మేకపంచితము, కొబ్బరిపాలు, కల్లు, మోదుగపువ్వు.

పక్షవాతము - Paralysis:—నేలవేము, ముసిడివిత్తుల పొడి, అన్నభేది, జావ, ఆవాలు, వెల్లులిపాయలు, సేగుర్తాకు, మంచినూనె.

కీళ్ళవాతము - Rheumatism — పత్తిగింజలు, గోరింటాకు, నల్లజెమ్మొత్తాకు, నల్లమందు, వస, కర్పూరము, మంచినూనె, పశువర్ణహారిమలాము.

తీటవాతము:— బూరుగబంక, నువ్వుపువ్వులు, నేపాళవిత్తులు, గానుగనూక, జొన్ననూక, పశువర్ణహారిమలాము.

నక్కవగర్పు:— చేకొణితాకుపసరు, మంచినూనె, మిరియాలు, తామరదుంపలు, పసుపు, బెండవేళ్లు, పంచదార, గొఱ్ఱపాలు, కటకరోహిణి, గంటుబారంగి, సొంటి, వెలిగారము, నల్లజీలకర్ర, ఇంగువ, పిప్పళ్ళు, గ్రంథిబీడు, కొడిశపాలవిత్తులు కస్తూరిపసుపు, గుగ్గిలము, కోష్టు, తమలపాకువేళ్లు, మునగవేళ్ళరసము.

ధనుర్వాయువు - Tetanus:— ఉప్పు, వాము, నల్ల మందు, ఉమ్మెత్త, వస, చేమబీరాకుపసరు, కరిధూపము.

పీనసరోగము:—అవిసెపువ్వులు, ఆవునెయ్యి, ఉప్పు, రసకర్పూరము, వాకుడుగాయలు.

ఊర్ధ్వశ్వాసరోగము:—కర్పూరము; మఃసాంబ్రాణి; సూరేకారము; నల్లమందు.

తుమ్ములరోగము:—నల్లమందు; కర్పూరము; కర్పూర తైలము; వెంపలియాకు రసము; నీరుల్లిపాయల రసము; యూకలిప్టస్ ఆయిల్.

నీరుచురుకు - Stranguary:—పెట్లుప్పు; సూరేకారము; గుగ్గిలము; కర్పూర తైలము; దూసరాకు; తాటిబెల్లము; మంచిబెల్లము.

మలమూత్రబంధరోగము:—ఉప్పు; వాము; గురివిందాకుపసరు; కలినీరు; తంగేడుచిగుళ్ళు; రాజనపుపిండి.

చేరుమూద:— కసిందాకు; నల్లజీలకర్ర; సూరేకారము; గోరోజనము; కర్పూరతైలము; గుంటగలిజేరాకుపసరు; ఎర్రజొన్నలు; కలినీరు; సొంటి; పిప్పలి; మిరియాలు.

ఉంగిడి.— వావిలాకురసము; కుంకుడుగాయ నురుగు; నిమ్మరసము; పాతచింతపండు రసము; నల్లేరు; అమ్మోనియంక్లోరేడ్.

పెనుబాలవాపు - Anasarca:— ఉడికించిన పేడ; మిరి.

యాలు; తాళిసపత్రి; పెట్లుప్పు; హారతికర్పూరము; గంజి

అరుగ్రివాపు - Yoke galls:—దొండాకు; దుష్టుపాకు; పీతచమురు; బొక్కెనాకు; బిళ్లుడుమసి; బోరిక్ ఆయింటుమెంటు రాతి తడిసున్నము; రేగడబురద; పశువ్రణహారిమలాము.

పేగులవాపు:— నల్లమందు; నెయ్యి; వేడికాపులు; బియ్యపుకలి; వెన్న; పచ్చికొబ్బరి; పశువ్రణహారిమలాము.

కల్లవాపులు:—ఆవుపేడ; పాలు; వావిలాకు; పుట్టమన్ను; మిరియాలు; చేదుజీలకర్ర; సొంటి; ఉమ్మెత్తాకు; దుష్టుపాకు; గాడిదగడపాకు పశువ్రణహారిమలాము.

మెడమీది పుండు:— కర్పూరము; ఎండు అరటియాకుచూర్ణము; వెన్న; బూడిద; ఆవపిండి; మిరెపకాయలు; కొబ్బరినూనె; పశువ్రణహారిమలాము; గుంటకరాగ్రిఉ; రాతిసున్నము; కార్బాలిక్ ఆసిడ్.

తలతిరుగుడు రోగము:—కరిధూపము; సొంటి; మిరియాలు; పిప్పలి; వాతలు; చేదుబీరాకుపసరు; నెయ్యి.

నల్లకప్పువేయుట:— వెదురాకు; నేలవేము, నల్లేరు; అడ్డసరాకులు; ఆవపిండి; గుమ్మడిపండు; కడుగు.

నల్లతెగులు:—ముసాంబ్రము-సొంటి-భేదిఉప్పు-దిరిసెన చెక్కరసము-నరమూత్రము.

అవిరి-Ophthalmia:— పెంకుపొడి-పేరినెయ్యి-అరటిదుంపరసము- అరటియాకురసము- ఉప్పు- రసకర్పూరము-- వాకుడాకు- వెన్న- పశునేత్రాంజనము.

కంటిలోపువ్వులు:—దొండాకుపసరు-మిరియాలు-మండపసుపుకొమ్ము-ఉప్పు-కాకరాకు-పుగాకు-పసిబాలురమూత్రము-దిరిసెనచెక్కరసము-పిప్పళ్ళు-సొంటి-వ్యాసునైను-తేనె-సబ్బు-చీనాపంచదార-లవంగాలు-మిరియాలు- అక్కలకర్ర-ఉప్పుడుబియ్యము- తాచుపాము తలకాయ -లవంగాలు-నిమ్మకాయ-పళునేత్రాంజనము.

కన్నులు పుసికట్టుట:—— పటిక-ఆముదము- మైలతుత్తము-పసుపు-కుంకుమ-ఖర్జూరగింజ – కందిగింజ – పళునేత్రాంజనము.

కన్నులెఱ్ఱబారినందుకు:——చిల్లగింజ-చింతగింజ-మైలతుత్తము- సాలామిశ్రి-గోగువేరు-పటిక- కందిగింజ, వెన్న-పళునేత్రాంజనము.

కంటిపొరలు:—బొమ్మజెముడుపాలు, వెన్న, నీరుల్లిపాయరసము, దొండాకుపసరు, సబ్బు, పటికబెల్లము, వాకుడాకు, బెల్లము, జీడిచమురు, జిల్లేడుపాలు, కొబ్బరినూనె, పాలతుత్తము, పళునేత్రాంజనము.

రేచీకటి:—చోళ్లు, ఆవువెన్న, ములగాకురసము, తేనె, చేపక్రొవ్వు, పళునేత్రాంజనము.

చెవిరోగములు:—మంజిష్ఠ, ఇంగువ, సైంధవలవణము, వెల్లుల్లిపాయలు, ఆవుపాలు, తేనె, వేపనూనె, గవ్వసున్నము, స్పిరిట్, బోరిక్ ఆసిడ్, వావిలాకు, మంచినూనె.

ఎముకలు విరుగుట Fractures:—చింతగింజల బెండెడు, ప్యారిస్ప్లాస్టరు, ఉత్తరేణియాకు, కోడినెత్తురు, వావిలాకుపసరు, గలిజేరాకుపసరు, మిరియాలు, మినపపిండి, వెన్న, పాలు.

బెణుకులు-Sprains:—కర్పూరము, సబ్బు, కర్పూరతైలము, ఆవాలపొడి, కొబ్బరినూనె, పచ్చిజెముడుపాల చెక్క, నేపాళనూనె, పశువ్రణహారిమలాము.

మలిమిడికుంటు:— నూనెకడియము, చిత్రమూలము, ఆముదము, సొంటి, పిప్పళ్లు, మిరియములు, మైలతుత్తము, ముద్దారుసింగు, హారతికర్పూరము, కారింగువ, మిరియపుగింజలు, దుష్టపాకులు, పశువ్రణహారిమలాము.

మెత్తగాళ్లు:— కరక్కాయలు; కొత్తసున్నము; పటిక బెల్లము; ముండ్లకోటకూర; తెల్లబాడిదచెక్కరసము, మజ్జిగ; తవుడు; నీరు; పశువ్రణహారిమలాము.

కొమ్ములువిరుగుట:—ఫినైలు; ఫ్రెంచివార్నీసు; బలుసాకు; వెండ్రుకలు; పశువ్రణహారిమలాము.

కొమ్ముడొల్ల:—వస; రసకర్పూరము; పొగాకు; మంచిగంధము; మిరియాలు; చేదుజీలకర్ర; ఆవాలు; వెల్లుల్లిపాయలు; వావుడాకుపసరు.

గాయములు-Wounds:— పటిక; వేపనీరు; పొటాసియంపర్మాంగనేట్; వెలిగారము; మసిబొగ్గు; మైలతుత్తము; మాచికాయ; కాచు; కర్పూరతైలము; మంచినూనె; జీడి

విత్తులు; వస; కారింగువ; సీమసున్నము; సీతాఫలపాకు; వేపాకు; చింతాకు; కర్పూరము; కర్పూరతైలము; పొగాకు; తెల్లమంగ; పటిక; అన్నభేది; టించర్ అయోడిన్; ఫ్రెంచివార్నిసు; సీలిమందు; పశుప్రాణహారిమలాము.

పాడిపశువుల పాలగ్రంధుల రోగములు:—కార్బాలిక్ ఆసిడ్; గ్లిసరీన్; సోపు; జీలకర్ర; ధనియాలు; గంధకము; బోరిక్ ఆయింటుమెంటు; పశుప్రాణహారిమలాము.

పాలు చేపుటకు:—చేకొండ్రిఆకు; తెల్లావాలు; జీలకర్ర; కల్లుప్పు; ఆయాకు; మిరియాలు; పచ్చిపసుపు, ఉలిమిడి; ఉసరిక; మినుములు; కలకండ; ఆవాలు; నేలతాటిగడ్డ; దురదగొండి గింజలు; ఆవునేయి; మజ్జిక; తాడికాయలు; సైంధవలవణము.

మావి పడవేయుటకు:—సారాయి; చన్నీళ్లు; బెల్లము; బెండకాయలు; నువ్వులు; తాడికాయలు; కంద; పులిచల్ల.

మావి తిన్నపశువునకు:— గోధుమగంజి; నెయ్యి; అనుములు; పుచ్చాకు; మజ్జిగ; తాడికాయలు; జీలకర్ర; ఉప్పు.

## —♦ లేగదూడల జబ్బులు ♦—

నోటిగాలి:- మంచినూనె; తుమ్మాకు; నేయి; తుమ్మగింజలు; నీరుల్లిపాయలు; పటిక; వెలిగారము.

¶ కడుపులోని పురుగులు—Thread Worms:—గ్రంథరాజము; కటకరోహిణి; ఉప్పు; నువ్వులనూనె; గ్రంధిరాజపు బంక; మంచినూనె.

అజీర్తి-Indigestion:—కంజాయి; పెన్నేరుగడ్డ; సొంటి; ఎప్సమ్‌సాల్టు; వాము, ఆముదము, గోలిమిడాకు.

పారుడురోగము-Scour:— సొంటి, పిప్పళ్లు; మిరియాలు; మజ్జిగ; వెన్న, పసుపు; రేగడిమట్టి, పెరుగు; సీమసున్నము, కవిరి, మాచికాయలు.

మలబద్ధకము-Constipation:— ఆముదము; సొంటి; వేడినీరు; ఎప్సమ్‌సాల్టు; చేదుజీలకర్ర; ఉప్పు, చింతపండు; గాడిదగడపాకు.

బొడ్డుపుండు-Navel ill:—పటిక; మైలతుత్తము; వ్యాసులైను; బోరిక్ ఆసిడ్; ఫ్రెంచివార్నిసు; కర్పూరము; సీతాఫలపాకు; పశువ్రిణహారిమలాము.

రక్తచెల్లి-Purpura Hmorrhagica:—కోడిగుడ్లు; చెరుకుపాలు; తులసిఆకురసము; ఆవుపాలు; గంగసింధూరము; మైలతుత్తము; వెన్న; పశువ్రిణహారిమలాము.

వంపర-Scrofuloustumours :—గాడిదగడపాకు, దుష్టపాకు, ఆముదము, జిల్లేడాకు, మైలతుత్తము, మిరియాలు, వస, కవిరి, తురకవేపాకు, పేడఉడుకు, పశువ్రిణహారిమలాము.

గజ్జి, తామర- Eczema, Ringworm :— గంధకము, కొండికవిత్తులనూనె, పొగాకు, ఉప్పు, కర్పూరము, మైలతుత్తము, పెరుగు, బోరిక్ ఆసిడ్, జింకుఆక్సైడ్, వేపనూనె, ఫినైల్, కర్పూరతైలము, తుపాకిమందు, నేపాళవిత్తులు, కామంచాకుపసరు, ఆవుపంచితము, గాడిదగడపాకు, దుష్టపాకు, సున్నము, గోమారితైలము.

తోకనుసిమిరి-Mange:— నల్లేరు, పసుపు, మిరాగడ, మైలతుత్తము, వస, మేకవదరు, విషబొద్ది, సూరేకారము, ఆముదవు,పలుకులు, కొబ్బరినూనె, తోకక్రిమిసంహారిణి.

కణతులు:—కటకరోహిణి, కోష్టు, ఆవాలు, వెలిగారము, జొన్నపిండి, గండఫెరోజా, కస్తూరిపసుపు, కొట్టుపసుపు, గంధకము, మణిశిల, ఆవునెయ్యి, పిండికట్లు, పశువ్రణహారిమలాము.

కాలినబొబ్బలు—Burns:—రాతితడినున్నము: గ్లిసరీన్: వంటఆముదము: సీమనూనె: కొబ్బరినూనె: ఐడోఫారము: మజ్జిగ: నవనీతము: సున్నపునీరు: పిడకబూడిద: పశువ్రణహారిమలాము.

పొడలు— గోమారులు— బుడ్డపుంజులు— పేలు— మిన్నలులు—దోమలు:— వస: మంచినూనె: దుష్టపాకుపసరు: ఫినైల్: ఫ్రెంచివార్నీసు: ఉమ్మెత్తవిత్తులు: పొగాకు:విభూతి: పుల్లమజ్జిగ: బూడిద: కర్పూరము: అమరశిలగంధకము: వేపాకు. కార్బాలిక్ ఆసిడ్: గోమారితైలము.

విషపురుగులకాట్లు:— అన్నభేది: కోడిగుడ్లు: పాలు: గంజి: నాగముష్టిణి: గాడిదగడప: తెల్లఈశ్వరి: తిప్పతీగె: ఎర్రకలువమంప: గుంటకరాకు: శావిరాయి: కరిధూపము; గొబ్బివేళ్లు.

విషములుపెట్టుట - Poisons:— నాగముష్టిణి: తెల్లజిల్లేడు: ఉప్పు: గాడిదగడప: గుంటకరాకు: ఈశ్వరవేరు: పిప్ప

ళ్ళు: సొంటి: వస: మిరియాలు: వెలగబంక: సున్నపునీరు: ఘాటుసారాయి: తవుడు.

కాళ్ళజాడ్యములకు:— వెల్లుల్లిపాయలు: ఆవాలు:సొంటి పిప్పళ్ళు: మైలతుత్తము: ముర్దారుసింగు: హారతికర్పూరము.

పరా:—ఇంకను కొన్నివిషయములు తెలిసికొనవలెననిన నాచే రచింపబడిన పశువైద్యచింతామణి చూడుడు.

---

## ముఖ్యమైనరోగములకు అనుభవసిద్ధమైన ఔషధములు.

జ్వరహరులు - Febrifuges:—జర్వమును హరించునవి. ఉదాహరణము—:సురేకారము-సింకోనాచెక్క.

ఉద్రేకకారులు - Stimulants:—మాంద్యమును పోగొట్టి విజృంభణము కలుగజేయునవి. వీనిని ఉద్దీపనకారులని కూడ చెప్పుట కలదు. ఉ॥ సారాయి-సొంటి.

కారపుమందులు-దాహకములు - Caustics:— ఇవి ప్రయోగింపబడిన ప్రదేశములయందు మంటపుట్టించి ఆభాగమును కాల్చునవి. ఉ॥ కారపుకడ్డీ—వాతలువేయుట.

దేహపటుత్వకారులు - Tonics:—జీర్ణశక్తిని వృద్ధిజేసి దేహమునకు బలము కలుగజేయునవి. ఉ॥ సొంటి - నేలవేము.

నిర్గంధకారులు - Deodrizers:—దుర్వాసనలను పోగొట్టునవి. ఉ॥ బొగ్గు-కార్బాలిక్ ఆసిడ్—గంధకము.

మూత్రవర్ధనులు—Diuretics:—దేహమందు విస్తరించి చేరియుండు నీరును మూత్రరూపముగా బయలు వెడలించునవి. ఉ॥ సూరేకారము-నవాసాగరము.

మృదువిరేచనకారులు- Laxatives:— కడుపులో చేరియుండు గాలిని బయటకు వెడలించునవి. ఉ॥ ఇంగువ-ఎప్సం సాల్టు.

సుఖస్థాపకములు - Alteratives :— దేహమందుండిన మలినమును తొలగించి దేహసుఖమును కలిగించునవి. ఉ॥ రస భస్మము-నేలవేము-అన్నభేది.

సోకుడుపరిహారులు - Disinfactants:— సోకుడు అంటు జాడ్యసంబంధములగు అంకురములను అణచునవి. ఉ॥ కార్బాలిక్ ఆసిడ్—ఫినైల్—గంధకము.

---

భేదిమందులు - Laxatives

1 ఎప్సం సాల్టు 15 తు
వేడినీరు శేరు
కలిపి త్రాగించవలెను.

2 ఉప్పు 8 చటాకులు.
తంగేడుచెక్క ¾ తులములు.
వరిగంజి అర్ధశేరు కలిపి త్రాగించవలెను.

3 ఆముదము సవాశేరు త్రాగించవలెను.

## జ్వరనివారణౌషధములు.

1 కర్పూరము 1 తు
సూరేకారము 1 తు
సారాయి 5 తు

తెచ్చి కర్పూరమును సారాయిలో కలిపి తరువాత సూరేకారము వేసి దానిలో శేరుచన్నీళ్లు కలిపి త్రాగించవలెను.

2 వెంపలిఆకు 5 తు
హారతికర్పూరము $\frac{1}{4}$ తు
సూరేకారము $\frac{3}{4}$ తు
ఉప్పు రెండున్నర తు
మిరియాలు రెండున్నర తు

కలిపి ఒక శేరు మజ్జిగలో గాని, పులిసినగంజిలో గాని కలిపి త్రాగించవలెను.

## ఉద్దీపనౌషధములు.

1 నాటుసారాయి 10 తు
సొంటిపొడి 1 తు
నల్లమిరియాలపొడి ముప్పాతిక తులము
ఒక శేరుజావలో కలిపి త్రాగించవలెను.

2 అన్నభేది 1 తు
ఉప్పు రెండున్నర తు
పొడిగచేసి ప్రతిపూట తినిపించవలెను.

## ఉపశాంతికరములు.

| | | |
|---|---|---|
| 1 | గంజాయిపత్రి | 1 తు |
| | ఇంగువ | 1 తు |
| | నాటుసారాయి | 10 తు |

శేరున్నర నీటితోకలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | కర్పూరతైలము | రెండున్నర తు |
| | సీమ అవిసెనూనె | 10 చటాకులు |

కలిపి త్రాగించవలెను.

## వగరౌషధములు.

| | | |
|---|---|---|
| 1 | సీమసున్నము | రెండున్నర తు |
| | కవిరి | ఒకటిన్నర తు |
| | వాము | రెండున్నర తు |
| | జావ | శేరు |

కలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | మైలతుత్తము | 1/8 తు |
| | నీరు | శేరు |

కలిపి త్రాగించవలెను.

## సామాన్యముగా ఆరోగ్యమునిచ్చు మందులు.

| | | |
|---|---|---|
| 1 | నవాసాగరము | ఒకటింబావు తు |
| | గంధకము | 2 తు |
| | వాము | ఒకటిన్నర తు |
| | ముసిడివిత్తులు | 1/8 తు |

| | |
|---|---|
| జావ | 1 శేరు |

కలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | మసాంబ్రము | 1 తు |
| | సొంటి | రెండున్నర తు |
| | ఉప్పు | రెండున్నర తు |
| | గంధకము | రెండున్నర తు |
| | జావ | 1 శేరు |

కలిపి త్రాగించవలెను.

## బలవర్ధకౌషధములు

| | | |
|---|---|---|
| 1 | వేపచెక్క | రెండున్నర తు |
| | లవంగపట్ట | రెండున్నర తు |

కలిపి నూరి ఈయవలెను.

| | | |
|---|---|---|
| 2 | నీరుల్లిపాయలు | 1/4 సేరు |
| | బెల్లము | అర్ధ సేరు |

కలిపి ముద్దచేసి పెట్టవలెను.

## క్రిమిహారములు.

| | |
|---|---|
| ఇంగువ | ఒకటిన్నర తు |
| గంధకము | రెండున్నర తు |
| మోదుగగింజలు | రెండున్నర తు |
| జావ | ఒక శేరు |

కలిపి త్రాగించవలెను.

నొప్పిని తెలియజేయకుండ మత్తునుకలుగజేయు మందులు.

| | | |
|---|---|---|
| 1 | నల్లమందు | 1 తు |
| | అల్లము | 1 తు |
| | నాటుసారాయి | 10 తు |
| | ఇంగువ | 1 తు |
| | జావ | 1 శేరు |

కలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | గంజాయి | 1 తు |
| | ఇంగువ | 1 తు |
| | సొంటి | ఒకటింబావు తు |
| | సారాయి | 10 తు |
| | జావ | శేరు |

కలిపి త్రాగించవలెను.

చర్మరోగములకు

| | | |
|---|---|---|
| 1 | కర్పూరము | 1 భాగము. |
| | వేపనూనె | 10 భా |
| | కొబ్బరినూనె | 20 భా |

కలిపి శరీరమునకు పట్టించుము.

| | | |
|---|---|---|
| 2 | గంధకము | 2 భా |
| | కర్పూరము | 1 భా |
| | మైలతుత్తము | 1 భా |
| | అవిసెనూనె | 5 భా |

కలిపి శరీరమునకు పట్టించవలెను.

## పురుగులుపడి దుర్వాసనవేయు పుండ్లకు.

| | | |
|---|---|---|
| 1 | తెల్లమంగ | 1 పాలు |
| | హారతికర్పూరము | 1 పాలు |
| | నువ్వులనూనె | 8 పాళ్ళు |

కలిపిపుండ్లకు పట్టించవలెను.

| | | |
|---|---|---|
| 2 | కర్పూరతైలము | 12 పాళ్లు |
| | మంచినూనె | 20 పాళ్లు |
| | పొగాకుపొడి | 1 పాలు |
| | కర్పూరము | 2 పాళ్లు |

కలిపి పట్టించవలెను.

## బెణుకునొప్పులకు.

| | | |
|---|---|---|
| 1 | నేపాళనూనె | 1 పాలు |
| | కర్పూరతైలము | 8 పాళ్లు |

తెచ్చి నొప్పిగలచోట మర్దించుము.

| | | |
|---|---|---|
| 2 | ఆవాలపొడి | 10 తు |
| | కర్పూరతైలము | 15 తు |
| | కొబ్బరినూనె | 15 తు |

కలిపి నొప్పిగలచోట మర్దించుము.

## నులిపురుగులు నశించుటకు.

| | | |
|---|---|---|
| 1 | కర్పూరతైలము | రెండున్నర తు |
| | సీమఅవిసెనూనె | 30 తు |

కలిపి త్రాగించుము.

| | | |
|---|---|---|
| 2 | అన్నభేది | బావుతు |
| | గంధకము | ఒకటింబావుతు |
| | ఉప్పు | ఒకటింపావుతు |

కలిపియ్యవలెను.

## పెద్దరోగము - Rinderpest

| | | |
|---|---|---|
| 1 | పొటాషియంపర్మాంగనేట్ | ముప్పాతిక తు |
| | వేడినీరు | సేరు |

కలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | పాతచింతపండు | 15 తు |
| | ఉప్పు | 15 తు |
| | కలినీరు | చాలినన్ని |

కలిపి త్రాగించవలెను.

## దొమ్మ - Anthrax.

| | | |
|---|---|---|
| 1 | సారాయి | 2 డ్రాములు |
| | దుష్టపాకుపసరు | పావుసేరు |

కలిపి త్రాగించవలెను.

| | | |
|---|---|---|
| 2 | కల్లుబెల్లము | 1 సవాసేరు |
| | నరమూత్రము | అర్ధసేరు |
| | వేయించిన ఉలవలు | సోలెడు |

కలిపి త్రాగించవలెను.

## ఙరమ - Sympathetic fever.

| | | |
|---|---|---|
| 1 | కార్బాలిక్ ఆసిడ్ | 1/3 తు |

వరిగంజి పావు సేరు
కలిపి త్రాగించవలెను.

2 సారాయి 2 డ్రాములు
దుష్టుపాకుపసరు పావు సేరు
కలిపి త్రాగించవలెను.

గురక - Haemarrhagic acepticaemia.

1 కార్బాలిక్ ఆసిడ్ అర తు
వరిగంజి సేరు
కలిపి త్రాగించవలెను.

2 సారాయి 2 డ్రాములు
త్రాగించవలెను.

గాళ్లు - Foot and mouth disease.

1 పెట్లుప్పు 1/3 తు
ఉప్పు రెండున్నర తు
నేలవేము రెండున్నర తు
మంచిబెల్లము 10 తు
వేడినీరు అర్ధ శేరు
కలిపి దినమున కొకసారివంతున వేడితగ్గువరకు త్రాగించవలెను.

2 పచ్చజొన్నలు 1 కుంచెడు
మంచినూనె 1 వీసె

తెచ్చి, జొన్నలు తోపగావండి దానిలో యీమూనె కలిపి ముద్దలుచేసి వారముదినములు పెట్టుము.

మశూచి - Variola Sheep.

1 ఎప్సెన్సాల్టు 30 తు
సొంటి ఒకటిన్నర తు
నీరు అర్ధసేరు
కలిపి త్రాగించవలెను.

2 సింకోనాచెక్క ముప్పావు తు
సూరేకారము ఒకటింపావు తు
గంధకము 2 తు
కలిపి పెట్టవలెను

రక్తమూత్రము - Red water.

1 సోపుగింజలు రెండున్నర తు
సొంటి ఒకటింబావు తు
నేలవేము ఒకటింబావు తు
బెల్లము 5 తు
కలిపి పెట్టవలెను.

2 మోదుగపువ్వు 5 తు
కలినీరు అర్ధసేరు
కలిపి త్రాగించవలెను.

నంజు - Dropsy.

1 సూరేకారము 3 తు

| | |
|---|---|
| అన్నభేది | 1 తు |
| నేలవేము | 3 తు |
| సొంటి | 3 తు |

కలిపి ఈయవలెను.

## కడుపుబ్బు - Tympanitis.

| | |
|---|---|
| 1 ఎప్సంసాల్టు | 30 తు |
| సొంటి | రెండున్నర తు |
| మునిడి విత్తులపొడి | పావు తు |
| వేడినీరు | అర్ధసేరు |

కలిపి త్రాగించుము.

| | |
|---|---|
| 2 సోపు | ఒకటిన్నర తు |
| జీలకర్ర | 1½ తు |
| ఇంగువ | ముప్పాతిక తు |
| నీరు | అర్ధసేరు |

కలిపి త్రాగించవలెను.

## అజీర్తి - Indigestion.

| | |
|---|---|
| 1 సీమసున్నము | రెండున్నర తు |
| కవిరి | ఒకటింపావు తు |
| వాము | ఒకటింబావు తు |
| వరిగంజి | అర్ధసేరు |

కలిపి త్రాగించవలెను.

| | |
|---|---|
| మెంతులు | 1 1/2 తు |

| | |
|---|---|
| వాము | ముప్పావు తు. |
| ధనియాలు | ఒకటిన్నర తు. |
| వేడినీరు | అర్ధ సేరు. |

కలిపి త్రాగించవలెను.

## కడుపునొప్పి - Colic

1 
| | |
|---|---|
| వాము | 2 తు. |
| చేదుజీలకర్ర | 2 తు |
| ఉప్పు | 5 తు |
| వేడినీరు | అర్ధ సేరు |

కలిపి త్రాగించవలెను.

2 
| | |
|---|---|
| ఆముదము | సవా సేరు |

త్రాగించుము.

## విరేచనములు - Diarrhoea.

1 
| | |
|---|---|
| సీమసున్నము | 3 తు |
| కవిరి | 1 తు |
| మాచికాయలు | 1 తు |
| కలినీరు | అర్ధ సేరు |

కలిపి త్రాగించవలెను.

2 
| | |
|---|---|
| సొంటి | 2 తు |
| పిప్పళ్లు | 1 తు |
| జీరియములు | 2 తు. |

మజ్జిగ అర్ధ శేరు
కలిపి త్రాగించవలెను.

## రక్తవిరేచనములు - Dysentery.

1 పెసలగుగ్గిళ్ళు సోలెడు
పేరినెయ్యి అర్ధ శేరు
కలిపి మూడువేళల పెట్టవలెను.

2 సీమసున్నము ఒకటింపావు తు
నేలవేము ఒకటింపావు తు
ఇంగువ ఒకటింపావు తు
బెల్లము రెండున్నర తు
గంజి అర్ధ శేరు
కలిపి త్రాగించవలెను.

## మలబద్ధకము - Constipation

1 ఉప్పు 8 చటాకులు
తంగేడుచెక్క ఒకటిన్నర తు
గంజి అర్ధ సేరు
కలిపి త్రాగించవలెను.

2 చింతపండుపులుసు పావు శేరు
ఉప్పు చేరెడు
కలిపి త్రాగించవలెను.

## జలుబు - Catarrah.

1 పొటాసియంక్లోరేట్ 10 తు

| | |
|---|---|
| కర్పూరము | రెండున్నర తు |
| మంచిబెల్లము | 20 తు |

లేహ్యముగా చేసి నాలుకమీదవేసి నాకించవలెను.

| | | |
|---|---|---|
| 2 | వాము | 2 తు |
| | నీరుల్లిపాయలు | ఒకటింపావు తు |
| | హారతికర్పూరము | ఒకటింపావు తు |
| | సూరేకారము | ముప్పావు తు |

కలిపి ముద్దచేసి నాకించవలెను.

---

# పశుచికిత్సాలయము - అంగలూరు.



చికిత్సాలయముయొక్క ముఖ్యోద్దేశ్యములు.

1 అన్ని తాలూకాలలోను మా పశుచికిత్సాలయము నకు శాఖానిలయములు స్థాపించి పశువైద్యమును వ్యాపింప జేయుట.

2 మాపశువైద్య గ్రంథనిలయము తరఫున మంచి మంచి నూతనపశువైద్య గ్రంథములను వ్రాయించి విజ్ఞానమును వ్యాపింపజేయుట.

3 కాలపరిస్థితుల ననుసరించి పశురోగములను గూర్చి అన్ని వార్తాపత్రికలద్వారా రైతులకు తెలియజేయుట.

4 అనుభవమువలన అనేకమందు లుపయోగించునటుల తయారుచేసి కోరినవారికి స్వల్పమూల్యమునకు పంపుట.

5 పశువైద్యములో అనుభవముగలవారిదగ్గరకు వెళ్ళి వారిని సహాలడిగి వార్తాపత్రికల ద్వారా రైతులకు తెలియ జేయుట.

6 బీదల పశువులకు కలుగువ్యాధుల కుచితముగా వైద్యముజేయుట.

7 భాగ్యవంతులదగ్గర పశువున కగు మందుఖర్చులు మాత్రము తీసికొనుట.

# పశునేత్రాంజనము

పశువులకు కలుగు నేత్రరోగముల తొలగించుటలో పెట్టినదిపేరు. ఇది మిక్కిలి సారవంతమగు అనేక వనమూలి కలతో, పుష్పాదిసారములతో తయారుచేయబడినది. ఈ మందు, కంటితెలుపులు, పువ్వులు, దురదలు, మంటలు, గర గరలాడుట, దెబ్బతగిలి నీరుకారుట, పుసులుకట్టుట మొద లగు సమస్తవ్యాధులకు గ్యారంటీగా పనిచేయును.

డబ్బీ వెల రు 1-0-0

---

# పశువ్రణహారిమలాము

ఈమందు పశువులకు కలుగు అరివాపులు, కల్ల వాపులు, బెణుకులు, మొరదువుండ్లు, మలిమిడికంటు, వాత నొప్పులు, మోర్లు మున్నగు వ్యాధులకమోఘముగా పని చేయును. అనేకమంది పశువైద్యుల మెప్పువడసినది. ఎంతో అనుభవముమీాద తయారుచేయబడిన దివ్యమైన ఔషధ రాజము.

డబ్బీ వెల రు 1-0-0

---

# తోకక్రిమిసంహారిణి

పశువుల తోకలకుగలుగు వ్యాధులకు సరియైన మందులు లేక ఏయాకుపసరుపోసియో యే మోటువైద్యము చేసియో తోకలను నరికియో వాతలువేసియో రైతులు పశువులను కష్టములపాలు చేయుచున్నారు. ఈవ్యాధులకు తోకక్రిమి సంహారిణి అమోఘమైనమందు. రైతుసోదరు లెందరో వాడి చూచి దీని నెంతో ప్రశంసించియున్నారు.

డబ్బీ వెల రు 1-0-0

---

# గోమారుతైలము

ఈమందు నూతనముగా కనిపెట్టబడినది. ఏ వైద్య శాస్త్రములోను ఇంతవరకు గోమారులవిషయమై సరియైన మందులేదు. అద్భుతముగా పనిచేయును. మాపశుచికిత్సాలయమునకు ప్రత్యేకముగా విచ్చేసి జమీందారులు, భూస్వాములు, ఆఫీసర్లు తమ కుక్కలకు పశువులకు తీసికొని వెళ్ళి ఉపయోగించి నాకు యోగ్యతాపత్రములు పంపుచున్నారు. ఇంతియే కాకుండ అనేకమంది పశువైద్య ప్రవీణులచే పొగడ్తగాంచిన ఔషధరాజము.

సీసా వెల రు 1-0-0

---

షరా:- అనుపానపత్రికలుగూడ మందులతోనే పంపబడును

---

# ప్రముఖుల యభిప్రాయములు.

చిత్తూరుజిల్లాబోర్డు ప్రెసిడెంటును, జస్టిస్ పక్ష నాయకులు నగు శ్రీయుత బొల్లిని మునిస్వామి నాయుడు, బి. ఏ, బి. ఎల్, సి. గారును, గుంటూరుజిల్లాబోర్డు ప్రెసిడెంటును, గొప్పభూస్వామియు, నెఱదాతయునగు శ్రీయుత జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి ఎం. ఎల్. సి. గారును; కమ్మసంఘాధ్యక్షులును, భూస్వాములును సహృదయహృదయులైన కొమ్మారెడ్డి పట్టాభిరామయ్య చౌదరిగారును; డాక్టర్ పల్లంపాటి గోపాలకృష్ణయ్య పి. హెచ్ డి (కార్నెల్) యు. యస్. ఎ. గారును ఈవిధముగా తమతమ అభిప్రాయముల నిచ్చియున్నారు.

"అంగలూరు గ్రామములో నూతనముగా స్థాపించి స్వయంకృషివల్ల ఆర్జించిన విజ్ఞానమును వినియోగించి ఎంతో ఉత్సాహముతో పశుచికిత్సలుచేయుచున్న శ్రీయుతులు యేజెళ్ళ శ్రీరాములు చౌదరిగారి వైద్యాలయము చూచుట తటస్థించినది. మిక్కిలి ఆనందము కలుగజేసినది. వీరు సల్పుచున్న దేశసేవ గణనీయము. వీరి కార్యదీక్ష మనము కొనియాడవలసి యున్నది"

2 ప్రొఫెసర్ ఎన్. జి. రంగనాయకులు బి. లిట్ (ఆక్సుఫర్డు) చీఫ్ ప్రొఫెసర్ ఆఫ్ హిష్టరీ అండు ఇకానమిక్సు, పచ్చయప్ప కళాశాల, రీసెటిల్ మెంటు సెక్రెటరీగారును; మాగంటి బాపి

నీడు బి, యస్. సి. (కార్నెల్) యమ్. యస్. సి. (కాలిఫో ర్నియా) ఎగ్రికల్చర్ గారును; పశువైద్యాభిమానులగు మూల్పూరి కాశీచౌదరి బి. ఏ. బి. యల్ గారును ఈవిధముగా తెలిపియుండిరి.

"యేశెళ్ళ శ్రీరాములు చౌదరిగారు ఆయుర్వేద పశువైద్యమునుగురించి ఆచరణయోగ్యమగు చక్కని వ్యాసములను వ్రాయుట గతసంవత్సరమునుండి గాంచుచుంటిమి. నేడు వారు వైద్యాలయము నొకదానినికూడ స్థాపించి కొన్నిమాసములనుండియు మిక్కిలి జయప్రదముగ నిర్వహించుచున్నారని వినుట కెంతయు సంతసము. పరిసర గ్రామాదులనుండి కూడ పశువులు చికిత్సకై కొనిరాబడుచున్నవని రిజస్టరువల్ల తెలియుచున్నది. ఇట్టి పశువైద్యానుభవముతో శ్రీరాములు చౌదరిగారు పత్రికాపాఠకులగు ఆంధ్రరైతులకు ఆంధ్ర జన బాహుళ్యమునకు పశువైద్యమును బోధించి వ్యాప్తిచేయ గలుగుదురని మనఃపూర్వకముగ విశ్వసించుచున్నాము."

8 గుంటూరు శారదానికేతన ప్రెసిడెంటుగారును, కాంగ్రెసు నాయకులును, బ్యారిష్టరు శ్రీయుత ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారును; పశువైద్యాభిలాషియు, త్యాగియు నగు కల్లూరి చంద్రమౌళి బి. యస్. సి. (వ్యవ) బర్డీగారును; సంగీతవిద్వాన్ పర్వతనేని వీరయ్యచౌదరిగారును ఈవిధముగా తెలిపియుండిరి.

"యేజెళ్ళ శ్రీరాములు చౌదరిగారు పశువైద్యశాస్త్ర మునుగూర్చి తరచుగ ఆంధ్రపత్రికలో మిక్కిలి విలువగల వ్యాసములను వ్రాయుట మెరుగుదుము. వారిచే స్థాపింపబడి జయప్రదముగ నడుపబడుచున్న పశువైద్యశాలను సందర్శించ డముచేత వారు కేవలము వాక్శూరులుగాక కార్యశూరులని తేటబడినది. పశువులకు వైద్యసహాయము లేకపోవుటచే చీడలు మొదలగు వ్యాధులు క్రమ్ముకొనినపుడు వందలకొలది పశు వులు నశించడమును, అందుచేత వ్యవసాయమునకు ఆటంక ములు కలుగడము మనము తరచు చూచుచున్న విషయమే. ఇట్టి వైద్యశాలలు ప్రతియూరిలోను స్థాపించడము అవసరము. గ్రామనిర్మాణమునకు దారిజూపి దేశీయులకు మార్గదర్శకు లైన శ్రీచౌదరిగారికి మామనఃపూర్వకవందనము లర్పించు చున్నారము. గ్రామస్థులును, యితరులును, శ్రీవారికి తగు సహాయముచేసి వారి యుద్యమము జయప్రదముగను నిరంతరా యముగను కొనసాగుటకు తోడ్పడుదురని కోరుచున్నాము."

4 కమ్మసంఘాభిమానియు, చిత్తూరువాస్తవ్యులు నగు శ్రీయుత వరుచ్చూరు సుందరవరదులుగా రిట్లు తెలిపియుండిరి.

"అంగలూరు వాస్తవ్యులగు శ్రీయుత యేజెళ్ళ శ్రీరా ములు చౌదరిగారిచే సంస్థాపింపబడిన శ్రీ పశుచికిత్సాలయము నేను దర్శించి యమందానంద మొందితిని. వీరు భారతభాగ్య లక్ష్మియగు గోగణసముద్ధరణకు వెలయు గ్రంథసముదాయ

మును రచించుటతో తృప్తినొందక పశుచికిత్సా సూత్రముల నాచరణపూర్వకముగ ప్రకటింపదలచి యీ వైద్యనిలయమును నెలకొల్పి కార్యశూరత్వమును ప్రదర్శించియున్నారు. వీరు పశువైద్యచింతామణి, పశువ్రణచికిత్స, పశునేత్రచికిత్స మున్నగు గ్రంథములయందు చేర్కొనిన వైద్యవిధానములకు వలయు మూలికలు, మందులు, మున్నగువానిని స్వీకరించి ప్రతిదినము వీరివద్దకువచ్చు పశువులకు చికిత్సలనుసల్పి ఆంధ్రదేశజులగు రైతువర్గమున కమూల్యసాయ మొనరించుచున్నారు. వీరు యువకులయ్యును చికిత్సలయం దపూర్వమగు యనుభవమును జూపుచున్నటుల "పశుప్రవేశపట్టిక" విశదము చేయుచున్నది. పశుపోషణమునెడల నుదాసీనత ప్రబలుచున్న యీకాలములో నిట్టి సముద్ధరణోద్యమ మెంతయు నవసరము. వర్తమాన భారతదేశమున కత్యంతావసరమగు పశుపోషణము నెడల వీరు వహించుచున్న శ్రద్ధాభిమానముల నెంతయు నుగ్గడించుచు వీరి సదుద్యమమును సర్వమంగళప్రదాతయగు నాభగవంతు డాశీర్వదించుగాకయని ప్రార్థించుచున్నాను.

---

## పశువైద్య చింతామణి.

మీపశువులు సురక్షితముగా నుండవలెననినచో ఈ పశువైద్య చింతామణి మీదగ్గరనున్న చాలును. ఇది చక్కని

తేలికశైలిలో రచించబడిన గ్రంథము. దీనిలో పశువులడాక్టర్ల యొక్కయు, ఇంగ్లండు కాలిఫోర్నియా మొదలగు పట్టణములలో శాస్త్రములందు తీర్ణులైన వ్యవసాయశాస్త్రజ్ఞులయొక్కయు ఆమోఘమైన అభిప్రాయములు గలవు. ఈవత్సరము పశువులకు సంభవించిన పెద్దరోగములకు ఈగ్రంథము ప్రకారము చికిత్సలు చేయగా కొన్ని గ్రామాదులలో కొన్నివందల పశువులు బ్రతికినవని నాకు యోగ్యతాపత్రములు పంపియున్నారు. మొదటికూర్పు 200 పేజీల గ్రంథము. ద్వితీయకూర్పు 400 పేజీల గ్రంథము.

---

## సదభిప్రాయములు.

సామర్లకోట ఫారం మేనేజరుగారగు గోటేటి జోగిరాజు పంతులు, డిప్లొమేట్ అండ్ మెడలిస్టు యిన్ ఎగ్రికల్చర్ గారిట్లు తెలిపియుండిరి.

“తమ పశువైద్యచింతామణి చదివితిని. సామాన్యముగ అందరికి లభ్యమగు వస్తువులతో సామాన్య తెలివితేటలుగల రైతులందరును తమ గ్రంథసహాయమున తమ పశువులకు గలుగు పెక్కువ్యాధులను సాధించుకొన గలుగుదురనుటకు సందేహము లేదు. రైతులలో చాలమంది యిట్టి సుభశైలిలో వ్రాయబడిన గ్రంథములనైనను చదివి లాభమును బొందలేని స్థితిలోనుండుట చాల శోచనీయము.”

2 శ్రీయుత బరంపురం పశువుల డాక్టరుగారగు ఆకెళ్ళ లక్ష్మీనారాయణ సోమయాజులు జి. యం. వి. సి., వెటరినరీ సర్జన్‌గారిట్లు తెలిపియుండిరి.

"మీరు పంపించిన "పశువైద్య చింతామణి" అను పుస్తకము చదివి చాలా సంతోషించితిని. మీచిన్ని పుస్తకము పురాతన దేశీయ వైద్యమును నవీన ఆంగ్లేయ వైద్యమును మిశ్రమము చేసి వ్రాసిన గ్రంథము గనుక బాగుగా నుపయోగము గలది గావచ్చునని నానమ్మకము. పల్లెగ్రామములోని రైతులకు చాలా ఉపయోగించును. మీయుద్యమము ప్రశంసనీయము."

3 శ్రీయుత బందరు పశువుల డాక్టరుగారగు లక్కరాజు కుమారస్వామి పంతులు జి. యమ్. వి. సి. పోస్టుగ్రాడ్యుయేట్ వెటరినరీ అసిస్టెంటు సర్జన్‌గారిట్లు తెలిపియుండిరి.

"మన దేశములోని రైతులకు పశువులనుగూర్చి, పశువాధ్యులను గూర్చి శాస్త్రజ్ఞానము బొత్తిగాలేదు. ఇట్టివైద్యుల (వెటరినరీడాక్టర్ల) సలహా దొరకనప్పుడును ఈనూతనముగా వెలువడిన పశువైద్య చింతామణియను సద్గ్రంథము మన ఆంధ్రరైతులకు ప్రారంభ చికిత్సలయందు యెక్కువ తోడ్పడగలదని నమ్ముచున్నాను."

4 శ్రీయుత పంచాగ్నుల సుదర్శనరావు పంతులు, బి. ఏ. యల్. టి గారిట్లు తెలిపియుండిరి.

" ప్రస్తుత కాలపరిస్థితుల ననుసరించి ప్రతిప్రియిమరీ విద్యార్థి కర్థమగునటులే సులభశైలిలో వ్రాసిన "పశువైద్య చింతామణి" యను గ్రంథముమాత్రము కన్పడుచున్నది. దీనిలోనున్న చికిత్సలు ప్రతిగృహమునందు దొరకు ఆయు ర్వేద వస్తువులతో సమకూర్చబడినది. దీనికి గ్రంథకర్త యేజెళ్ళ శ్రీరాములు చౌదరిగారు. ఈచింతామణి చదివి మూలపారవేయుటకు ఒకనవల కాదు; నాటకముకాదు. రయితు సోదరులారా! ఈగ్రంథమును తెప్పించిచూడుడు. ముమ్మాటికి తెప్పించిచదువుడు."

5 శ్రీయుత ఆంధ్ర యువజనసంఘకార్యదర్శిగారగు సి. హెచ్. జనార్దనరావునాయుడు, బి. యే., బి.యల్ గారిట్లు తెలిపియుండిరి:—

"ఇప్పటి పరిస్థితుల ననుసరించి రైతుల కుపయోగకర మగు నొక అమూల్యగ్రంథమును కృష్ణాజిల్లా అంగలూరు నివాసులగు శ్రీయుత యేజెళ్ళ శ్రీరాములు చౌదరిగారు వ్రాసిరి. ఓరియంటల్ మెథడ్సు ప్రకారము ఈ గ్రంథము వ్రాయబడుటచే ప్రతికృషీవలునకు అత్యంతావసరమని రూఢిగ చెప్పగలను. ఈగ్రంథమందు వ్రాసిన పశువైద్యశాస్త్రజ్ఞుల అభిప్రాయములే ఈగ్రంథమహిమను తెలుపుచున్నవి.

ఈ చింతామణి విషయమై అభిప్రాయము లిచ్చిన పత్రికలు:—

ఆంధ్రదిన-వారపత్రికలు, భారతి, సమదర్శిని, కాంగ్రెసు, గోలకొండ, సత సాధని, ధర్మసాధని, తెలగ, ఆంధ్ర క్రైస్తవ, త్రిలింగ, పద్మశాలి, యాదవ మున్నగు పత్రికా రాజములు.

---

# పశువైద్యగ్రంథనిలయము,

## అంగలూరు

| | |
|---|---|
| ప్రథమపుష్పము | పశువైద్యచింతామణి |
| ద్వితీయపుష్పము | పశువ్రణచికిత్స |
| తృతీయపుష్పము | పశునేత్రచికిత్స |
| చతుర్థపుష్పము | పశువైద్యవస్తుగుణదీపిక |

వలయువారురిటువ్రాయవలెను:—

యేజెళ్ళ శ్రీరాములు చౌదరి,
వెటర్నరీ ఆయుర్వేద వైద్యశాల,
అంగలూరు, (కృష్ణాజిల్లా).

---